

సంపుటము 21
సంచిక 1

భారతి

స్వభాను పుష్యము
1944 జనవరి




# స్వవిషయము

పరమేశ్వరానుగ్రహమున భారతిజీవిత యాత్రలో ఇరువది యేండ్లు నిరంతరాయముగా గడచిపోయి, నేటితో ఇరువదొకటవ యేడు ప్రారంభమైనది. ఈ రెండు దశాబ్దులలోను అనేకములైన ఆటుపోటులకు తాళుకొని, నిబ్బరముగా నిలిచి, భారతి ఆంధ్రసాహిత్య వికాసమునకు పాటుపడుచు వచ్చుచున్నది. ఈ కృషిలో భారతి ఇప్పటి కేకించిత్తయినను సాధించియున్నదన్నచో అదియే స్థాపకుల కాత్మశాంతి నిచ్చి, నిర్వాహకులకు నిరతిశయమయిన సంతోషమును కలిగించుటకు కారణము కాగలదు. భారతి స్థాపించిన ఆశయముకూడ చరితార్థమయినదనుటకు అదియే ప్రబల నిదర్శనము. భారతి యింతవరకు చేసిన యీ సారస్వత సేవకు మూలకారణము భగవంతుని కృపాకటాక్షము, మా పాఠక - వ్యాసకర్తృ - హితచింతకుల ఆదరాభిమానములేయనుట అతిశయోక్తి కాదు. వారి మేలు మేము మరువలేము. వారి కందరికిని మా వందనము లర్పించుచున్నాము.

ఆంధ్ర సారస్వత విజ్ఞాన వికాసమునకై బయలుదేరిన భారతి పుట్టినదాది తదేకదీక్షతో కృషిచేయుచున్నది. ఆంధ్ర సారస్వతము నేడు కాలానుగుణముగా అభివృద్ధి పొందుచుండుట చూచి మేము చాల సంతోషించుచున్నాము. కాని, సాటి సారస్వతములతో పోటీలుపడి పరుగులు దీయు ఆ ఉత్సాహావేశములలో మనవారు చాలమంది మనకు సహజమైన తెనుగుదనమును, తెనుగు నుడికారమును, తెనుగుజాతీయతను పూర్తిగా విస్మరించుచున్నారను శంక సహృదయులను బాధించుచున్నది. మన తెనుగు గృహములలో, తెనుగు సంఘములో, తెనుగునాట నిత్యజీవితమునందు మన కండ్లకు కనబడుచున్న వాతావరణము గాని, పాత్రలు గాని, ప్రవర్తనలు గాని, దృశ్యములు గాని నేటి రచనలలో మృగ్యమగుచున్నవి. మన సాహిత్యము మన ప్రజల నిత్యజీవితముతో అనుబంధముకలదైయుండవలెను గాని, పరదేశముల ప్రజలతోను, వారి ప్రవర్తనలతోను, విదేశీయ గ్రంథావళితోను అనుబంధము

గలిగియుండరాదు. మన సాహిత్యరచనలలో సృష్టింపబడు పాత్రలును, వాని ప్రవర్తనలును మన ప్రజలకును, వారి ప్రవర్తనలకును ప్రతిబింబములుగా నుండుట ధర్మము గాని, పరదేశ ప్రజలకు ప్రతిబింబముగా నుండుట ధర్మముకాదు. మన రచనలలోని పాత్రలు మన సాంఘిక వ్యవస్థలకును, మన సంప్రదాయములకును, మన ఆచార వ్యవహారములకును అనుగుణమై పొందిక గలిగియుండవలెను. నేటి సాహిత్యములో ఈ తెలుగుదనము లోపించుచుండుటకు కారణములు బహిరంగములే. నేడు మనకు సంప్రాప్తమైన పాశ్చాత్య విద్యావిధానము, పాశ్చాత్య సంప్రదాయానుకరణము, పరభాషా వ్యామోహము, పరప్రభుత్వము మొదలైనవి చేరి మనలో దేశీయతను రూపుమాపి వేయుచున్నవి. ఇది జాతిగౌరవమునకును, సభ్యతకును, సాహిత్యాభివృద్ధికిని ప్రమాద హేతువు. మన విద్యాలయములలో దేశభాషలద్వారా పఠనపాఠనములు లేకపోవుట, పరభాషయే ప్రాముఖ్యము వహించుచుండుట, విద్యావిధానమునందు దేశీయతకు స్థానము చాల తక్కువగా నుండుట మొదలైనవి ఆ ప్రమాదహేతువునకు దోహదములగుచున్నవి. ఈ విషయమున విద్యావేత్తలును, బోధకులును శ్రద్ధవహించి ఈ ముప్పును ముదరక ముందే తొలగించుట ముఖ్యావశ్యకమైయున్నది.

ఈ ఒక్క అంశమును మినహాయించినచో ఆంధ్రసారస్వతమునందు కనబడుచున్న ఈ వికాసమునకు భారతి చాల మురిసిపడుచున్నది. ఇంకను ఎక్కువ వికాసము కలుగవలెనని భారతివాంఛ. ఒక్క సారస్వతముననే కాదు, విజ్ఞానశాఖ లెన్ని యున్నవో అన్నింటను ఆంధ్రులలో వికాసము కలిగించవలెనని భారతికోరిక. "అసతో మా సద్గమయ, తమసో మా జ్యోతిర్గమయ."—ఇదియే భారతిమూలమంత్రము. భగవత్కృపవల్లను, భాగవతాశీర్వాదమువల్లను భారతివాంఛలు ఈడేరకపోవని మా దృఢవిశ్వాసము.

నిరుడు ఆంధ్ర సాహిత్య రంగములో అమోఘమైన చైతన్యము పొడచూపుట ముదావహము. సాహిత్య చైతన్యమే జాతి జీవనమునకు మూలకందము. అది లేని జాతి రాణకెక్కదు. ఆ చైతన్యము గతమునకన్న ఇబ్బడి ముబ్బడిగా వృద్ధిపొందవలెనని కోరుచున్నాము. అట్లు జరుగునను చిహ్నాలుకూడ పొడచూపుచున్నవి. అటువంటి చైతన్య స్రవంతిలో నావగా నుండుటకు భారతి సంసిద్ధతను గురించి వేరుగా చెప్ప నవసరము లేదు. అంతకన్న భారతి కోరునదికూడ లేదు. గత ప్రవర్తనయే దీనికి నిదర్శనము.

ఈ సాహిత్య చైతన్యమునకు రాజకీయ బంధము లడ్డువచ్చుచున్న వని కొందరనుచున్నారు. అది వట్టి భ్రమ. దేశభవిష్యత్తును నిర్ణయింపవలసిన రాజకీయముల ప్రాముఖ్యమును గురించి కాదనగలవా రెవ్వరు నుండరు. కాని రాజకీయ దాస్యములోనే, కష్టపరంపరలందే, ఆవేదనలందే సాహిత్య మభివృద్ధి చెందిన నిదర్శనములు వందలకు కలవు. ఆదికవి వాల్మీకియే మనకు దృష్టాంతము. శోకమునుండి శ్లోకమును నిర్మించి మహాకావ్యమును మన కిచ్చినాడు.

భారతి ఇంతవరకు చేసిన సేవను మేమే ప్రస్తుతించుట మంచిపని కాదు. దాని మంచి

చెడ్డల నిర్ణయము చేయుటకు సహృదయు లైన పాఠకులే మాకంటె అర్హులు. ఈ యిరువదేండ్ల జీవితమును భారతి ఏకధాటి గానే గడపుచువచ్చినది. దేశకాల పరిస్థితు లను బట్టి అలతిఅలతి మార్పు లేవైనను కని పించునేమో కాని మూలస్వరూపమున మాత్రము లోపమురానీయక జాగ్రత్తగా నడుపుకొనివచ్చుచున్నాము. ఇంకను ఎం తెంతో చేయువలెనని కొండంత ఆశయున్నది. కాని దేశము నావరించియున్న విషమస్థితి గతులలో, ప్రజలనుభవించుచున్న చిత్త క్షోభలో మా చేతులు కట్టినట్లయిపోయి నవి. ఈ ప్రళయమేఘములు తెరపి యివ్వ గానే యితోధికమైన సేవ నిరాఘాటముగా సాగింపగలమని విశ్వసించుచున్నాము.

ఈ సందర్భమున ఒక్క విషయము చెప్పవలసియున్నది. సారస్వతములోను, సారస్వత శాఖలలోను కనబరచుచున్న శ్రద్ధాసక్తులు ఆర్థిక శాస్త్రము, పరిశ్రమలు, విజ్ఞానశాస్త్రములు మొదలైన విషయము లందు రచయితలు చూపుటలేదు. ఇది శోచనీయమైన విషయము. దేశమునకు సాహిత్యము శోభను కలుగజేయును. ఇతర శాస్త్రములు సౌభాగ్యమును కలుగజేయును. ఈవిషయములలోకూడ ఆంధ్రులయం దుత్తే జము కలిగింపవలసిన బాధ్యత రచయితలపై నున్నది. ఆరితేరిన శాస్త్రవేత్తలకు ఆంధ్ర దేశము గొడ్డుపోలేదు. అటువంటి మహా సీయు లందరును ముందుకువచ్చి, ఆయా విషయములను గురించిన చక్కని వ్యాసము లను మాకు దయచేయవలె నని కోరుచు న్నాము. ఈవిషయములను గురించి కూడ ఎక్కువ శ్రద్ధతో, పూనికతో పాటుపడవలె నని మేముసంకల్పించుకొన్నాము. రచయితల సాయము కోరుచున్నాము. కొత్త సంవత్సర ములో మా కార్యక్రమమున కిది 'శ్రీరస్తు.'

ఇంతవరకును మాకు తోడ్పడుచు వచ్చినవారి కందరికిని. మరొకసారి మా కృత జ్ఞతను తెలుపుకొనుచున్నాము. ఈ విధినిర్వ హణములో మానవమాత్ర సహజములైన లోపాలోపము లెన్నో మాయందు కలిగి యుండవచ్చును. వానిని మరచిపోయి, మా కృషికి వెనుకటికంటె ఎక్కువగా తోడ్పడ వలె నని వారిని కోరుచున్నాము.

ఈ నూతన వత్సరమున మా హిత చింతకు లందరికిని సమస్త సన్మంగళములను సమకూర్పవలె నని సర్వేశ్వరుని ప్రార్థించు చున్నాము.

—సంపాదకుడు, భారతి.



# వరూధినీ కలభాషిణులు



= శ్రీ వడలి మందేశ్వరరావు =

ఆంధ్రసారస్వతంలో రసికుల్ని చిక్కుపరుస్తున్న పాత్రలలో వరూధినీ కలభాషిణులు వింతస్థానాన్ని ఆక్రమించుకున్నారు. ఇద్దరూ కూడా ఒకే శకానికి చెంది, ఉత్తమ పాండితీప్రతిభలు కల కవుల సృష్టికి చెందినవా రవడంచేత కొంత అతి సూక్ష్మమయిన సామ్యం, అంతకంటే యెక్కువ వైరుధ్యం మనకు గోచరించితీరాలి. ఇద్దరిలోనూ ప్రబంధకవితకు దారితీసిన ప్రౌఢకవి పెద్దనగారి అనుంగుబిడ్డ వరూధిని అనీ, చిత్ర విచిత్రపు పోకడలు పోగల సూరనగారి సృష్టి కలభాషిణి అనీ మనకు తెలిసిన విషయమే.

పుట్టుకచేత యిరువురూ కూడా దేవసంఘంలోనూ, మానవసంఘంలోనూ వెలయాలి వంగడానికి చేరిన వ్యక్తులే. అయినా యిరువురిలోనూ కూడా అంత శీలరాహిత్యం గోచరించేటట్టు చేయలేదు యిద్దరు కవులూకూడా. వరూధిని ప్రవరునిపై బడటాన్ని పురస్కరించుకొని ఆమె నికృష్టస్త్రీ అనుకోవడం సాహసం. పుట్టుకచేత గంధర్వుడు; అంగభవ విద్యాపారగుడు; తన్ను వలచాడు; రాగముచేత అంగుడు. అట్టివాణ్ణి వరూధిని తిరస్కరించింది. అటువంటి స్త్రీని మనం కేవలం సాధారణస్త్రీలతో పోల్చడానికే వీలులేదు. ఆమెలో కూడా సంయమం లేకపోలేదు. కాని ప్రవరుని అపూర్వ జితేంద్రియత్వంవల్ల వరూధినిచేష్టలు తుదిని కొంచెం వెగటు కొల్పుతాయి. కాని మన సానుభూతికి కూడా పాత్రురాలవుతోంది. కలభాషిణిలో యింతకంటే మిక్కుటమైన సంయమం గోచరిస్తుంది. నాలుగు వత్సరాలు ఒకే దుర్లభుడైన ప్రియుడికోసం బెంగపడి, కోర్కె పైకి వెలిబుచ్చకుండా కాలం గడిపింది. అంతేకాక—

“.............వారవనిత పలుకు
లిచ్చకంబు లనక యెవ్వరు నమ్మన
రతియుఁగాక దృష్ట మన్యవాంఛ.”

అంది. ఇక్కడ గంభీరమైన ఉద్వేగము, సత్యప్రతిష్ఠాశక్తి, కామనిరోధనాశక్తి మనకు గోచరింపక పోవు. అన్నిటికంటె ముఖ్యంగా ఆమె తనకు రాబోయే జన్మలో పాతివ్రత్యాన్నే ఒక భాగ్యంగా కోరుకుంటుంది. ఇట్టి స్త్రీనిగురించి అనుమానించడం కేవలం పొరబాటు.

ఇంతేకాక వారిద్దరూ కూడా అసామాన్య వ్యక్తుల్ని ప్రేమిస్తారు. వరూధిని గంధర్వాంగన; మానవుని పొందు కోరింది. కలభాషిణి మర్త్య; గంధర్వుణ్ణి వలచింది. ఆ వ్యక్తులు వారికి అలభ్యమౌతారు. పిదప యిద్దరూ కూడా ప్రియులచేత లాలనలు పొందుతారు; కాని యిద్దరూ మాయాప్రియులే! ఇద్దరూ వీరిని అంతకుపూర్వమునుండి వలస్తున్నవారే!!

విద్యావిలాసాలలో కూడా కొంత సామ్యం గోచరిస్తుంది. ఇరువురూ గాంధర్వవిద్యలో ఆరితేరారు; నర్తననైపుణీవిలాసాలలోనూ, సౌందర్యములోనూ వారికి యీడు మరి కలదనగరాదనే ప్రశంసకు పాత్రులైనారు. ఇరువురికీ పూదోటలన్నా, సింగారములు మెఱయగా చెలికత్తెలతోడుత విహారాలన్నా అపరి

మితమైన యిష్టము. ఇద్దరూ సౌందర్య పరిగ్రహణాసక్తలు; కవితాప్రియలు.

అయినప్పటికీ జన్మము తొట్టి అన్ని విషయాలలోనూ వరూథిని కలభాషిణిని తలదన్నింది. గాంధర్వ విద్యలో కలభాషిణి ముల్లోకములలోనూకూడా పాండితీప్రతిభలచేత ఇంత గాయకురాలు లేదనిపించుకుంది. కాదనము! కాని వరూథిని మనకు యెందువల్లనో ఉత్తమగాయకురాలుగా కనిపిస్తుంది. కలభాషిణి 'గంభీరమధుర స్వరమున' మణికంధరుని దండకాన్ని మనకు వినిపించింది. కాని వరూథిని—

"ఆలాపగతిఁ జొక్కి యరమోడ్పుఁ గనుదోయి
రతిపారవశ్యవిభ్రమముఁ దెలుపఁ
బ్రౌఢి పలికించు గీతప్రబంధముల"

యెదుట కలభాషిణి సామాన్య గాయకురాలుగా తోస్తుంది. వరూథినిలో పాదుకున్నంత గాఢంగా కలభాషిణిలో ఆ కళాహృదయం, అనుభూతి లేకపోవటమే హేతువు కావచ్చు. కలభాషిణికి కవితను అనుభూతిలోనికి తెచ్చుకునే సామర్థ్యం లేకపోలేదు. కాని వరూథిని జన్మతః కవయిత్రి; గాయకురాలు; చిత్రకారిణి. ఆమెలో యీ చిన్నకళలన్నీకూడా యేదో ప్రోగుగా యేర్పడినట్టు తోస్తుంది. ఆమెను తెలియకుండానే ఆమెమాటలు భావనాస్ఫూర్తమౌతుంటాయి. మన్మథుని దూషించేటప్పుడు "రతిలోచనాంబువుల వాన నిగిర్చితే!" అని నిట్టూర్పు విడుస్తుంది. అంతేకాదు, ఆమె చేసే ప్రతీ చేష్టలోనూ యీ కళాహృదయం ధ్వనిస్తూంటుంది. ఆమె విహరించే తావులు కావ్యవస్తువులే. గాంగసైకతాలు; లవలీనికుంజాలు; చిగురుమావుల సంజనిగుడుతావులు; మాణిక్యదీపముల్ మలయు తావులు; శారిక లనంగశాస్త్రముల్ చదువు చోటులు—లెక్కకు మిగిలినన్ని చూపవచ్చును. ఆమెకు భోగ్యవస్తువులుకూడా అట్టివే. ఒక్కమాటలో తరియంగరాని సౌఖ్యమును చవిచూపింది.

"సద్యోవినిర్భిన్న సారంగనాభికా
హృతమై పిసాళించు మృగమదంబు."

ఇట్టి సౌందర్యపరిగ్రహణాసక్తతకు భావనకూడా తోడయింది. అదే ఒకణ్ణి కవిగాను, వేరొకనిని గాయకునిగాను, చిత్రకారునిగాను చేసే మహత్తరశక్తి. వరూథినిభావనాబలం చాలా గొప్పది. అందుచేతనే ఆమె చక్కటి గాయకురాలు కాగలిగింది; అంత చక్కగా భాషింపగలిగింది. ఈ భావనవల్లనే ప్రవరుణ్ణి వశపరుచుకో యత్నిస్తుంది. చక్కటి చిత్రకారిణివలె "ఇక్షుశరాసనసాయకవ్యథాక్షిన్నత వాడి, వత్తలయి, కేలఁ గపోలము లూది, చూపులన్ విన్నఁదనంబు తోఁపఁగను వేఁడుటునం బయిగాలి సోఁకినన్ వెన్నవలెం గరంగు నలివేణుల" పొందును గూర్చి ముచ్చటించేటప్పుడు ఆ భాషామాధుర్యం వల్లనో, ఆ చిత్రనిరూపణాశక్తివల్లనో, ఆ భావనలోని అకుంఠిత ప్రతిభవల్లనో, రాలను వెన్నవలె కఱంచు ఆ మాటలలో అణగిమణగియుండే గానస్పర్శచేతనో, యేదో విచిత్రవాతావరణం సృష్టింపబడింది. ఆమె యిక్కడ ఉత్తమోత్తమ శ్రేణికి చెందిన కవయిత్రి కాగలిగింది.

ఇటువంటి శిల్పము మనకు కలభాషిణిలో వెదకి వెదకి చూసినా కనుపించదు. ఆమెమాటల్లో ఒక్కొక్కప్పుడు విలాసపూరితమైన భావన (Fancy) గోచరించవచ్చు. "చలువగల వెన్నెలల చెలువునకు సౌరభము కలిగినను" అనే పద్య మాశ్రేణిలో చేర్చవచ్చునేమో! కాని కవితను కవితగా గ్రహిస్తే వరూథినిదే పైచెయ్యి. అయితే దానికి హేతువు పెద్దన, సూరనలలో కనిపించే భేదమే. పెద్దన సౌందర్యోపాసి; సౌందర్య ద్రష్ట; ముఖ్యమయిన విషయాల్ని రెంటిని కండ్లయెదుట పెట్టి, వస్తువును ఉత్తమకవితావీథులలోకి తీసికొనిపోతాడు. అయితే సూరనకూడా తీసిపోడు. అతనుకూడా యీ విషయంలో గడసరే. కాని పోల్చిచూస్తే పెద్దనకంటే కొంచెం పిన్నవానిలా గోచరిస్తాడు. అదీగాక పెద్దనలో సూరనలో లేని భావోన్మత్తత మూర్తీభవించింది. గానవిషయప్రస్తావనలో వరూథిని "ఆలాపగతిఁ జొక్కి యరమోడ్పుఁ గనుదోయి రతిపారవశ్య విభ్రమముఁ దెలుప" వీణను పలికిస్తుంది అంటాడు. ఇది భావుకాక అపూర్వపు

టీవిగా భావించుకోవలసివస్తుంది. ఇలాగే షెల్లీ కవి " Music sweet as love " అంటా డొకచోట. అవ్యక్తకళావైదగ్ధ్యాన్ని హృదయ రంజకంగా చెప్పటానికి అవ్యక్తమైన వేఱొక అనుభూతితో పోల్చటమనేది మహాకవిలక్షణ మని గ్రహించిన కొద్ది కవులలో ఒక ఉత్తమ స్థానాన్ని ఆక్రమించుకుంటాడు పెద్దన. అందుచేతనే సూరనగారి కలభాషిణి కన్న పెద్దనగారి వరూథిని ఉత్తమ గాయకురాలు; ఉత్తమచిత్రకారిణి; ఉత్తమకవయిత్రి.

కాని ఆ విశాలకవితావీథులలోంచి క్రిందకు అడుగుపెట్టడం ఆమెకు చేతగాని పని. ఆమె మొదటి నుంచీకూడా ప్రౌఢలాగే కనిపిస్తుంది. కలభాషిణి వారకామిని అయినప్పటికీ వరూధినికంటె గడసరి కాదు. "నీకు నారదుని శిష్యత్వము చేయ నిచ్చ వొడమె నా?" అని అడిగిన కృష్ణుని ప్రశ్నకు వరూధినిజౌతే "వినీతి నిటునటు"ఒదగదు. "అదేమియుంతే"దని సమాధాన మిచ్చియుండదు. విముఖుడైన ప్రవరునిమీద ప్రయోగించిన వరూధినితుదియస్త్రం కలభాషిణిఊహకు అందని విషయం. అంతేకాక మణికంధరుడు తన్ను వలచినప్పటికీ అతని కోర్కె తెలుసుకోలేనంతటి ముగ్ధ కలభాషిణి. మాయారంభయై రంభతో యెంత కలహాన్ని పెంచినప్పటికీ తుదకు శాపగ్రస్త కాకతప్పిందికాదు. అంతేకాని "త్రోవుపడి నిలచి, ఘనలజ్జాపరవశయై" "పాటున కింతు లోర్తురె!" అని వరూథిని అటునిటు యేడ్చిన యేడ్పులు కలభాషిణికి గగనకుసుమాలే. అంతేకాక వరూథిని ఒకసారి తిరస్కరింపబడ్డప్పటికీ, తిరిగి మాయాప్రవరుణ్ణి చూచినప్పుడు వాని చేలాంచలము పట్టుకొని లాగుతుంది. అధైర్యంతోటే ఆపని చేసిఉండవచ్చు. కాని కలభాషిణిలో యిటువంటి సాహసం మనకు గోచరించనేగోచరించదు.

అందువల్లనేకూడా కలభాషిణి మన అనురాగాభిమానాలకు పాత్రురాలౌతుంది. ఆమె మనలో వ్యక్తి. "కూకటివేణితో కురులు కూడక" ముందునుంచీ కూడా ఆమెను మన మెరుగుదుము. కథతోబాటు ఆమె పెరుగుతోంది. పుష్పవృక్షచ్ఛాయల్లో కలకలలాడుతో గోచరిస్తుంది. గంధర్వాంగన వరూథిని; మనుష్యుని భావించినప్పటికీ కంపస్వేదాదులవల్ల ఆమెలో మానుషత్వం ఆక్షణంలో గోచరించినప్పటికీ, ఆమె యెప్పుడూ ఆకాశవీథుల్లో విహరించే 'విద్యుల్లత' లాగే ఉండిపోయింది తుదివరకూ. ఆమె కష్టాలెరుగదు; నిత్యభోగి. అందువల్లనే 'నాల్గుజాల'లో 'ఇక జాలు భవం బ్బనునంత కాకకు' జిక్కింది. కాని కలభాషిణి మొదటిలో 'చలాకీపిల్ల'లా గోచరించినా చివరకు దేవత్వాన్ని, పాతివ్రత్యాన్ని కాంక్షిస్తూ తన జీవితయాత్రను చాలిస్తుంది. చిన్ననాటి కలభాషిణి సురూపి; ఆటపాటలు, కృష్ణసభకు వెళ్ళడం తప్ప యింకోపనేమీ లేదు. ఆమెలో వ్యక్తిగతమైన విశిష్టతకూడా యేమీ లేదు. కాని నారదునిదగ్గర శిష్యరికం ప్రారంభించినప్పటినుంచీ ఆమెలో మార్పు వచ్చింది. అసలు ఆమెజీవితంలో నలకూబరునిపై మనసుకలగడం, మణికంధరుడంటే ఒకవిధమైన ఆదరాభిమానాలు యేర్పడడం, నారదుడికి శిష్యురాలవడం అన్నీ యించుమించుగా ఒకేసారి సంభవించడంచేత ఆమెలో మార్పుకు అవకాశం కలిగింది. ఈమార్పు కాలంతోపాటు పరిణతిని పొందింది. గడుసుతనం నేర్చుకొని, కామరూపం ధరించగల శక్తి నలవరచుకొంది. శిష్యరికంవల్ల అపూర్వగాయకురాలు కాగలిగింది. ఆమెకోరికలన్నీ ఫలించాయి. ఆమెవలపుమాత్రం వలపులాగే నిలిచిపోయింది. మణికంధరనలకూబరు లిద్దరూ గంధర్వులే. కాని విద్యచేత, గుణగణాలచేత మణికంధరుడుత్తముడు. ఆమెను అతనిలోని మహాపురుషత్వం యేదో ముగ్ధురాలుగా చేసింది. కాని యేమి లాభం? ఒకవైపున నారదశాపభయం అలా ఉండగా అతన్ని అర్థంచేసుకోలేకపోయిందికూడా. అతడు తన కోర్కెకు 'పూచిన సంపెంగ'అయిపోయాడు. అందుచేత తన యీవలపు నిరర్థకమనీ, రసికుడైన నలకూబరునితో యెన్నటికైనా పొందు ననుభవించే యత్నంలో క్షణాలు యుగాలుగా, వత్సరాల్నే గడిపివేసింది. కాని కోర్కెమాత్రం ఫలించలేదు; సడలలేదుకూడా!

కాని తాను మర్త్యకాంత. గంధర్వుడిపై వలపు గాఢమయినకొద్దీ ఉపాయాన్వేషణకూడా మిక్కుట

మయింది. అయితే యీసందర్భంలో తనకు మణిస్తంభుడే ఆప్తుడైనాడు. అతని దూరదృష్టి, దూరశ్రవణ విద్యలకు అద్భుతపడింది. అతనివల్లనే తన మనోరథము సిద్ధిస్తుం దనే గట్టి నమ్మకంతో, స్త్రీసహజమైన లజ్జనుకూడా కొంత విడిచి, ధైర్యంగా తన కోరికతీరే ఉపాయాన్ని అడిగివేసింది. అతడు వేసిన పాచిక పారిందికూడా. అందుచేత కొంత చేదస్తంగా భాషించి తప్పనిసరి అనిపించుకొని ఆమెను తోడ్కొని పోయాడు తన వాహనంమీద.

కాని యిక్కడే ఘట్టి చిక్కు తటస్థించింది. కలభాషిణీమణిస్తంభుల యిరువురి కోర్కెలూ భగ్నమయాయి. తానొక మాయాసిద్ధుడికి బలికాబోతోం దని కలభాషిణికి తెలిసినపిదప ఆమెఆశ నిరాశ కాజొచ్చింది. పాపము, మొదటినుంచికూడా ఒకదృష్టితో చూస్తే యీమె ప్రేమవిషయంలో కష్టజీవే. వలచిన నలకూబరుడు గంధర్వుడవటమే కాకుండా, రంభా ప్రియుడై ఊరుకున్నాడు. మణికంధరుని మాట యెత్తడానికే వీలులేదు! తీరా కోర్కె సఫలమౌతుందని ఆశిస్తుంటే, మృత్యువే ప్రసన్నమయింది. పోనీ యిదీ తప్పించుకొనేసరికి, మాయజడదారి తన మానాన్ని హరించబోయాడు. అదీ తప్పి నలకూబరుడితో పొందు ననుభవించా ననుకుందుకు అతడు మాయనలకూబరుడైపోయాడు. ఆ గండం గడిచి తాను మున్నువలచిన మణికంధరుడే అని సంతోషపడదా మనుకుంటే ఆ సంతోషానికికూడా వ్యవధి లేకుండా మృత్యువే తన్నుకుపోయింది. తరవాత ద్వారకలో యెలాగో తన పూర్వపు జ్ఞాపకాన్నీ, ప్రేమలీలల్నీ మరచి రెండేళ్లు కాలం గడిపి తనువు విడిచింది.

చిత్రంగా కనిపిస్తుంది యీమెచరిత్ర! పైకి యెంత గంభీరపాత్రో అంత విషాదగర్భితము యీమె జీవితము. కాని కష్టాలకు లొంగినట్లుగ కనిపించదు. మాయారంభవేషం వేసి నలకూబరుడితో పొందు ననుభవించింది. అతడు మాయానలకూబరుడే కావచ్చు. ఆమెకు, ఆమెతోబాటు మనకుకూడా ఆక్షణంలో అతడే నలకూబరుడు. అతనికోసమే ఆమె తపిస్తోంది. మణిస్తంభుణ్ణి శిక్షించడానికి వెనక్కు తిరిగి వచ్చినతరవాత రంభకంటే ఛలోక్తితో, రంభకంటే గడసరితనంగా, రంభకంటే లావణ్యంగా నలకూబరుణ్ణి నమ్మించింది. మానవకాంత కాదు యీ కలభాషిణి. ఈమె యిక్కడమాత్రమే కలభాషిణి! అంతకుపూర్వం ముగ్ధ, ఆపిదప ప్రౌఢ కావచ్చు. ఇప్పుడు మాత్రం కలభాషిణి కలభాషిణే! ఆమెజీవితానికి దేవగంధర్వులుకూడా అసూయపడవలసిన మధురక్షణా లవి. కాని ఆమె మర్త్య! మర్త్యులు అట్టి క్షణాల్ని దినాలలోకి తీసుకొనిపోలేరు. బహుశః ఆమెకుకూడా తెలిసేఉంటుంది. లేకపోతే ఆమెప్రక్కను రంభ ఉండటం చూసి, అంత ధైర్యం చేసి తానామెరూపం దాల్చదు. తాను వరూథినీ రంభలవలెగాకుండా మానవస్త్రీ అవడం చేత తన కానిపేంపరక్తో తన జీవితాన్ని స్వర్గసీమలకు దగ్గరగా తీసుకొనివెళ్లిం దనుకుంది.

చక్కని సమయస్ఫూర్తి చూపింది. మాటకు మాట, చేతకు చేత—ఎన్నివిధాలచేతనో నలకూబరుణ్ణి, రంభను చిక్కులుపెట్టింది. తుదకు ఓడిపోయింది. ఓడిపోకతప్పదుకూడా. శాపం పొంది, తన కోర్కె ఫలించిందే చాలు ననుకొని అలయుందగ్గరకు వచ్చింది. కాని అక్కడ మళ్లా తనకు నాల్గుమూలలనుంచీ విషాదచ్ఛాయలు క్రమ్ముకొనివచ్చాయి. శాపగ్రస్తురాలవటమేకాకుండా యెవడో ముచ్చుతో తను పొందుబడయుట ఆమెకు రోతగా కనిపించింది. మణికంధరుడేకాక ఆ మాయానలకూబరుడు యింకెవరయినా ఐతే ఆమెహృదయం యెంత నలిగిపోయిఉండేదో.

కలభాషిణి తనకు రాబోయే మృత్యువును కనుక నిర్విచారంగా యెదుర్కొనకపోతే ఆమెలో వ్యక్తిత్వం యేమీ లేకపోయేది. కాని కష్టాలన్నీ బాగా హృదయంలో నాటుకున్న తరువాత యిప్పుడు జీవిత మంటే అర్థమయింది. వేశ్యవాటిలో పెరిగింది. మాని వద్ద శిష్యరికం చేసింది. రాచకొలువులో మెలిగింది. మోసగింపబడింది; మోసగించింది; వలచింది; వలపుల్లోని రహస్యాన్ని గుర్తించిందికూడా. తుదకు శాపగ్రస్తకూడా అయింది. ఇప్పటికి తన జీవితాన్నంతట్నీ సింహావలోక

నం చేసుకోగల సంపూర్ణవిద్యావతి కౌగలిగింది. సుగాత్రి అన్నట్టుగా యీమె యిప్పుడు దేవతయే కాని కేవలనరాంగన కాదు. రాబోయే జన్మలో పాతివ్రత్యాన్నే కోరుకొంటూ మృత్యువును ఆహ్వానించి జయించింది. ఇప్పుడు కలభాషిణి పూర్వమువలె వేశ్యగా జన్మించబోదు. ఆమె మధురలాలస కాబోతూంది.

కలభాషిణిలో నున్న యీ సునిశితమైన మానవస్పర్శ అడుగడుక్కూడా మనకు గోచరిస్తుంది. వరూథినిలో అది లుప్తమనిపిస్తుంది. అందుచేతే పాత్రలలో కవితాప్రపంచంలోకి గాంధర్వగానం చేస్తూ మానవులను ఒయ్యారంగా చూస్తూ నిల్చుంది వరూధిని. కలభాషిణి మానవులలో పుట్టి, తన మానుషత్వంవల్లనే కవితలో తన కొక స్థానాన్ని యేర్పరచుకుంది. ఇద్దరూ అనల్పశిల్పుల అనుంగుబిడ్డలే. అయినా వరూధిని గంధర్వాంగన; కలభాషిణి స్వర్గసీమల కెగిరే యత్నం చేసే మనుష్యాంగన! ఇంతే భేదం.



# నటీమణి సవాలు

[నాటిక]

= శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి =

## మొదటి రంగము

[తెర తీయగానే ఎదురుగా ద్వారం. ఇటో కిటికీ, అటో కిటికీన్నీ. ద్వారాని కిటు ఎవరూ ఉండరు. అవతల సభ జరుగుతూంటుంది. ప్రేక్షకులికి అధ్యక్షుడు మాత్రమే కనపడతాడు. చంద్రశేఖర్రావు అప్పుడే ఉపన్యాసం ముగించి, అధ్యక్షుని ముందు నించి ప్రేక్షకులికి కనబడుతూ ద్వారంప్రక్కకి నడిచి అదృశ్యుడౌతాడు. అప్పుడు అధ్యక్షుడు లేచి—]

అధ్య:— చక్కగా ఉపన్యసించారు చంద్రశేఖర రావుగారు. నాటకప్రదర్శనానికి ఇన్ని హంగులుండాలని నా కిదివరకు తెలియదు. స్త్రీలే స్త్రీపాత్రలు ధరించా లన్నది అంత కొత్త విషయము కాదుగాని నాటకప్రదర్శనం అంతా ఒక్క సూత్రధారుడి మాటనుబట్టే నడవాలన్న విషయం కొత్త. వీరికి తోచినట్లు వీరు భీముడువేషం వేస్తే వారికి తోచినట్లు వారు అర్జునుడువేషం వేస్తారు. ప్రేక్షకులకి ఈ యిద్దరిలో సౌదర్యం గోచరించకపోవచ్చు. "నీవిలాగ-ఈదుస్తులు ధరించి, ఈ రకంగా - అభినయించాలి; అతను ఇలాగ అభినయించాలి. లేకపోతే మీ ఇద్దరికీ సౌదర్యం 'స్ఫురించ"దని నటులకి చెప్పడానికి ఒక ప్రేక్షకోత్తముడు-అనగా సూత్రధారుడు - ఉండాలి. ఏకళ అయినా ఒక్కరిచేతనే నిర్మించబడుతోంది. నాటక కళ కూడా ఒకచేతిమీద నడిచినప్పుడే దానికి కళాసిద్ధి చేకూరుతుంది. చంద్రశేఖర్రావుగారి ఉపన్యాసం మరీ మరీ తలచి తలచి అవగాహన చేసుకోవా లందరూ. నమస్కారము.

[అందరూ చప్పట్లు కొట్టి లేచిపోతారు. ద్వారంలోంచి అనూరాధ, కళ్యాణి - ఇద్దరూ 18 ఏళ్ల ప్రాంతంవారు - రంగము ముందుకు వచ్చి ఇంకా ఇతరులు వస్తారన్నట్లు ద్వారంవేపు చూస్తూ పక్కకి ఓసరిల్లుతారు. వెంకటరమణయ్య 45 ఏళ్లవాడు వచ్చి వారివేపు వెళ్లుతాడు. సూర్యప్రకాశరావు మొదలయినవారు వచ్చి రెండోవేపు తప్పుకుంటూ ఉంటారు. వీరంతా ఒక అమెచ్యూరు నాటక సంఘంలోనివారు. ద్వారం దగ్గిరకి సుధాకరరావు వచ్చి ఒక్కడుగు బయటికి వేసేసరికి చంద్రశేఖర్రావు ద్వారందగ్గిరికి చేరి సుధాకర్రావుతో—]

చంద్ర:—నిన్న నాటక ప్రదర్శనం బాగా చేశారండీ.

[అనేసరికి అందరూ ద్వారంవేపు చూస్తారు. వారిద్దరూ రంగముమీదికి వచ్చేసరికి అందరూ చుట్టూ చేరతారు. చంద్రశేఖర్రావు అనూరాధవేపు చూస్తాడు. ఆమె దృష్టి మార్చుకుంటుంది.]

సుధా:—చివరిదాకా చూశారాండీ?

చంద్ర:—ఊఁ. చాలా బాగా చేశారు. ఏ నటుడికా నటుడు స్వార్థంకోసం చూసుకోకుండా, మంచి Team work చూపించారు.

[అని నలుగుర్నీ చూస్తూ దృష్టి తిప్పుతాడు. అది గమనించి, సుధాకరరావు—]

సుధా:—వారు మా సంఘానికి మేనేజరుగారూ వెంకటరమణయ్యగారు; ఇదుగో—సూర్యప్రకాశరావు గారు కార్యదర్శి; వారంతా సభ్యులు; వారిద్దరూ మా స్త్రీపాత్రధారులు: అనూరాధా, కళ్యాణీ. (నమస్కార ప్రతినమస్కారాల తర్వాత)

సూర్యప్రకాశరావు:—ఈయన సుధాకరరావు గారు; మా నాటకాలలో ప్రధానపాత్రధారి.

చంద్ర:—ఆ...హీరోయిను వేసినావిడ (అనూరాధవేపు చూసి) ఆవిడేకాబోలు, చాలాచోట్ల నాటకం అన్నమాట మరిపించేశారు. స్టేజి ఎక్కితే అలాంటివారితో ఎక్కాలిగాని—

[కళ్యాణి అనూరాధని గోకుతుంది. 'ఔను' అన్నట్లు అనూరాధ ఆమెచేయి తట్టుతుంది.]

సుధా:—(అర్థోక్తిలో) అల్లరి ఎక్కువైపోయిందండి. మా మాటలు సరిగ్గా వినపడనిచ్చారే కారు.

చంద్ర:—ఒకళ్లా ఇద్దరా? అంతటా గొణగొణలు ప్రారంభించారు. మీరు అంత పెద్ద స్టేజిమీద కాకుండా, సైడ్ పీసులు దగ్గిరికి తెచ్చి స్టేజిఎత్తు తగ్గించి ఉంటే మీ సైజులికి స్టేజిసైజు సరిపోయియుండును. స్టేజికి నిండుగా నటులు కనబడుతూంటే అల్లరిచెయ్యడం మరిచిపోతారు ప్రేక్షకులు.

[వారంతా ముఖముఖాలు చూసుకుంటారు]

వెంకటరమణయ్య:—మీ రేదేనా నాటక సమాజం తయారుచేస్తున్నారా?

చంద్ర:—ఏదో చేస్తున్నాను కాని మాకు స్త్రీలు లేరండీ స్త్రీపాత్రలు ధరించడానికి. సమర్థులైన స్త్రీ లుంటే గానీ,— ఎందుకండీ నాటకం నడిపి? మీరు బంగారునాణేలు సంపాదించారు. (కళ్యాణి అనూరాధ చెవిలో ఏదో గొణుగుతుంది. అనూరాధ ఆమెనోటిమీద చెయ్యి పెట్టి తోసేస్తుంది.) ఏ నాటక మేనా మీరు నిర్భయంగా వెయ్యవచ్చును.

సుధా:—మా నాటకం చూశారు మీరు. లోటుపా ట్లేమేనా చెప్పండి.

చంద్ర:—లోట్లు కొక్కడికి లెండి. ఒకరు చేసినదానికి పొద్దుపెట్టడానికంతా తయారే...మీ రేనా ఆనాటకం నడిపినది?

[సుధాకరరావు అనూరాధవేపు చూస్తాడు.]

వెం. ర:—(అందుకుని) నాటకం అంతా ఒక చేతిమీదుగా నడవాలని మావాళ్లూ.. గడియకిందటి దాకా ఒప్పుకోలేదులెండి...

సుధా:—సందు దొరికింది వెంకటరమణయ్య గారికి. దానికేంగాని, మా ప్రదర్శనం ఇంకా బాగుండడానికి సలహా లేవేనా చెప్పండి పోనీ.

చంద్ర:—చిన్నగొంతుక ఉన్న నటుల్ని రంగం ముందుకు వచ్చి మాట్లాడమనండి. పెద్దగొంతుక ఉన్నవాళ్లు కొంచెం వెనక్కి ఉన్నా నష్టం ఉండదు. నటుల వాచికమంతా ఒక్కమట్టంలో వినపడాలి ప్రేక్షకులికి...తరవాత—రంగప్రసాధనం ఒకటి.

సుధా:—అనూరాధా! నీచేతి కొస్తోందికోరడా.

చంద్ర:—అంటే?

సూర్య. ప్ర:—మా నాటకాల్లో రంగప్రసాధనం ఆవిడ చేస్తుందిలెండి.

చంద్ర:—అయితే ఆవిషయం వదిలేస్తాను. (అందరూ నవ్వుతారు. అతడుకూడా నవ్వుతెచ్చుకుని) ఒక్కమాట చెప్పదా మనుకున్నాను. రంగం నడుస్తూంటే ఉత్తరప్రత్యుత్తరాలు ఇట్నుంచి అటూ, అట్నుంచి ఇటూ దాటుతూండాలిగాని, వాదించేవారిద్దఱూ ఒకేపక్కన ఉండకూడదు... ముందు కుర్చీలూ అవీ సర్దేటప్పుడు, ఆ రంగంలో ప్రాధాన్యత ఎవరిదో వారు మధ్యకొచ్చేటట్లు చూడాలి. పొడుగ్గా ఉన్నవాళ్లు వెనక్కి, పొట్టివాళ్లు ముందుకీ ఉండాలి. పొడుగువారినీ పొట్టివారినీ వీలయినంతవరకూ దగ్గిరికి రానియ్యకూడదు, తేడా కనబడిపోతుంది. ఈనాటకం మళ్లీ వేసినప్పుడూ—

వెం. ర:—మీకు వ్రాస్తాం. ఒక్కమారు వచ్చి మీరే నడపండి. ఇలాగ ఒకొక్కటి చెప్తే కుదరదు. మీ ఆశయాలన్నీ ఆచరణలో పెట్టితే ఎంత బాగుంటుందో మానాటకం! ఏం సుధాకరం?

సుధా:—ఏం నన్నడుగుతున్నారు? నా అభ్యంతర మేమీ లేదు.

వెం. ర:—మా నాటకంప్రతి మీ కిస్తాం. అది కూడా చూసి ఏ వేనా సర్దవలిసిన వుంటే సర్ది పెట్టండి.

చంద్ర:—(నవ్వుతూ) అహ్హాఁ.

వెం. ర:—ఈ శ్రమ మీకిష్టం లేకపోతే తప్ప!

చంద్ర:—ఇష్టం లేకపోడాని కేముందండి? నా సంగతీ—(అర్ధోక్తి)

సూ. ప్ర:—మీకు పూర్తిగా తెలుసు. (అందరూ నవ్వుతారు) మా సంగతే మీకు తెలియవలిసినది. అదే చెప్పారు వెంకటరమణయ్యగారు.

చంద్ర:—కృతజ్ఞుణ్ణి. (వాచీ చూసి) శలవు.

[అని అందరివైపుకీ నమస్కారముచేసి వెళ్ళిపోతాడు. వెంకటరమణయ్యా, స్త్రీలూ, సూర్యప్రకాశరావుతప్ప ఇతరులువెళ్ళిపోతారు]

సూ. ప్ర:—ఏం రాధమ్మా! ఇక్కడ నిలబడతారా, బండీ తెస్తాను?

వెం. ర:—తీసుకురండి. (సూ. ప్ర. వెళ్ళిపోతాడు)

కళ్యాణి:—ఏయ్ బంగారునాణెం! ఉబ్బితబ్బిబ్బయానా ఏమిటి నోటంట మాటే రాకుండా ఉంది?

అనూ:—నీ కేం తక్కువచేశారే! నీ కందుకే కడుపుడుకు?

కళ్యాణి:—'ఆ హీరోయిను వేసినావిడ' అని నీకే కాదూ పెద్ద శాలువ కప్పేరూ?

అనూ:—ఆమాటకేంగానీ, ఎంత డాబుల్రాయుడో చూశావా? ఇక్కడ నిలబడిన నాలుగునిముషాల్లోనూ ఎన్ని సంగతులు ఎత్తేడు! Team work ట! స్త్రీలు స్త్రీపాత్రలట! స్టేజినిండా వుండాలట నటులు! పొడుగువారినీ పొట్టివారినీ దగ్గిరకి చేరనియ్యకూడదట—

వెం. ర:—డాబుల్రాయ డనడానికి వీలులేదు. ఉపన్యాసం చూశావా ఎంత ధాటీగా ఉందో?

అనూ:—ఉపన్యాసాలకేం బాబాయి? కబుర్లెన్నైనా చెప్పవచ్చును. రంగంమీద కెక్కి చేసి చూపించాలి.

కళ్యాణి:—ఆ ముచ్చటా తీరుతుందిలే. ఈమారు నాటకం వేసినప్పుడు రమ్మని రాస్తామన్నారుగా?

అనూ:— అన్నట్టు అదొకటి! మీరు డైరెక్టు చెయ్యండనగానే గుటుక్కున మింగి ఊరుకున్నాడు.

వెం. ర:— అబ్బే! మనవాళ్ళంతా అడిగితే అప్పుడు ఊరుకున్నారుగాని—

కళ్యాణి:— కాదు మామయ్యా. మీకు తెలియేలేదు ఆయనసంగతి. (ఎగతాళిగా) మన అనూ కని పెట్టేసింది. కాదూ అనూ? వట్టి వెకిలిమనిషి, కాదూ ఆయన?

అనూ:— (కనుబొమలు చిట్లించి) వెకిలిమనిషి కాకపోతే-'శలవు' అని వెళ్ళిపోయాడే-"నేను ఫలానా, ఈ ఎడ్రసుకి నాటకం పంపండి" అని అడగేలేదు. ఎలాగందుతుం దనుకున్నాడు నాటకం?

వెం. ర:—అబ్బే! నీ కర్థమే కాలేదు ఆయన ఘరానా. 'ఊ' అన్నాడు కాని పుస్తకంకోసం మన వెంట పడతాడా? మనంతట మనం కోరి తీసికెళ్ళి ఇయ్యాలి. మరికొంతసేపు కులాసాగా కబుర్లు చెప్పితే మనం లోకువకట్టేసి "మా బసకి రండి. నాటకం ఇస్తాము" అనేస్తామేమో అని 'శలవు' అని వెళ్ళిపోయాడు. ఇప్పుడు చూడు! మనం అందరం సంప్రతించుకుంటాం. ఇష్టం అయితే ఇస్తాం, లేకుంటే మానేస్తాం. అందుకుకూడా పిలిచ్చాడు. తన మర్యాద నిలబెట్టుకున్నాడు; మన మర్యాద నిలబెట్టుకోడానికి పిలిచ్చాడు. మణిపూసే.

కళ్యాణి:—ఏయ్ బంగారునాణెం! వింటున్నావా? (చెవికి దగ్గిరగా నోరుపెట్టి) మణిపూస. అబ్బ! కాలు తొక్కుతావేం?

అనూ:—నువ్వు నా చెవి కొరుకుతూంటే నేను నీ కాలు తొక్కడం తప్పా?

[ఎద్దుమెళ్ళో మువ్వలు గల్లుమంటాయి.]

వెం. ర:—ఊఁ. సరాగాలు తరవాత. బండొచ్చింది. ఎక్కండి. పోదాం త్వరగా.

[అందరూ పోవుదురు]

## రెండో రంగము

[బసలో సుధాకరుని గది. రామచంద్రం చేత్తు కుర్చీలో కూర్చొని ఆంధ్రపత్రిక చదువుతూంటాడు.

సుధాకరరావు (ప్రవేశించి చొక్కా, కండువా కొయ్య స్టాండుకి తగిలిస్తూ—]

సుధా:—ఏం రామచంద్రం! ఎంతసేపయింది వచ్చి?

రామ:—సభ అయిపోలేదు అప్పటికి. ఆయనెవరో బి. ఏ., బి. యల్. ట. మాట్లాడేశారు. అధ్యక్షులు లేస్తూంటే వచ్చేశాను.

సుధా:—సభ పూర్తికాకుండానే వచ్చేశావు? అయితే నువ్వు మంచిసీను మిస్సయావన్నమాట.

రామ:—ఏం? గమత్తు లేవేనా జరిగే యేమిటి?

సుధా:—గమ్మత్తు'లు' లేవులే. గమ్మత్తే. ఆ లెక్చరిచ్చినాయన్ని మనవాళ్లు మన వూరు రమ్మన్నారు.

రామ:—ఎందుకు? లెక్చరివ్వడానికే?

సుధా:—అబ్బే! మన నాటకం డైరెక్టుచెయ్యడానికి.

రామ:—అదేమిటో?

సుధా:—అదే గమ్మత్తు. అసలాయన లెక్చరుకే మనవాళ్లు డంగయిపోయారు. నేను,—అధ్యక్షుడి కెదురుగా తలుపుంది—ఆ దారిని బయటికి వస్తూంటే ఆయన తారసిల్లాడు నాకు. అంతకుముందు మనవాళ్లంతా ఆ గుమ్మంలోంచి బయటికి వెళ్లడం చూచాడు కాబోలు, ఎలాగోలాగు కత్తు కలుపుకుందామని "నిన్న నాటకం బాగా చేశారండీ" అన్నాడు. మనవాళ్లంతా చుట్టూ చేరారు. మొదలుపెట్టాడు అనూరాధకి తైరు! రంగం ఎక్కితే అలాటివాళ్లతోటే ఎక్కాలట!—

రామ:—సరే—

సుధా:—తనునడిపేసమాజంలో స్త్రీలు లేరట!

రామ:—ఊఁ. అసలాయన ఎవరుట?

సుధా:—వకీలుట!

రామ:—వారాంగన లనుకున్నాడు గాబోలు, వైద్యుణ్ణి పిల్చి మందిప్పిస్తే బాగుండును.

సుధా:—మందు అతనికి కాదోయి, మనవాళ్లకే ఇప్పించాలి. లెక్చరు విన్నవాళ్లు లెక్చరువిన్నట్లు ఊరుకోక, మా నాటకం నడపండి మహాప్రభో అని పిలవడమేమిటి? (కిటికీలోంచి బయటికి చూచి) అదుగో కళ్యాణికాబోలు బండీలో వెళ్తోంది. పిలు పిలు.. (రామచంద్రం వెళ్లి కళ్యాణితో ప్రవేశించును) రా కళ్యాణీ, కూర్చో. (బండీవాడు ప్రవేశించి "అమ్మా, ఎంత ఆలస్యం ఉంటుందేమిటండి" అంటాడు.)

సుధా:—ఓరి నీతస్సాదియ్య! ఇంకా రానేలేదు లోపలికి! అప్పుడే ఎంత'ఆలిశ్యం' అంటున్నావ్? ఎంతేమిటి నీఅద్దె?

కళ్యాణి:—నే నిచ్చేస్తా. (పర్సు తీస్తుంది.)

బండీ:—నేనేఁవనకుండా బాబే అన్నిమాటలూ అంటున్నారు. మీాయిట్టం వొచ్చినంతసేపు కూకోండమ్మా. నాఅద్దెటి? (పోవును.)

కళ్యాణి:—(నవ్వి) మరి నాలుగు కాసు లిస్తామని! గడుసువాడే.

సుధా:—చంద్రశేఖరరావుగారికంటె గడుసంటావా?

కళ్యాణి:—ఏం? మేం వెళ్లాక కూడా ఏమేనా గడుస్తనం చేశారేమిటి?

రామ:—అంటే, మీారున్నప్పుడు కొంత గడుస్తనం చేశారన్నమాటా?

సుధా:—అవురా! ఇంతసేపూ నేను చెప్పినవి వట్టిమాటలకింద కట్టేశావ్! కళ్యాణే చెప్పాలా? ఇదేమిటోయి! నీకుకూడా ఆడవాళ్లమీాద అభిమానం పట్టుకుంది? నీసమాజంలోకూడా స్త్రీలు లేరేమిటి? రా బాబూ; మా నెత్తిమీాదకి.

రామ:—లేదు మహాప్రభో లేదు. మీారు డైరెక్టుచెయ్యమని అడక్కుండానే పోతాను. (వెళ్లబోవును)

సుధా:—(నవ్వుతూ) అడగనులే. కూర్చో. కూర్చో.

రామ:—బజారికి వెళ్లి ఇప్పుడే వస్తా.(పోవును)

సుధా:—ఏమిటి కళ్యాణీ విశేషాలు?

కళ్యాణి:—మీారే కామా చెప్తున్నారూ — అందరికీ ఆడవాళ్లమీాద అభిమానాలు పట్టుకుంటున్నాయని?

సుధా:—అందరికీ అంటే నాకుకూడా నంటా వేమిటి?

కళ్యా:—కొంచెం లేదా అని! (మౌనం)

సుధా:—నా అభిమానం ఎవరికి కావాలి కళ్యాణీ?

కళ్యా:—అంతమాట అనేయకండి. అనూరాధకి కావాలి. కాని, ఆమాటంటే కోపగిస్తుంది. ఊటంకిస్తే ఏడ్చేస్తుంది. తనమనస్సులోని ఊహ లెవ్వరికీ తెలియ కూడదు. తెలిస్తే జవజవలాడిపోతుంది...(మౌనం)... సుధాకరరావుగారూ, ఈ చంద్రశేఖరరావుగారిని మన వాళ్లు పిలవడం తెలివితక్కువండీ.

సుధా:—ఏం?

కళ్యా:—ఏమో తెలీదు పాపం!

సుధా:—అనూరాధవైపు తిరిగే గాలివిసురు లన్నిటికీ సుధాకరరావు గడగడలాడిపోవాలేమిటి? అంతవరకూ వస్తే వేషం వెయ్యడం మానుకుంటాను గాని, ఒకరి కడ్డురావడం నాస్వభావం కాదు.

కళ్యా:—ఏమి స్వార్థత్యాగమండీ! అర్థం ఉండనక్కరలేదా ఏమిటి ఈ మా నెయ్యడానికి?

సుధా:—ఆయనగారిని గమికర్మీకృతకాకినాడుతై మమ్మల్ని ఉద్ధరించమని సమాజంవారంతా కోరేరూ? ఆయన మన సమాజంలో సమర్థులైన స్త్రీలతో రంగం ఎక్కడానికి వస్తున్నారూ? మరింక నా అవసరం ఏమిటి?

కళ్యా:—గమికర్మీకృతకాకినాడు లందరికీ మీరు ధరించే భూమిక ఇచ్చేయడానికా మీరు సమాజంలో ఉన్నారిన్నాళ్లూ?

సుధా:—ఇన్నాళ్ల సంగతి వేరు. ఇకముందు సంగతి వేరు. ఈయనకి నాభూమిక ఇచ్చేయవలసి వస్తుంది. తప్పదు.

కళ్యా:—తప్పకేం? వీళ్లంతా మేం వెయ్యమంటే సరి.

సుధా:—"రావే ఈశ్వర కావవే వరద" అని బలిసూలుకుని పిలిచినవాళ్లు వేషం వెయ్యమంటారా?

కళ్యా:—వాళ్లందరి మాటా నాకు తెలీదు కాని అనూరాధ వెయ్యమంటుంది. నాకు తెలుసు. కావలిస్తే ఇప్పుడు కాదుగానీ మనవూరు వెళ్లాక మా గించిచూడండి. మీకూ తెలుస్తుంది. శలవు.

[నిష్క్రమించును]

## మూడో రంగము

[అనూరాధ గ్రామొఫోనుపాట వింటూ రాసు కుంటూ ఉంటుంది. వెంకటరమణయ్య ప్రవేశము.]

వెం. ర:—ఉత్తరాలు ఏమేనా వచ్చాయమ్మా?

అనూ:—(ప్లేటు ఆపి) ఏమిటి అంటారు?

వెం. ర:—ఉత్తరాలు ఏవేనా—

అనూ:—ఆఁ. ఒక కవరు వచ్చింది. అదుగో భగవద్గీతకింద—

వెం. ర:—(తీసి చదివి, ప్లేటు పూర్తికాగానే) చంద్రశేఖరరావుగారు వ్రాశారు.

అనూ:—ఏలూరులో కనబడినాయనా?

వెం. ర:—ఊఁ. మన నాటకం చదివేరట. అక్కడక్కడ కొద్దిమార్పులు చేశారట.

అనూ:—"కొద్ది మార్పు"లన్నది మీకల్పనా, లేక ఆయనే వ్రాశారా ఆ చిన్నమాట?

వెం. ర:—ఇదిగో. (ఉత్తరం నిగిడించి) ఏమలాగన్నావు?

అనూ:—(ముందుకు వంగి చదివి) ఆయనలో నాకు ఒకరకం తొందర కనపడింది. తమ సమాజంలో స్త్రీలు లేరు. మన సమాజంలో ఉన్నారు. అందుకని పెద్ద అభిమానం నటించారేమోనని నా అనుమానం.

వెం. ర:—అంత తేలికమని మంటావా? అయినా - నీ అనుమానమేనా, సాక్ష్యమేమైనా ఉన్నదా?

అనూ:—ఏదో కొద్ది.

వెం. ర:—చేతలే?

అనూ:—అబ్బే! చూపులు.

వెం. ర:—న్ను. చూపుల కర్థమేమిటి?...ఒక వేళ ఆయనచూపులు అర్థవంతాలే అనుకున్నా, నువ్వు అనుమానించిన అర్థమే వాటిలో ఉన్నదని ఎలాగ చెప్పగలవు? (మౌనం) బ్రహ్మచారులందరూ అల్లరి కోసమే చూస్తారా కన్యలవైపు?

అనూ:—(సిగ్గుతో) చాలిద్దురూ బాబాయి. మీ రెప్పుడూ ఇలాంటి మాటలే. (ప్లేటు పెట్టును)

"పసుపుకుంకుమా నీకు బాలా
జన్మహక్కు గాదా"

వెం. ర:—చూశావా? నేనే కాదు. గ్రామొఫోనుకూడా ఆ మాటలే అంటోంది.

అనూ:—(లేవబోవును)

వెం. ర:—కూర్చోవమ్మా. ఇందులో తప్పేమీ లేదు. నిన్ను పైసా ఉన్న ఒకఅయ్యచేతిలో పెట్టే వరకూ నేనిలాంటి మాటలే ఆడాలి. ఆప్లేటు కానీ కడతేరానూ. (ప్లేటు పూర్తి అయిన తర్వాత) చూస్తావా ఈ వుత్తరం? (కవరులోంచి ఫోటో లాగి) ఆయన ఫోటో పంపారు.

అనూ:—ఫోటో పంపించారా!

వెం.ర:—ఊం. మన సంఘముఫోటో ఒకటి పంపమన్నారు. పాపం! అనుమానించవలసిన మనిషి కారు. చూడు ఆ వుత్తరం. నేను పోస్టాఫీసుకి వెళ్లి వస్తాను. నువ్వు-భోజనం చేసేస్తావా?

అనూ:— అక్కర్లేదు ... తొమ్మిదిన్నరేకదూ అయింది? వెళ్లిరండి. (వెంకటరమణయ్య పోవును.)

అనూ:— (ప్లేటు పూర్తి అయిన తర్వాత టేబిలుదగ్గరకు వెళ్లి కవరు విప్పి ఉత్తరం చదువుతుంది. పిమ్మట టేబిలుమీద ఉన్న బొమ్మ తీసి) ఏమండీ ప్లీడరుగారూ? చాలాచాలా వ్రాశారే నన్ను గురించి? ఈ మెప్పంతా కంటిదా, గుండెదా?

[తలుపు తట్టిన చప్పుడు]

అనూ:—ఎవరు వారు?

సుధా:— సుధాకరరావు.

[అనూరాధ బొమ్మ దాచి తలుపుతీస్తుంది.]

సుధా:—బాబయ్య లేరా యేమిటి?

అనూ:—పోస్టాఫీసుకి వెళ్లారు. వస్తా రిప్పుడే. కూర్చోండి.

సుధా:— (కూర్చుని) ఏమిటి సమాచారాలు?

అనూ:—ఏమున్నాయి? నాటకంమాటేమైనా ఆలోచించారా?

సుధా:— అది ఆలోచించడానికే వచ్చాను. ఏలూరులో కనబడినాయన ఉత్తరం వ్రాశారు.

అనూ:— మీకుకూడా వ్రాశారా? బాబయ్యకీ వ్రాశారట.

సుధా:— ఏం వ్రాశారూ?

అనూ:—బాబయ్య వచ్చాక తెలియాలి. మీకేమి వ్రాశారూ?

సుధా:—మన నాటకం చదివేరట. మార్పులాట్టే చెయ్యనక్కరలేకపోయిందట. కాని, చిత్రం. మన వూరు రావడంమాటే లేదు. నాలుగైదురోజుల్లో పంపించేస్తున్నారట మన నాటకం.

అనూ:—ఏం అలాగ? ఆవేళ మీరంతా రమ్మన్నారే?

సుధా:—అది చాలదు కాబోలు. మళ్లీ ప్రత్యుత్థానం చెయ్యాలి. గౌరవంమట్టుకు బాగా నిలుపుకుంటున్నాడు. గడుసువాడే.

అనూ:—పుస్తకం దిద్దమని ఇచ్చిన తర్వాతా-

సుధా:—రమ్మని వ్రాయ కేం జేస్తారని.

అనూ:—అది కాదు. అసలు ఇవ్వకూడదు. ఇచ్చి, దిద్దమని, నాటకం నడపమని అప్పుడు తీరా అడిగేసి ఇప్పుడు మనవాళ్లు ఊరుకుంటే—

సుధా:—ఏమీ బాగుండదు.

వెంకటరమణయ్య— (ప్రవేశించి) ఏమిటోయ్ బాగుండదు?:

సుధా:—ఉత్తరం వస్తే అనూరాధకేనా చూపించకుండా దాచుకోడం.

[వెంకటరమణయ్య ప్రశ్నార్థకంగా అనూరాధవేపు చూస్తాడు. ఆమె పకపకనవ్వి-]

అనూ:—అవును. నాకు చూపించనిదీ ఎలా తెలుస్తాయి నాకు అంకులో సంగతులు?

వెం.ర:—నా ఉత్తరాలన్నీ అనూరాధకి చూపించాలేమిటి? రహస్యాలేమైనా ఉంటే?

సుధా:—రహస్యాలుకూడా వ్రాస్తున్నారేమిటి చంద్రశేఖరరావుగారు?

అనూ:—(గభీమని లేచి చంద్రశేఖరరావు వ్రాసిన కవరు తీసి, చక్రుమని వెంకటరమణయ్యకి

కనబడేటట్లు ఉత్తరం లాగి, సుధాకరరావుతో) చూసుకోండి ఏం రహస్యాలు వ్రాశారో.

[అని మీద పడేస్తుంది. వెంకటరమణయ్య ఒకక్షణం ఆలోచనా పూర్వకంగా కనుబొమలు ముడివేసి, గ్రహించి చిరునవ్వుతాడు]

సుధా:—వెంకటరమణయ్యగారి ఉత్తరం నువ్వే చదవలేదే నేనెలా చదవను? పోనీ, నిన్ను చిన్నబుచ్చడం ఎందుకు? ఆ ఉత్తరం కాదుగాని, మరో ఉత్తరం చదువుతాను. (జేబులోంచి తీస్తాడు)

వెం.ర:—(నవ్వి) నీకుకూడా ఒక ఉత్తరం వ్రాశారని చెప్పడానికా ఈ ఉపోద్ఘాతం! ఊఁ. కానీ.

సుధా:—(ఉత్తరం మడిచి) అమ్మో ఆశ! నా ఉత్తరమేనా ఏమిటి అంతచదవక?

వెం.ర:—పోనీ. చూడకుండానే నీవుత్తరంలో సంగతులు చెప్పకుంటాను చూడు. మన నాటకం చదివేననీ, కొద్దిమార్పులు చేశాననీ (వంగి తనకు వచ్చిన కవరు అందుకుని విప్పి చూస్తూండగా)—

సుధా:—స్వగతాలు పూర్తిగా తగ్గించేశాననీ—

వెం.ర:—రాశారా నీ ఉత్తరంలో? నాదాన్లో ఆమాట లేదు.

అనూ:—ఏమిటీ?

వెం.ర:—ఒక పాత్ర తనలోనే మాట్లాడుకోడం స్వాభావికము కాదు. నేటికాలపు పాశ్చాత్య నాటకాలలో ఈస్వగతాలుండవు. మన నాటకంలో కూడా తగ్గించేశారుకాబోలు. (సుధా.తో) నేను స్నానం చెయ్యలేదు. చేసివస్తాను, కూర్చుంటావా?

సుధా:—నా ఉత్తరంలోని సంగతులు ఇంకా ఉండిపోయాయే! మరి చెప్పకో లేరా ఏమిటి?

వెం. ర:—మీరు చాలా బాగా నటించారని—

[ఈ మాటలు ద్వారం దగ్గిరకి వెళ్లి వెనక్కి చూసి అని వెంకటరమణయ్య వెళ్లిపోతాడు.]

సుధా:—ఇంకేం! అయితే నీకు మరో శాలువ కప్పేరన్నమాటే!

అనూ:—ఆఁ. ఆయన కేం పనుంది? శాలువలు నేయడం, అనూరాధకి కప్పడం.

సుధా:—పాపం! కప్పకో లేవు. ఉక్కపోస్తుంది కాబోలు నేం?

అనూ:—వెక్కిరింతట్టు ఆదేపనా?

సుధా:—ఇలాంటి ఉత్తుత్తిశాలువలు ఎన్నైనా కప్పవచ్చు. ఇదుగో నేనూ కప్పతాను:"నీనటన ఉందే, స్వర్గలోకంలో ఊర్వశినటనలాగ, భూలోకంలో—"

అనూ:—ఊఁ. భూలోకంలో?

సుధా:—గ్రేటా గార్బో, క్లాడెట్ కోల్బర్ట్, జోన్ క్రాఫర్డ్, విల్మాబంకీ.

అనూ:—చాల్లెండి, ఎవరేనా వింటే నవ్విపోతారు.

సుధా:—ఆయన పొగడ్త విని ఏపాటి నవ్వేరూ? నేను పొగిడితే మట్టుకు నవ్విపోతారా? నాకూ ఆయనకీ ఇంత అంతర మున్నట్టు నా కిదివరకు తెలియలేదు. మరి నవ్వులాటపాలు గాను.

అనూ:—మీరూ తేలికగానే మాట్లాడుతున్నారనుకున్నాను. కాని ఏవో నిగూఢమైన ఉద్దేశాలు మనసులో—

సుధా:—క్షమించు అనూరాధా. అనవసర వాదన పెంచి, లేని విచారం తెచ్చిపెట్టుకోడం నా కిష్టం లేదు.

అనూ:—విచారం దేనికి?

సుధా:—దేనికో తెలీదా నీకు?

అనూ:—మీవిచారం నా కెలాగ తెలుస్తుంది?

సుధా:—తెలిసినప్పుడే మాట్లాడదాం లే దాన్ని గురించి. (లేచి) సరే నేపోతాన్లే. మీ బాబయ్యతో చెప్తావుగదా.

[వెంకటరమణయ్య ప్రవేశం]

వెం. ర:—ఊఁ, చెప్తావుగదా?

[అనూరాధ సుధాకరునికి ముఖం చూపించకుండా వెళ్లబోతుంది]

సుధా:—(ఆవిషయం గమనించి) అనూరాధా! (అనూ మాట్లాడకుండా నిష్క్రమించును) ఊఁ. (కొంచెము తాళి) రేపు సాయంత్రం మన సంఘసమావేశం జరుగుతుంది. చంద్రశేఖరరావుగార్ని రమ్మనమంటే

శ్రీరామనవమికి రమ్మనాలి. ఆసంగతి తీర్మానిద్దాం. పెందరాళే మీరూ అనూరాధా రండి. కళ్యాణితో చెప్పాను నేను. (పోవును)

## నాల్గో రంగము

[సుధాకరుడి గది. శ్రీరామపట్టాభిషేకముపటానికి పూలదండలు వేసి ఉంటాయి. సుధాకరుడు తలకి నూనె రాసుకుంటూంటే అనూరాధ, కళ్యాణి ప్రవేశిస్తారు.]

సుధా:—రండి. (వారు కూర్చున్న తర్వాత) ఏమి టప్పుడే బయల్దేరేరు? (వాచీ చూసి చెవిదగ్గర పెట్టుకుని) ఆగిపోయింది. (కీ ఇస్తూ) మీ టైంకు ఎన్ని గంటలకీ?

కళ్యా:—ఇదుగో అనూరాధ—

అనూ:—(కళ్యాణి చెవి పట్టుకుని) ఊఁ. అనూరాధ?

కళ్యా:—అబ్బ వదలవే-(బాధ సూచిస్తూ) ఇండియన్ పంక్చువాలిటీ అంటారని తొందరపెట్టిందండీ!

అనూ:—(చెవి వదలి) నీగుణం పోనిచ్చుకున్నావు కావు. వట్టిదండీ. నేను రానే అన్నాను. "ఈయన వట్టి కబుర్లగొట్టంలాగున్నాడు. ఒకముక్కైనా మానెయ్యకుండా ఏం చెపుతాడో అంతా వినా"లని బయల్దేరింది.

సుధా:—ఆడవాళ్లు అవులిస్తే పేగులు లెక్కపెట్టుతారు. ఏం కళ్యాణీ, కబుర్లగొట్టాం అనేశావు?

కళ్యా:—ఆయన విద్వత్తు మనకి శ్రవ్యమేకాని దృశ్యం కాలేదుగా?

సుధా:—నేటినుంచీ దృశ్యంకూడా అవుతుందిలే.

అనూ:—అంటే వేషంకూడా వేస్తారనా?

కళ్యా:—ఎందుకు కూడదు?

అనూ:—కూడదన్నానా నేను? 'వేస్తారా ఏమిటీ' అన్నాను.

సుధా:—సూత్రధారుడైన తర్వాత అడ్డేమిటి?

అనూ:—ఆ సర్వాధికారం ఆయన కిచ్చేశారా?

సుధా:—"తప్పకుండా దయచెయ్యండి. మీ పర్యవేక్షణకింద నాటకం వేద్దా"మని కార్యదర్శిగారు మనందరి తరఫునా వ్రాశారు.

అనూ:—'వేద్దాం' అనడంకంటె 'వేస్తాం'అంటే చిక్కు లేకపోనేమో?

కళ్యా:—చిక్కు ఇప్పుడూ ఉండదు. నువ్వు ఆయనగారితో నైతే నేను వెయ్యనంటే సరి.

[అనూరాధ గతుక్కుమంటుంది.]

అనూ:—అదేమిటే?

కళ్యాణి:—అదే ఈసూత్రధారుడుగారి ముఖ్యోద్దేశం.

సుధా:—నేనూ అదే అనుమానిస్తున్నాను. (కళ్యాణితో) నువ్వు కనిపెట్టావో లేదో. తొలిసారి ఆయన మన్ని కలుసుకున్నప్పుడు "స్టేజి ఎక్కితే అలాటివారితో ఎక్కాలిగాని"—అన్నాడాయన. నేను కొంచెం అడ్డువచ్చానుగాని లేకపోతే ఈ విషయం అప్పుడే తెమిలిపోనేమో!

అనూ:—నేనూ విన్నాను కాని, ప్రత్యేకం అందుకోసమే వస్తున్నాడంటారా?

[బండీ మువ్వలు చప్పుడు]

సుధా:—వచ్చారు! "రామచంద్రం!" (బయటనుంచి రామచంద్రం "ఆఁ" అంటాడు.) రండి. రండి. (అంటూ ద్వారందగ్గిరకి వెళ్తాడు. అక్కణ్ణించే అనూరాధతో) ఆయనకి కాస్త 'టీ' యిద్దామని పిల్చాను. టీ తీసుకుని అంతా వెళ్లిపోదాం. (పైన ఉన్న చంద్రశేఖరావుతో) దయచెయ్యండి. నమస్కారం.

[అనూరాధా, కళ్యాణీ ఒకమూలకి ఓసరిల్లుతారు. చంద్రశేఖరావు వచ్చి అనూరాధను గుర్తించి—]

చంద్ర:—అందరూ ఇక్కడే ఉన్నారే? మీటింగు ఎక్కడో పెట్టారేం?

సుధా:—మేం ముగ్గురమే కాదండీ ఉంట?... దయచెయ్యండి. మాకుటీరంలో కాస్త 'టీ' తీసుకుని వెళ్లిపోదాం. రామచంద్రం! ఊఁ (అతడు వెళ్లబోవును.) వెంకటరమణయ్యగారిని కూడా పిలు(అతడు పోవును.)

అనూ:—(సుధాకరరావుతో) ఏమండీ, మాకు శెలవా?

సుధా:—ఏం? వెళ్లిపోతున్నారా? అంతాకలిసి వెళ్లిపోదాం.

అనూ:— కాదండి. నాకు కొంచెం పని ఉన్నదండి.

చంద్ర:— సభకి వస్తారా ?

అనూ:—చెప్పలేనండి.

చంద్ర:—అయితే ఒక్క నిముష ముండండి. నేను రెండు ముక్కలు చెప్పి అనుకుంటున్నాను. ముఖ్యులు వినే స్తే తరవాత నా కార్యక్రమం సుళువౌతుంది.(సుధాకర రావుతో) కొంచెం చేతులూ కాళ్లూ—

సుధా:— కడుక్కుంటారా ? రండి. నూతిదగ్గరికి పోదాం. చల్లగా ఉంటాయి నీళ్లు. (పోవుదురు)

కళ్యా :— ఏమిటి అనూ, మళ్లీ ఇంటిముఖం పట్టావు ? సభకి రావూ ?

అనూ:—రాను.

కళ్యా :—నీ దగ్గిరున్న దుర్గుణం ఇదే. చివ్వరికి వచ్చాక ఉప్పరాయి వేస్తావు.

అనూ:—ఆ ఉప్పరాయి వేసే మర్యాద మీకు దక్కించడానికే వెళ్లిపోతున్నాను.

కళ్యా :—మాకేం మధ్యని ! ఆయన వేషం వెయ్యడం ఇష్టమో కష్టమో నీకే.

అనూ:—నాయిష్టం నాకష్టం ఎవరికి కావాలి? ఆయన్ని పిల్చినప్పుడు నన్నడిగి పిల్చారా? నాటకం నడపమన్నప్పుడు నన్నడిగి నడపమన్నారా? ఇప్పుడు మట్టుకు నాగోడవ ఎవరికి కావాలి ?

కళ్యా: —నాకు కావాలి చెప్పు.

అనూ:-అందినప్పుడల్లా ఒక దెబ్బ విసరడానికా?

కళ్యా:—ఆఁ ( తెల్లబోయి చూచును)

అనూ:— అంతకన్న నువ్వు చేస్తూన్న ఉపకారం ఏమిటి ?- ఇదుగో నేను పోతాను. వాళ్లడిగితే బాబయ్యని పిలవడానికి వెళ్లానని చెప్పు. (పోవును)

[ప్రవేశం రామచంద్రం 'టీ' తో.]

రామ:—ఏరండీ వారంతా ?

కళ్యా:— నూతిదగ్గిరికి వెళ్లారు. కప్పులు తీసుకొస్తా.

[వెళ్లి కప్పులు తెచ్చి టీ పోస్తుంది. సుధా, చంద్ర ప్రవేశము.]

సుధా:—కళ్యాణీ, అనూరాధ ఏదీ ?

కళ్యా:—మామయ్యని పిలవడానికి వెళ్లిందండి.

సుధా—కబురు పంపేము కదూ. (చంద్రశేఖర రావుతో) దయ చెయ్యండి.

చంద్ర:—వారంతా రావొద్దూ ?

సుధా:— ఏముంది బ్రహ్మాండం ? మనం తీసుకుంటూంటే వస్తారు. అదిగో వచ్చినట్లున్నది. (గట్టిగా) దయచెయ్యండి వెంకటరమణయ్యగారు.

[వెంకటరమణయ్య ప్రవేశించును.]

చంద్ర:—నమస్కారమండి.

వెం. ర:—నమస్కారం. ఎంత సేపాయి వచ్చారు ఇక్కడికి?

చంద్ర:—చేతులూ కాళ్లూ కడుక్కుని ఈ బల్లదగ్గిర కూర్చున్నంతసేపాయి.

సుధా:—(వెంకటరమణయ్యతో) అనూరాధ మీకోసం వచ్చింది కనపడలేదూ?

వెం. ర:—లేదు. సందులోంచే వచ్చిందా?

కళ్యాణి:—ఆవిడకి సందులోంచి వెళ్లడానికి భయంలెండి. రోడ్డుమీంచి వెళ్లి ఉంటుంది. (ద్వారం దగ్గిరకి వెళ్లి తొను గడప దాటుతుంది. అది చూచి)

వెం. ర:—ఏం? వస్తోందా?

కళ్యాణి:—అనూరాధ కాదు. కార్యదర్శిగారు వస్తున్నారు జట్కాలో.

సుధా:—(చంద్రశేఖరరావుతో) మీకోసమే అయిఉంటుంది. అందరూ వచ్చారేమో. కానీండి. (టీ త్రాగుదురు)

[సూర్యప్రకాశరావు ప్రవేశించి చంద్రశేఖరరావుతో—]

సూర్య:—నమస్కారమండి.

చంద్ర:—నమస్కారము.

సూర్య:—మిమ్మల్ని తీసుకురమ్మంటున్నారు అందరూ.

చంద్ర:—ఇదుగో. (లేచి) ఏమండీ వెళ్లుదామా?

సుధా:—క్షమించాలి. అందరం ఒకబండీలో పట్టం. రామచంద్రం మీతో వస్తాడు. మేమంతా ఇంకోబండీలో.

చంద్ర:—నా దొక్క మనవి. నాటక ప్రదర్శనాన్ని గురించి నా అభిప్రాయాలు వివరించి చెప్తాను. నలుగురూ వస్తే సందేహాలు వెంటనే తీర్చడానికి అవకాశ ముంటుంది. లేకపోతే నా పని అడుగడుక్కీ చిక్కే అవుతుంది.

సుధా:—ఎంతమాట! మేమందరం వస్తున్నామండీ. నేను వెళ్లి అనూరాధనుకూడా తీసుకునివస్తాను.

చంద్ర:—ఆహా. అయితే సరే.

[నిష్క్రమిస్తాడు సూర్యప్రకాశరావు, రామచంద్రాలతో. సుధాకరుడు కళ్యాణివైపు "చూచావా" అన్నట్టు చూస్తాడు. ఆమె నవ్వును]

వెం. ర:—అనూరాధని పిల్చేయండి. (సుధా. నిష్క్రమణము)

వెం. ర:—ఏం కళ్యాణీ! ఏమిటి విశేషాలు?

కళ్యాణి:—అన్నీ స - శేషాలే కనబడుతున్నాయి. వి - శేషాల్లేవు మామయ్యా!

వెం. ర:—ఊఁ. ఏమి టా సశేషాలే చెప్పు.

కళ్యాణి:—చెప్తున్నాను. జాగ్రత్తగా వినండి. ఈ కొత్తఆయనచూపు లెప్పుడూ అనూరాధనే ఆశ్రయించడం ఒకటి. అనూరాధ కారణం చెప్పకుండా సభకి రావడం మానెయ్యడం రెండు. ఈయన ప్రారంభంలోనే "కర్మణ్యే వాధికారస్తే మా ఫలేషు కదాచన" అంటూ బయలుదేరడం మూడు. చాలనుకుంటాను ప్రస్తుతానికి.

వెం. ర:—చాలా గ్రంథం కూర్చావే!

కళ్యా:—ఇందులో నాకూర్పేమీ లేదు.

వెం. ర:—ఈయనచూపు లామెనే ఆశ్రయించడం, అనూరాధ వెళ్లిపోడమూ రెండూ వేరేవేరే విశేషాలా, లేక అది బొమ్మా ఇది బొరుసూనా?

కళ్యా:—అంటే?

వెం. ర:—ఈయనచూపుల బరువు భరించలేక సిగ్గుపడి వెళ్లిపోయిం దంటావా? అసహ్యించుకుని వెళ్లిపోయిం దంటావా?

కళ్యా:—అది నేను చెప్పలేను.

వెం. ర:—అసహ్యించుకునే వెళ్లిపోయింటే ఆలోచించనే అక్కర్లేదు. అలాకాక మొదటి కారణమే నిజమనుకుందాము. వారిద్దరికీ అలాంటి అభిప్రాయమే ఉంటే ఎవ రొద్దంటారూ?

కళ్యాణి:—(తెల్లబోయి) అంత సులువా?

వెం. ర:—కాకేమి? అనూరాధ చదువుకున్నది. ప్రాజ్ఞురాలు, అవివాహిత. ఆయన విద్యావంతుడు, తెలివైనవాడు—

కళ్యా:—అంతవరకూ రైటే—

వెం. ర:—అతనికి వివాహమే అయిఉంటే కథ లేదు.

కళ్యా:—మనకి లేకపోతే సరా? లోకుల కుంటాయి కావలసినన్ని కథలు.

వెం. ర:—అనూరాధ అంత ముసరనిస్తుం దనుకోను. ఏమంటావు?

కళ్యాణి:—ఇప్పుడు వెళ్లిపోడము చూస్తే అలాగకూడా అనుకోవచ్చు మరి.

వెం. ర:—ఇంకేం ? ఇహ ఈయన డైరెక్షన్ మాట. నేను మొదటినుంచీ చెప్తున్నాను, నాటకం ఒక చేతిమీదే నడవాలని. మనవాళ్లంతా ఆంధ్రులు కారూ. ఎవరంతవారు వారూ. ఈయన రావడంచేతనయినా మనవాళ్లకి నాటకానికి సూత్రధారు డుండాలని తెలిస్తే గొప్పసంగతే.

సుధా:— (ప్రవేశించి) లేదండీ అనూరాధ. పదండి.

వెం. ర:—(లేచి) పదండి. తాళం వేసేస్తారా? (పోదురు)

## ఐదో రంగము

[సభ. వెంకటరమణయ్య అధ్యక్షుడు.]

వెం. ర:—కళ్యాణీ, ప్రార్థనపాట కానీ.

[కళ్యాణి 'ఈశ్వరసంకల్ప' పాట పాడును.]

వెం. ర:—మన ప్రార్థన అంగీకరించి తెఱపి చేసుకుని దయచేసిన చంద్రశేఖరరావుగారికి మన కృతజ్ఞత తెలుపుకుంటూ మన సమాజమువారితో ప్రథమ ప్రసంగము చెయ్యమని వారిని కోరుతున్నాను (చప్పట్లు.)

చంద్ర:— నన్నేదో పెద్దనిచేసి మీ ఊరికి ఆహ్వానించినందుకు చాలా కృతజ్ఞుణ్ణి. మొట్టమొదట

మీ నాటక ప్రదర్శనం చూసినప్పుడు, ఏనటుడూ నేనే మొనగాణ్ణంటూ యాక్టుచెయ్యకుండా మొత్తం ప్రదర్శనానికే తోడ్పడడం చూసి చాలా సంతోషించాను. ఇప్పుడా విషయాన్ని గురించే ప్రసంగిద్దామని అనుకుంటున్నాను — మనకెదురుగా అదిగో కృష్ణరాయబారము చిత్రము. అందులోని పాత్రములన్నిటినీ రవివర్మగారు దిద్దితీర్చారు. ఈ రంగాన్నే మనమంతా ఎవరికిష్టమున్న పాత్రమును వారు ధరించి ప్రదర్శిస్తామనుకొండి. ఒకరు కృష్ణుణ్ణి, ఇంకొకరు దుర్యోధనుడు—ఇలాగే మనమందరము ఆ చిత్రములోని పాత్రలన్నిటిని. అప్పుడు తయారయిన రంగములో మనకీ చిత్రములో గోచరించే సన్నివేశసౌందర్య ముంటుందా? ఉండడానికి అవకాశమేనా ఉన్నదా? సమాధానము చెప్పండి.

సూ.ప్ర:— అవకాశము లేదు.

చంద్ర:— అంటే, నాటకము వ్యక్తిప్రదర్శనములు కలిపికట్టినమూట కాదన్నమాట. పూర్తిగా, ఒకే వ్యక్తి దుస్తులు, పాత్రలు, రంగోపకరణాలూ సర్వమూ ఊహించి వాడి నిర్మించే ప్రదర్శన మన్నమాట. అట్లు కానినాడు ఆ ప్రదర్శనానికి కళాసిద్ధి ఉండదు. అవునా, కాదా?

సుధా:—అవునుకాని ఒక సందేహము పుట్టుతోంది. క్షమించాలి.

చంద్ర:—సందేహాలు తప్పులు కావు క్షమించడానికి. చెప్పండి.

సుధా:—ఆ సూత్రధారుడికంటె తెలివైన నటుడో నటో ఉండకూడదా?

చంద్ర:—తప్పకుండా ఉండవచ్చును. అప్పుడా తెలివైన నటుణ్ణే సూత్రధారుడుగా ఎన్నుకోవాలి నాటకసంఘమువారు. ఇతడు కాకుంటే అతడు. కాని పనిమాత్రము ఒక్కరిదే. (మౌనము)

సూ.ప్ర:—పని అంటే అ పెండలు హా గా కానా?

చంద్ర:—అన్నమాటే! ఆచరణలో మాత్రము ఇది ముఖ్యముగా నవరణలాగ కనపడుతుంది. రిహార్సలులో ఎవరేనా ఒకరు పట్లు బిగించి, ముక్కు తిప్పి తన్మయత నటిస్తే, ఆ ప్రాసలతోటు ఆవేశాన్ని కొంచెం దింపుతాడు సూత్రధారుడు. (నవ్వు)

సుధా:—ఆవేశము తెన్నుకుంటే అంతేకాని—

చంద్ర:—మనవిచేస్తున్నాను మీసందేహానికి జవాబు. "తక్కిన నటులంతా అతిసామాన్యులై ఒకరిద్దరు మాత్రం తెలివిగా నటిస్తేనో అంటారు." అంతేనా?

సుధా:—సరిగ్గా అంతే.

చంద్ర:—పాతచాకలపేట (ముద్రాక్షరశాల) వారి కథాకావ్యాలు మీరు చూచే ఉంటారు. వాటిలో బొమ్మలుకూడా ఉంటాయి. ఆబొమ్మల్లోని రామపట్టాభిషేకాన్ని ఊహించండి. అందులోని రాముణ్ణీ సీతనూ తప్పించి, అదుగో, ఆచిత్రములోని రాముణ్ణీ సీతనూ అక్కడ వేస్తే చిత్రము ఎలాగుంటుంది చెప్పండి. (నవ్వు) అందరూ సామాన్యులూ, ఒకరిద్దరు అతిమేధావులూ చేరిన సమాజము ఆదేప్రకారంగా ఉంటుంది.

కళ్యాణి:—అయితే ఆ తెలివైనవారి నిద్దరినీ నాటకాల్లో వెయ్యడం మానేసిపొమ్మంటారా, ఈ ఐక్యతకోసం?

చంద్ర:—చేతనైతే కొంత కిందకి దిగి సంఘం మొత్తాన్ని పైకి లేవనెత్తే ప్రయత్నం చెయ్యమంటాను.

కళ్యాణి:—దిగడము ఇష్టము లేకపోతే?

చంద్ర:—మరో పెద్దనాటకసమాజంలో చేరి—

సూ.ప్ర:—చంద్రశేఖరరావుగారి పర్యవేక్షణలో నున్న మాసమాజంకంటె పెద్దసమాజము ఎక్కడ ఉంటుంది లెండి?

వెం.ర:—నిజం. నిజం. ఆమాట సార్థకం చెయ్యమనే మీఅందరి అభిప్రాయమూ?

కళ్యా:—ఆహా, అందరి అభిప్రాయమూనూ. (లేతురు)

చంద్ర:—అందరూ ఇక్కడ లేరేమో? (కళ్యాణివైపు చూచును)

కళ్యాణి:—అందరమూ ఇక్కడే ఉన్నాము. కొందరే లెండి లేకపోత. అట్టే ప్రమాదము లేదు.

చంద్ర:—అయితే సరే. (అందరూనవ్వుదురు.)

సుధా:— మొత్తంమీద ఒక తుపాను లేవదీశారు. దీని వింతపర్యవసానం చూడాలి. కలవు.కార్యదర్శిగారింటికిగాబోలు మీ రివాళ.

సూ.ప్ర:— మీరు 'టీ' యిచ్చేశారుకాదూ, మా ప్రమేయం లేకుండా.

[నవ్వుదురు. సుధాకరుడు కళ్యాణిని ఆగమని సంజ్ఞ చేస్తాడు. వారిద్దరూతప్ప తక్కినవారు పోవుదురు.]

సుధా:—ఏం కళ్యాణీ! అనూరాధ రాలేదేం?

కళ్యా:— ఏమేమిటి? అదోతిక్క. కానీ, తప్పకుండా రావలిసిన సమావేశమే. నాటకాలూ, రిహార్సల్సేగాని ఇలాంటి సభలు మనం ఎప్పుడూ చేసుకోలేదు.

సుధా:— అస లెందుకు రాలేదూ అనూరాధ?

కళ్యా:— తనను అడగకుండా పిలిచామట చంద్రశేఖరరావుగారిని. తన గొడవ ఎవ్వరికీ అక్కర్లేదుట. ఏమేమిటో అంది.

సుధా:— ఏమిటన్నదనే అడుగుతూంట. కూర్చో చెప్తాను.

కళ్యా:— వారంతా వెళ్లిపోయారే?

సుధా:— ఒక్కదాన్నయిపోయా నని నీకు భయమా?

కళ్యా:— అదేమిటండీ అలా మాట్లాడుతున్నారు?

సుధా:— నాకేదో కావలిసి నేను కూర్చోమంటే నువ్వు వారంతా వెళ్లిపోయారని మొదలు పెట్టావు. నేను పురుషుణ్ణి, నీవు స్త్రీవారౌను. భయము వేసిందేమోనని—

కళ్యా:— చాల్లెండి ఈపాటికి. చాలా బాగా కనిపెట్టారు నాఇంగితం. నేను "సభ అయిపోయింది గదా, అంతా వెళ్లిపోయారు, మనం ఇక్కడెందుకు" అంటే చాలాచాలా అర్థాలు తీశారు. పోనీండి. ఎవరి మాట వారికే దక్కదు. (కూర్చుని) ఇదిగో కూర్చున్నాను. అడగండి ఏంకావాలో.

సుధా:— చెప్పు.

కళ్యా:— ఏమిటి చెప్పడం?

సుధా:—అడిగేను నే నప్పుడే.

కళ్యా:—ఓహో! అనూరాధ ఎందుకు రాలేదనికాదూ అడిగేరు? చెపుతున్నా. అనూరాధ ఇది వరకు చంద్రశేఖరరావుగారు మెచ్చుకున్నారని అందరిలాగే కులికింది. ఇవాళ మీయింటికి వచ్చేముందు ఆమెతో "నిన్ను మెచ్చిన డైరెక్టరుగారు వస్తున్నారు. పదవమ్మా సభలోకి" అన్నాను నేను. అనగానే ఆవిడగారికి కోపం వచ్చేసింది. 'నేను రా'నన్నది. నామాట వల్ల మానేస్తున్నదని "పోనీ, సుధాకరరావుగారి ఇంటిదాకా రా. అక్కణ్ణించి వచ్చేద్దువుగాని" అన్నాను. ఎక్కడో ఎముకల్లో దాగి కాస్త అభిమానం ఉంది గాబోలు, యింటిదాకా వచ్చింది. మీరూ, ఆ కొత్తాయనా కాళ్లుకడుక్కోడానికి వెళ్లారూ? అప్పుడు వెళ్లిపోడానికి లేచింది. "చివరిదాకా వచ్చాక ఉప్పురాయి వెయ్యకే" అన్నాను. "ఆఉప్పురాయి వేసే మర్యాద మీకు దక్కించడానికే వెళ్లిపోతున్నా"నంది. అందినప్పుడల్లా నే నోబెడ్డ విసురుతున్నానట. తన గొడవా తన బాధా ఎవరికీ అక్కర్లేదుట. ఇంకా ఏమేమిటో—

సుధా:—అవేమీ అక్కర్లేదు. నీహాస్యాలు బెడ్డలూ. చంద్రశేఖరరావుగారికి కలిగే ఆటంకం ఉప్పురాయి. తనకి బాధా. అర్థమైంది పూర్తిగా.

రామచంద్రం:—(ప్రవేశించి) మీకేదో టెలిగ్రాము.

సుధా:—(చింపి చదివి) కళ్యాణీ! లే. పోదాం. ఇవాళ మావూరువెళ్లాలి. అదే టెలిగ్రాము. నువ్వు నాకు కొన్ని రహస్యాలు చెప్పావు. నీకూ నేను చెప్తాను. మానాన్నగారు నా వివాహార్థము యత్నం చేశారట. పిల్లను చూసుకోవాలిట...నువ్వుకూడా వస్తా వేమిటి? పాటలో పరీక్ష చేద్దువుగాని.

కళ్యా:— అనూరాధని రమ్మనండి. నటనాకౌశల్యం పరీక్షిస్తుంది.

రామచం:—అనూరాధంటే జ్ఞాపకం వచ్చింది. (కళ్యాణితో)మిమ్మల్ని ఆవిడ ఒకమారు రమ్మని చెప్పమంది.

సుధా:—మీటింగు విశేషాలకోసం. వెళ్లు వెళ్లు.

కళ్యాణి:—సరే లెండి. కాని మీ రెప్పుడు వెళ్తారు ?

సుధా:—రేపు మధ్యాహ్నం బండీలో.

కళ్యా:—అమాత్రం వ్యవధి చాలునులెండి.

సుధా:—దేనికి ?

కళ్యా:—అనూరాధను మీతో పంపడానికి.

సుధా:—Thanks Thanks.

[జట్టువిప్పేశానన్నట్లు బుగ్గలు పిడికిళ్లతో కొట్టుకొని నిష్క్రమి.]

ఆరోరంగము

[అనూరాధగది. అనూరాధ కుట్టుకుంటూండగా కళ్యాణి ప్రవేశం. టేబిలుపక్కనుంచి వస్తూ టేబిలుమీది చంద్రశేఖరరావు బొమ్మను చూచి తల పంకించి పచారుచేసినట్లుగా నడుస్తూ—]

కళ్యాణి:—ఏమండోయి సూత్రధారిణిగారూ! సూత్రధారుడుగారు దిగేరు. ఇకముందు—

అనూ:—ఏమిటి కళ్యాణీ, నీనోటికి శుద్ధీ బద్ధం లేదా ఏమిటి?

కళ్యాణి:—ఏం? నే నన్న తప్పుమాటయేమిటి?

అనూ:—తెలీదా నీకు?

కళ్యాణి:—సూత్రధారిణి అన్నాను. మన నాటకాలలో రంగప్రసాధనము చేసేది నువ్వేగా? మరి సూత్రధారిణివి నీవుకాక మరెవ్వరు?

అనూ:—ఊఁ. తర్వాత?

కళ్యాణి:—(వత్తివత్తి పలుకుతూ) ఇప్పుడు సూత్రధారుడుగారు దిగేరూ—

[అర్ధోక్తిలో అనూరాధ లేచి వెనకనుంచి కళ్యాణిచెవులు పట్టి అడిస్తూ.]

అనూ:—సూత్రధారుణ్ణీ సూత్రధారిణ్ణీ కలిపి గంటులు వెయ్యమన్నావ్.

కళ్యాణి:—గంటులు వెయ్యమనలేదు. ఈసూత్రధారుడుగారి దారిలోంచి తప్పుకోండీ—లేకుంటే చిక్కుపడతారూ, ఈయనగా రెలాంటివారో అని హెచ్చరించాను ... చెప్పవలసిన ముక్కలు నాలుగూ చెప్పాను. ఇంక నీకర్మం. (పోబోవును.)

అనూ:—కళ్యాణీ !

కళ్యాణి:—(తిరిగివచ్చి) ఎందుకు సింహేంద్ర మధ్యమా!

అనూ:—మధ్యమం మారాలిగాని శంకరాభరణం అంతదానివే నువ్వు.

కళ్యాణి:—అబ్బా! జ్యేష్ఠామూలలు కలవాలిగాని వృశ్చికం అంతదానివి కావూ నువ్వు?

అనూ:—ఎప్పుడూ నువ్వు నన్ను కరవడమేగాని నే నెప్పుడేనా కుట్టేనే నిన్ను?

కళ్యా:—నన్నే కుట్టాలేమిటి? సుధాకరరావుగారిని కుట్టావు. ఎన్ని సంబంధాలొచ్చినా నువ్వేదో తన నెత్తిమీద కెక్కి పిండి దంచుతావని, అతన్నీ తిరగగొట్టేస్తున్నాడు.

అనూ:—నేను తిరగగొట్టేయమన్నానా?

కళ్యా:—అవును. అప్లైడరుగారు నీవెంట తిరిగినన్నాళ్లూ అలాగే అంటావు. వెంటతిరుగుతున్నాడని సరదాయేగాని ఎందుకు తిరుగుతున్నాడో ఏమేనా ఆలోచన ఉంటేనా?

అనూ:—మహా ఆలోచనపరురాలివి నువ్వు చెపుదూ?

కళ్యా:—నిజం చెపితే నిష్ఠూరవ్యం. నాకెందుకమ్మ గొడవ.

[అని వెళ్లబోతూంటే అనూరాధ కళ్యాణి జడ పట్టుకుని నిలిపి "రా" అని మంచముమీద కూర్చోపెట్టి.]

అనూ:— ఊఁ. ఇప్పుడు చెప్పు. ఏమిటంటావు?

కళ్యా:— ఈ కొత్తఆయనతో సంబంధం పెట్టుకోవమంటాను.

అనూ:— (లేచి టేబిలు దగ్గరకి పోతూ) అంటే అసలు నటించేవద్దంటావా?

కళ్యాణి:— (లేవకుండానే) నటించకమ్మా. నటించు. మొట్టమొదట ఆయనగారు నిన్ను మెచ్చుకున్నప్పుడు లెక్కలేనట్టు నటించావు. మొన్న రెండో మారు పరిచయం అయినప్పుడు వెళ్లిపోవాలని ఉన్నట్లుగా నటించావు. ఇవాళ నామాట లక్ష్యం కానట్లుగా నటిస్తున్నావు. నటించవద్దంటే మానతావా? (జవాబు రాదు. కళ్యాణి కదలకుండానే) ఏం! అనూ! కోపం వచ్చిందా? (జవాబు రాదు. అనూరాధ కన్నీరు రాలుస్తూ పాదం ఆడిస్తుంది. కళ్యాణి అది గమనించి అనూదగ్గర చేరి గడ్డముపట్టుకుని తనవేపు తిప్పుతూ) అనూ! (ఆమె బడబడ కన్నీరు రాల్చును. కళ్యాణి లాలనగా) అనూ! అబ్బ ఊరుకోవూ? నేను నిన్ను ఏడిపించడానికి రాలేదు. ఏదో మనస్సులో అనుమానం తట్టింది. (టేబిలుమీది బొమ్మను తీసి చూపిస్తూ) చంద్రశేఖర్రావుగారు ఇక్కడకూడా ప్రత్యక్షం. మరి ఏమనుకోమన్నావు చెప్పు? (అనూరాధ బొమ్మని లాక్కొని రెండుముక్కలుగా చింపేస్తుంది. కళ్యాణి వాటిని లాక్కొని కుర్చీమీద పడేస్తుంది) ఇదిగో! నాది పొరపాటు. (కాళ్లంటి) క్షమించు.

అనూ:—(కళ్లు తుడుచుకుని నవ్వుతూ ఆమె తలను అల్లే నొక్కి) క్షమిస్తే ఏమిస్తావు?

కళ్యాణి:—నువ్వేం కోరితే అదీ.

అనూ:—తొందరపడి మాటిచ్చేస్తే తర్వాత బాధపడతావు సుమా!

కళ్యా:—ఇస్తాను. (లేచి) నువ్వేది కోరితే అది!

అనూ:—ఇవ్వలేకపోతేనో?

కళ్యా:—ఆయనగారు ఒప్పుకోకపోతే నన్నేం చెయ్యమంటావ్!

అనూ:—అదుగో మళ్లీ! (కితకితలు పెట్టును.)

కళ్యా:—అబ్బ! ఏం ముద్దరాలివే. (కితకితలు పెట్టును)

[ఇద్దరూ నవ్వుతూండగా వెంకటరమణయ్య, చంద్రశేఖర్రావు ప్రవేశిస్తారు. కళ్యాణి నోటిమీద చెయ్యిపెట్టుకుని అనూరాధకి చూపిస్తుంది. అనూ అటుతిరిగి—]

అనూ:—ఏం బాబాయి! ఇలా వచ్చారు?

వెం. ర:—వచ్చామమ్మా! పనుంటే వచ్చాము.

అనూ:—ఇలా కూర్చోండి. (వెంకటరమణయ్య బొమ్మముక్కలున్న కుర్చీలో కూర్చుంటాడు. తర్వాత చంద్రశేఖర్రావుతో) పిచ్చుకగుంటమీద భాగీరథీ ప్రవాహము.

చంద్ర:— (బహుమాన పురస్సరంగా చూస్తాడు.)

అనూ—(రహస్యంగా కళ్యాణితో) బొమ్మ ఎక్కడుంది?

కళ్యాణి:—కుర్చీలో ఉంది. చూడలేదులే. (ప్రకాశముగా చంద్రశేఖర్రావుతో) నాటకసమాజాన్ని చక్రంలాగ తిప్పడము ప్రారంభించినట్లున్నారు.

చంద్ర:—ఆచక్రానికి కేంద్రం మీ అక్కగారేకనక—

కళ్యాణి:—కేంద్రాన్ని సరిచూడడానికి వచ్చారు.

వెం. ర:—'సరిచూడడం' అనడంకంటె 'సర్దుకోడం' అంటే బాగుంటుంది.

అనూ:—సర్దుకోడమా? ఏనాటకంలోకి?

వెం. ర:—మన నాటకంలోకే!

అనూ:—మన నాటకంలోకే? సర్దుకోడమా? సర్దుకోడమేమొచ్చె?...సుధాకరరావుగారు నాయకపాత్ర ధరించరాఏమిటి?

చంద్ర:—చక్కగా గ్రహించారు.

కళ్యాణి:—(చంద్రశేఖరరావుతో) మీరు వేస్తారుకాబోలు ఆవేషం?

[అని అనూరాధవైపు కొంటెగా చూస్తుంది]

చంద్ర:—శాబాష్. ఇద్దరిద్దరే.

అనూ:—(కళ్లు వాల్చి) అయితే నే నాలోచించి సమాధానం చెప్తాను.

వెం. ర:—దీనిలో ఆలోచించడానికేముంది?

అనూ:—సుధాకరరావుగారెందుకు వెయ్యరు?

వెం. ర:—ఆయనకి వాళ్ల నాన్నగారు లేఖ తెలిగ్రాం ఇచ్చారట. ఊరికెళ్లుతున్నారు.

చంద్ర:—ఏదో వివాహసంబంధము.

కళ్యాణి:—ఆయన చెప్పారా మీతో?

[అనూరాధ లేచి వెనక్కి తిరుగుతుంది.]

చంద్ర:—ఊఁ.

[కళ్యాణి అనూరాధను చూచి, వీపుమీదచేయి వేసి—]

కళ్యాణి:—అనూ, టీ పట్టుకురా. వెళ్లు. (తోసి పంపివేసి, ఆమెను క్షణం నిదానించిచూచి, వెనక్కి తిరిగి చంద్రశేఖరుతో) క్షమించండి. మీరు వివాహితులా?

చంద్ర:—కానండీ! (ఆశ్చర్యముతో చూచును.)

వెం. ర:—అదేమిటి కళ్యాణీ, అలా అడిగేవు!

కళ్యాణి:—వివాహప్రశంస వచ్చింది కనక — అంతేకాదు. వీరికి వివాహమే అయియుంటే భార్యని ఎటువంటి నటినిగా తయారుచేసేవారో అని!—(చంద్రశేఖరావుముఖవైఖరిని గమనించును.)

చంద్ర:—(ముఖం చిట్లించుకుని) అవన్నీ ఎందుకండీ ఇప్పుడు? ఏమండీ వెంకటరమణయ్యగారూ వెళ్లుదామా?

కళ్యాణి:—క్షమించండి. (నమస్కారము చేస్తూ) స్త్రీలే స్త్రీపాత్రలు ధరించాలని వాదించే (వారిలో) వారు మీరు!

చంద్ర.—అలాగని కట్టుకున్న భార్యని రంగం మీదికెక్కిస్తామా!

కళ్యాణి:—రంగంమీదికెక్కే స్త్రీకి మర్యాద లోపం ఉంటుందనే మీఅభిప్రాయం అయినట్టు మీ ప్రసంగాలలో మాకెక్కడా స్ఫురించలేదులెండి.

చంద్ర:—సంఘంయొక్క దృష్టిలో తప్పకుండా ఉంటుంది. అనాదినుంచీ అనుక్రమంగా వస్తున్న భారతస్త్రీల అభిజాత్యం—

కళ్యా:—ధ్వంసంచేస్తున్నారంటారు రంగం మీద నటించే స్త్రీలు. నేనూ, అనూరాధ, ఇంకా ఎందరెందరో—

వెం. ర:—ఏమిటి కళ్యాణీ ఈఅధికప్రసంగం?

కళ్యాణి:—మీ రొక్క నిముష మూరుకోండి మామయ్యా!

వెం. ర:—(చిరాకుగా లేచి) రాధమ్మా! టీ కాలేదు? చంద్రశేఖరావుతో) అయ్యా! వెళ్లిపోదాం ఒకక్షణం ఆగండి. (వెళ్లును)

కళ్యా:—అయ్యా! చంద్రశేఖరావుగారూ! భార్యలు రంగభూమి నెక్కితే పోయే అభిజాత్యం మాబోటి కన్య లెక్కితే పోదంటారా?

చంద్ర:—(చిరాకుగా) అయితే ఏమంటారు?

కళ్యా:—ఏమంటానా? నష్టమర్యాదల మయిన మాతో నాటకరంగము ఎక్కి మీమర్యాద పోగొట్టుకోకండి. ఆ సుధాకరరావుగారితోనే నటిస్తుంది మా అనూరాధా అంటాను.

[రివ్వున నిష్క్రమించును. చంద్రశేఖరావు వెడనవ్వు నవ్వి ఆమెపోయిన వైపు చూస్తూ కుర్చీలోని బొమ్మముక్కలు చూచి చకితుడై ఆముక్క లందుకుని కలిపి చూసుకుంటాడు... వెంకటరమణయ్య, అనూరాధ, కళ్యాణి టీకప్పులతో ప్రత్యక్షం. చంద్రశేఖరావు బొమ్మముక్కలు జేబులో దాచేస్తాడు. అన్నికప్పుల లోనూ అనూరాధ టీ పోస్తుంది. వెంకటరమణయ్య టీకప్పుని చంద్రశేఖరావువైపు తోస్తాడు. అందరూ తాగేస్తారు.]

కళ్యా:—ఏం అనూ? టీ చెయ్యడం ఇంతసేపు పట్టింది? ఏమాలోచించావు చివరికి?

అనూ:—దేన్ని గురించి?

కళ్యా:—మామయ్య వచ్చిన పనిని గురించి.

అనూ:—నేను నటించను.

వెం. ర:—ఆఁ.

అనూ:—మనవి చేస్తున్నాను. (వెంకటరమణయ్యతో) మీరు లోపలికి వచ్చేదాకా మీసంభాషణ వింటూనే ఉన్నాను. (గొంతు మార్చి దురుసుగా) మొదటలో నేనూ, కళ్యాణీ నాటకంలో వేషం వెయ్యమంటే "స్త్రీలు వ్యాసాలు వ్రాయడం లేదా? వేదికల మీద ఉపన్యాసా లివ్వడంలేదా? గానసభలు చెయ్యడంలేదా? నాట్యకళకూడా లలితకళే. నటనాకౌశల్యం అలవర్చుకోటంవల్ల గౌరవమే వస్తుంది కాని న్యూనత రా"దని వాదించారు మీరు. అవునని ఒప్పుకున్నాం. నిజమే. వాఙ్మయకళ, గానకళ అభ్యసిస్తే పోవని అభిజాత్యం నాటక కళ అభ్యసిస్తే పోతుందా? కళాభ్యాసం స్త్రీలగౌరవాన్ని ఎక్కువచేస్తుందా, వీరనేటట్లు దిగదీస్తుందా? దిగదీసే మాటయితే స్త్రీలే స్త్రీపాత్రలు ధరించాలని గట్టిగా ఉపన్యాసాలిచ్చే కళాభాయీలు మాగౌరవాన్ని ఏమి చేస్తూన్నట్లు?...బాబాయి? జగన్నాటకంలో అనూరాధకి సుధాకరుడి సాంగత్యమే అనాదినుంచి వస్తున్నది. మన నాటకంలో మట్టుకు తదన్యము ఎందుకు జరగాలి?.

వెం. ర:—సరే. మేము వెళ్లుతాము.

[వెంకటరమణయ్య చంద్రశేఖర్రావుతో నిష్క్రమించును.]

కళ్యాణి:—మొత్తానికి గట్టిదెబ్బే కొట్టావే!

అనూ:—మన యిష్టం కష్టం పరామర్శించకుండా చదరంగంలోని జంతువుల్ని నడిపినట్టు స్వార్థం కోసం మన్ని నడపడానికి అవతరించిన కళాభాయీలను ఏం చెయ్యాలి? ఏదీ అతని బొమ్మ?

కళ్యాణి:—పట్టుకుపోయాడు.

[పకపక నవ్వుదురు]

. తెర .





కోడిపుంజుల కయ్యము

హా! ఖగేంద్రంబులార! కయ్యమున నీల్గి - పోవుచున్నారె దేవతాభువనమునకు?
మీరు రంభాతిలోత్తమా మేనకాది - భోగకార్యార్థమై కోడిపుంజులార! [శ్రీనాథుడు]

= చిత్రకారుడు : శ్రీ వి. సూరన్న =

# నా గొప్పరచన

•

= శ్రీ వేదుల సత్యనారాయణశాస్త్రి =

తీరుతీరుల పండ్లూ, రకరకాల పూవులూ రాశిపోసి, వాటిలో ఏది గొప్పదో చెప్పడము ఏలాగు? ఒక్కొక్క ఫలానికి ఒక్కొక్క రుచి ఉంటుంది. ఒక్కొక్క పుష్పానికి ఒకవిధమైన వర్ణవైచిత్రి, ఒక కమ్మని వాసన ఉంటవి. ఒకదానిలోని గుణము మరొకదానిలో లేదు. అభిరుచినిబట్టి ఏదో ఒకటి మనకు ఇష్టమైతే కావచ్చు. మనకు ఇష్టమైనంత మాత్రాన గొప్పది కాదు. కానక్కరలేదుకూడా. అందరి ఇష్టాలనూ కొల్లగొనగల గుణబాహుళ్యము ఏ వస్తువులో ఉన్నది? మరి ఏది గొప్పదని చెప్పగలము?

ఒకనాడు అక్బరుచక్రవర్తి వీరబలుణ్ణి "ఏ చెట్టు గొప్పది?" అని ప్రశ్నించాడట! ప్రత్తిచెట్టని వీరబలుడు జవాబు చెప్పాడు. "ఎలా చెప్పగలవు?" అని అడిగాడు అక్బరు. "ప్రభూ! మానవజాతిమానాన్ని కాపాడుతున్నది. అంతకంటె గొప్పతనమేమిటి?" అన్నాడు వీరబలుడు. అక్బరు సంతోషించాడు. అయితే వీరబలుడు ప్రయోజనాన్నిబట్టి గొప్పతనము నిర్ణయించాడు. కవిరచన ప్రయోజనానికి అతీతమైనది. ప్రయోజనము లేకపోయినా ఒక్కొక్క రచన కళాదృష్టినిబట్టి గొప్పది కావచ్చు. ఇంకొకటి. గొప్పదంటే పెద్దదే కానక్కరలేదు. సాలగ్రామములో విష్ణుసాదృశ్యము ఉన్నట్లు చిన్న రచనలోను గొప్పతనము ఉండవచ్చు.

అసలు రచనలోని గొప్పతనాన్ని నిర్ణయించే దెవరు? కవి తన రచనలలో ఏది తన కిష్టమైనదో చెప్పగలడేకాని గొప్పదేదో చెప్పలే డనుకుంటాను. అది చెప్పవలసినవాడు సహృదయుడైన పాఠకుడు. కాని 'లోకో భిన్నరుచిః' అన్నారు పెద్దలు. ఒకరికి నచ్చినది మరొకరికి నచ్చకపోవచ్చు. ఒకరు బాగులే దన్నది మరొకరికి రమణీయముగా కనపడవచ్చు. ఏదైనా ఎవరికైనా నచ్చడానికీ, నచ్చకపోవడానికీ వారి మానసికస్థితి ముఖ్యకారణము. మనసు సుముఖముగా ఉన్నప్పుడు ఎంత స్వల్పవిషయమైనా అత్యంత రమణీయముగా కనబడవచ్చు. మనసు కలతపడివుంటే ఎంత సౌందర్యమైనా చిరాకుపుట్టించవచ్చు. కాబట్టి ఏరచన అయినా ఎవరికైనా అతగాడి మనస్థితినిబట్టి చప్పనిదో కమ్మనిదో, కొద్దిదో గొప్పదో అవుతూ ఉంటుంది. అన్నీ అందరికీ ఎప్పుడూ నచ్చవు. నచ్చలే దనడములోను, నచ్చిన దనడములోను కొంత సత్యము లేకపోలేదు. ఆ సత్యానికి మనస్సే విలువ కట్టాలి. అందుకే నేనుసహృదయుడైనపాఠకు డన్నాను. సహృదయుడంటే, రచయితమనస్థితిని తనలో కల్పించుకోగలవా డన్నమాట. అతని నిర్ణయానికి కొంత విలువ ఇవ్వాలి. కాని రచయిత ఆ నిర్ణయము చెయ్యగలడా మరి?

కవి తన రచనలన్నీ గొప్పవే అనుకుంటాడు. ప్రతి రచనలోను ఏదో ఒక విశిష్టత తోచకుంటే దాన్ని లోకముకంట పడనీయనే పడనీయడు. కన్నతల్లికి తన సంతానముమీద ఉన్న అప్యాయమే కవికి సహజముగా తన రచనలపై ఉంటుంది. అందుచేతనే కృతి పుత్రిక అయింది. ఆ అప్యాయానికి హృదయమే కాని బుద్ధి ఉండదు. చెవులే కాని కన్ను లుండవు. గుణమే

కాని దోషము ఉండదు. ఎవరైనా కాదంటే, "ఏగతి రచియించిరేని సమకాలమువారలు మెచ్చరే గదా!" అని అధిక్షేపిస్తాడు. అందుచేత అతడు ఏది గొప్పదో చెప్పలేడు. కాని అన్నిటిలో ఏరచన తనకిష్టమో చెప్పవచ్చు. కాని అది లోకానికి గొప్పది కాకపోవచ్చు. తన యిష్టమే గొప్పదనడానికి కవికి మాత్రము ఏమి హక్కు? కవి స్రష్ట. సృష్టిలోని ఆనందమే కాని పూవుల తావి తీవకు ఎక్కడిది? కవి సృష్టి కర్త. జగత్సృష్టిలోని శబ్దమో రూపమో గంధమో రసమో స్పర్శో ఏదోఒకటి హృదయానికి అపూర్వమైన అనుభవావేశాన్ని కలిగిస్తుంది. ఆ ఆవేశము భావస్థిరత పొంది ఊహగా పరిణమిస్తుంది. ఆ ఊహకు విశ్వజనీనత కలగడానికి ఒక రూపము కల్పించి, జీవము పోసి, ఆనందిస్తాడు కవి. తాను పొందిన మధురానుభవము ఇతరులకుకూడా కలగడానికి పదాలతో సొగసుగా దాన్ని చిత్రిస్తాడు. అదే రచన. అనుభవించి ఊహించిన రచన నిత్యానందము ఇస్తుంది. ఊహించి అనుభవించిన రచన ఆనందాభాసము కలిగిస్తుంది.

ఒకనాటి అనుభవము చెపుతాను. జయపురపు మహారణ్యములో తిరగడానికి వెళ్లాను ఒక స్నేహితుని వెంట. అది ఆషాఢమాసము. నదిగట్టున ఒక పెద్ద రాతిమీద కూర్చున్నాను ఒక్కణ్ణి. కనుచూపు మేరలో ఎదురుగా ఒక మహాపర్వతము పక్కన దున్నిన పొలాలు. మబ్బుచాటున పొద్దుపొడిచింది. కొండ కొమ్మున నల్లమబ్బు కూడింది. పర్వతరాజు నీలిపాగా మీది తురాయిలాగు ఇంద్రధనుస్సు. సన్న చినుకు పడుతున్నది. చల్లని స్పర్శకు శరీరము గగుర్పొడిచింది. ఎందుకో నిట్టూర్పు విడిచాను. కదులుచున్న మబ్బును చూస్తూఉంటే "కంఠాశ్లేషప్రణయిని జనే కింపునర్దూరసంస్థే" అన్న శ్లోకము జ్ఞప్తికివచ్చింది. కాళిదాసు, యక్షుడు, మేఘసందేశము ఒకదాన్ని ఒకటి తరుముకొనివచ్చి నాహృదయాన్ని కదిపివేసినవి. ఆ మేఘుడు నాకోసమే వచ్చినట్లు "ఏవిరహార్తుడేని హృదయేశ్వరిసన్నిధి కేగజాలు వార్తావహు గోరి యీ గిరినితంబతటంబున నెందునేని వాపోవుచునుండె నేమొ యని పొంచి దెసల్ పరికించి చూచుచున్నావె ప్రవాసదుఃఖితమనఃప్రవణోత్సవమా పయోదమా?" అన్న పద్యము అప్రయత్నముగా వచ్చింది. మేఘసందేశము చదివిన సంస్కారము ఆ అనుభవాన్ని ఊహగా మార్చింది. ఆమేఘము నాకోసము రాలేదు. నేను యక్షుడను కాను. ఏదో మధురస్మృతి. ఎప్పటిదో.

"లేదలనాటి యుజ్జయిని
లేదలకానగరీప్రయాణస
మ్మోదము. లేదు ప్రేమభర
ముగ్ధుడు నాటి గిరిప్రవాసి. భా
నూదయ చిత్రితేంద్రధను
రుజ్జ్వలమూర్తివి నీవు నాటి
మర్యాద ప్రవాసిబాంధవుడ
వై కనుపించెదవోయి నేటికిన్."

అని నాలో కలిగిన భావాలన్నీ ఆ మబ్బుతో చెప్పుకొన్నాను. 'ఆషాఢమేఘుడు' అనే రచన రూపు దాల్చింది. ఇప్పటికీ అరచన చదువుతుంటే నాకు ఆషాఢమేఘమూ, ఆనాటి మధురానుభవమూ పొడగట్టుతూ ఉంటవి. కాని అది ఒక చక్కని భావసన్నివేశము. కథాశరీరాన్ని ఆశ్రయించని భావాలకు మాధుర్యమే కాని సౌందర్యము ఉండదు. సంస్కారము పొదిగిన స్వప్నమది. అసంపూర్ణము. గొప్పదని ఎలా చెప్పడము? అది ఖండమే. అటువంటి మధురఖండికలు నాదృష్టికి 'దీపావళి' లో చాలా ఉన్నవి.

అసలు ఖండకావ్యాలు ఆత్మాశ్రయాలు. ఏదో ఒక అనుభవమో, ఆవేదనో వాటిలోని వస్తువు. ఆ రచనలో కవికి అస్తిత్వమున్నది. ఏ మానసికస్థితిలో ఆ రచన సాగిందో ఆ స్థితికి అనుకూలమైన వాతావరణములో అవి ఎప్పుడూ ఆనందాన్ని కలిగిస్తవి. అన్నిటిలో ఏదో ఒక ప్రత్యేకతా, విశిష్టతా లేకపోలేదు. ఒక రాగాలాపనవంటివి అవి. అంతమాత్రముచేత గొప్పవనడానికి నామనసొప్పదు. అవి కమ్మనివి. చక్కనివి కూడా కాకపోవడమే వాటి గొప్పతనానికి లోటు.

ప్రతిరచనలో ఒక కొత్తమోజు ఉంటుంది. వెనుకటిదానికంటె ఇప్పటిది గొప్పగా ఉన్నదని కవి ఎప్పటికప్పుడు అనుకొంటూ ఉంటాడు. అనుభవము

ఎక్కువైన కొద్దీ ఆ అవస్థ తప్ప దనుకుంటాను. అందులో కొంత నిజముకూడా లేకపోలేదు. 'దీపావళి' లోని ఖండకావ్యాలకంటె 'ముక్తావళి' గొప్ప దనుకొన్నాను. దానికంటె 'ఆరాధన' గొప్పదని అనుకొంటున్నాను. 'ముక్తావళి'లో—

"ఈవెడయార్పు గాడ్పుటల
యింపుల గ్రుచ్చిన దండ ఛిన్నమై
పూవులు రేకు లూడి పడి
పోయె మిగిల్చితి ప్రేమవాసనా
ప్లావితతంతువు, అద్ది యురి
వైతువో నా మెడ, నీమృణాళరే
ఖావరహస్తమం దభయ
కంకణమట్లు ధరింతువో ప్రభూ!"

అనే పద్యమువంటివి చదువుకొన్నప్పుడు ఆ రచన చాలా గొప్ప దనే భావము కలుగుతూఉంటుంది నాకు. అన్నిభావాలూ నాపవిత్రనయనాంబుకణోజ్జ్వల మౌక్తికాలే. వాటిని భక్తిసూత్రానికి గుచ్చి ముక్తావళి తయారుచేశాను. కాని భక్తుణ్ణి సృష్టించలేకపోయాను. అందుచేత అదీ గొప్పదనలేకపోతున్నాను.

"ఆమె జగదీశమకుటాగ్రసీమనుండి
యుర్విపై జారిన సుధామయూఖరేఖ
ఆమెపదసన్నిధానదివ్యస్థలాన
భక్తినమ్రుడనై నిలంబడినయపుడు
నాకకల్లోలినీపదన్యాసమునకు
దరవినతమైన హరజటాభరమువోలె
నతుడనయ్యు మహామహోన్నతి వహింతు."

అనే 'ఆరాధన'లోని పద్యాలు రచించినపుడు ఇంతకన్నా గొప్ప రచన లేదని గర్వపడ్డాను. కాని అది సరికాదు. ఇప్పుడు ఊహలో ఒక మహాకావ్య మున్నది. అదే నారచనాపరమావధి అని ఇప్పటికీ అనుకొంటున్నాను. ఉదాత్తమైన కథావస్తువు. ఆకథలోని పాత్రలన్నీ సజీవాలు. వాటిచేత నవ్వించాలి, ఏడిపించాలి, ఉన్నతాశయాలతో మహోన్నతాదర్శాన్ని సాధింపచేయాలి. కాలము గడచినకొద్దీ ఆపాత్రలు నాజాతిజీవితానికి సన్నిహితాలవుతూ ఉండాలి. నన్నయభట్టారకుని ఔచితీ, శ్రీనాథుని పదగుంభనమూ, తిక్కన తెనుగుదనమూ, పింగళిసూరన కల్పనాగౌరవమూ కలబోసి భాషలోను, భావములోను, సంఘటనలోను, సన్నివేశములోను "క్షణేక్షణే య న్నవతా ముపైతి" అనే సూక్తికి లక్ష్యముగా ఒక రచన చేయాలి. ఆరచన ఉషస్సువలె నిత్యనూతనమై—

"భూతకాలదినాంతానుభూతితోడ
భావియుదయాల కల్యాణపథము బట్టి
వెలుగునీడల జీవనవేణు వూది"

నా గొప్పరచన కావాలి. అంతవరకూ నా గొప్పరచన ఏదో నేను చెప్పలేను. అది ఒక స్వప్నము. ఆస్వప్నము ఎప్పుడు సత్యమవుతుందో!



# సంక్రాంతి సంబరాలు

— శ్రీ జోస్యము జనార్దనశాస్త్రి —



వింత బెడంగుతోఁ బయిరుపిట్టలు కట్టిన జంట వీడకే
బంతులు బంతులై కలరవమ్ములఁ గమ్మని భావగీతముల్
వంతులఁ బాడుకొం చదిగొ వచ్చెడి నామెంత లారగింప, సం
క్రాంతికిఁ బుట్టినిండ్ల కనురాగపు టల్లుళ్లు, నాఁడుబిడ్డలై.

వడి చెడి పాలపిట్ట కడుపాత్రముతోఁ జని పంటచేల నె
క్కుడుతమిఁ బాలఁబట్టి పిసుకుళ్లగు కంకుల నొక్కిపట్టగా
వడిసెల రువ్వులోపలనె పయ్యెద దాఁచిన సుంకుకంకులన్
కడిగఁ గొనన్ జనెన్ పొలము కావలికత్తియ లాగ్రహింపఁగన్.

గాలికి నెండవాన కడగండ్లకు నోరిచి రేఁబవళ్లు, సే
ద్యాలకుఁ బై పరామరికకై యిలుద్రొక్కని కోడెకాండ్రకై
లో లలి మోసులెత్తఁ బనిలోఁ బనిగాఁ దను దామె జొన్నక
ళ్లాలకు సద్దిమోతకుఁ గడంగిరి కాపుతుటారికత్తియల్.

ప్రోఁ గొనరించి రాసులుగఁ బోసిన పైడివిధానఁ బంటలన్
దూగిన జొన్నకళ్లములతో వెలి నారగఁబోసిన వెండి యన్
లాగునఁ బ్రత్తిచేల సిరులన్ నరు లందరు కూడుగుడ్డలన్
దోఁగఁగ ధాన్యలక్ష్మి జతతో ధనలక్ష్మియు వచ్చి రొక్కటన్.

బంతులు కట్టి పెట్టినది బావల నేయఁగఁ జెంపుమల్లి, బ
ల్వింతల జాళువానగిషిపింపిణిబిళ్లల నెత్తిఁ గూర్చ చే
మంతులు, వండి వార్చెఁ గలమాన్నము తుమ్ములు, సంబరాలు కొం
డంతలు! నీకుఁ గంటఁ దడి యూర దిదేమిటి కమ్మ! పద్మినీ!

మచ్చరికించు నాల్మగల మానపుఁ బెన్బిగి సల్లఁజేయఁ జం
చచ్చణహాసభాస యగు చల్లని తల్లి హిమానిపంపునన్
వెచ్చగఁ బండి, యొండొరుల నిండుకవుంగిటి మున్క వేకువల్
పుచ్చక ముట్టినన్ గరచు పుర్వుల నేళుల మున్గనేటికిన్ ?

కూసెనో లేదో కోడి యుడుకుం జెలికౌఁగిటి పొందుఁ బాసి, ల
క్ష్మీసహితంబుగా నిదురఁ జెందిన వెన్నుని లేపి, ముక్తికాం
తా సహచర్యకై పలువెతల్ పడుచుండిరి ఛాందసుల్ ధను
ర్మాసపుసేవఁ బొంగళులుమాత్రమె పొందిన సత్ఫలంబుగా.

పలపల తెల్లవార హిమవంతుఁడు లోకము నాకళించి బల్
చలువవెలుంగు క్రమ్మెడి పసన్ నగు నవ్వకు మాఱునవ్వె చి
క్కుళ్ళు, లల కొండపబ్బమునఁ గుండలఁబోలిన కాయ లిచ్చు గు
మ్మళులు, పువుల్ చవుల్ చెఱపుమై చెఱకుల్ నరకుల్ వడెన్ గదున్.

కొండంత సంక్రాంతిపండుగు తేని మేల్ రాక ముత్తెపు టక్కరముల వరుస
పరువంపుదేవత ప్రాణప్రతిష్ఠకై సర్వతోభద్ర రచనలీల
పండువెల్లఁ దమిల్లు వాసిపోకుండఁగాఁ గూర్చిన వలిపెంపు గుదులపోల్కి
మునరు వేడ్కఁ బుడమి ముసలిముత్తైదువు శరమున పూలసూసికములట్లు
కన్నియ లరుణోదయమునకన్న మున్న-పంచరంగుల ముగ్గులఁ బంచ, లంగ
ణములు తమతమ నేర్పు విన్నాణము లగు-పింపఁ గైసేసి రలరుగొబ్బిళ్ళతోడ.

---

## తే యా కు క థ నెం. 3



డూఆర్సులో తేయాకు కోయువారు.

# రెండాకుల ఒక చిగురు

లేత ఆకులచేకప్పబడి తయారులోనున్న తేయాకుదుబ్బులకు ఆకుకోయు సమయమేతెంచును.

ఇండియాలోని మాతోటలలో ఉత్తమ తరగతి తేయాకు కోయుప్రమాణము "రెండాకుల ఒకచిగురు." ఇందుమూలమున చిగురువెంట మొదటి రెండాకులు మాత్రమే కోయబడును.

స్థలభేదమునుబట్టి ఆకుకోతలు సంవత్సరము పొడుగునగాని, కొలది మాసములు మాత్రమేగాని జరుగుచుండును. ఆకు గిల్లినవెనుక తిరిగి ఆకుతొడిగి కోతకు సిద్ధమగుటకు సుమారొకవారము పట్టును.

ఒకరకమగు బుట్టలు వీపులకట్టుకొని తేయాకుకోయువారు అధిక సంఖ్యలో కోతలకు ఉపక్రమింతురు. తయారైన తేయాకుయొక్క ఆధిక్యత, వారు కోతలో చూపు నేర్పుపైనను ప్రావీణ్యముపైనను ఆధారపడియుండును.

త్వరలోనే "రెండాకుల ఒకచిగురు"యొక్క స్వచ్ఛతను సౌరభమును మీరనుభవింపగలుగుదురు.

# బ్రూక్ బాండ్

# కవిరాజహంసలు

✻

= శ్రీ హనుమచ్ఛాస్త్రి =

రాగద్వేషాలు
శీతోష్ణాలు
సుఖదుఃఖాలు
—ఇది ఒక తరగతి జంట.
సంగీత సాహిత్యాలు
రాగతాళాలు
వాగర్థాలు
—మరియొకరీతిద్వంద్వం.

తెలుగు జంటకవులలో మొదటికక్ష్యవా రెక్కువమంది. రెండవశ్రేణివారు అరుదు.

శ్రీ కవిరాజహంస వేంకటపార్వతీశ్వర కవిద్వితయము రెండవకోటికి చెందినది.

"స్వర మాతనిది విభాసురమైన లయ నాది
సురుచిరామోద విస్ఫురణ మాది,
భావ మాతనిది జీవంబైన ధ్వని నాది
నవనవానందవైభవము మాది"

వీరి కలయికలోని పరమార్థం ఇది.

ఈజంట తమ కవితాప్రాగల్భ్యంతో దేశదేశాల వీరవిహారం చెయ్యలేదు. బహు రాజాస్థానాలకు వెళ్లి దండలు చరచి పండితులను కుస్తీలకు పిలవలేదు. తమ ఆశుకవితాప్రాచుర్యంతో ప్రజానీకాన్ని 'బేజారు' చెయ్యలేదు.

ఇక —

ఏవిద్వత్ప్రభువూ వీరికి 'జాంబూనదాంబరంబు'లు పెట్టి 'దుఃశాలువలు' కప్పి, మహాకావ్యాలు వ్రాసి తనకు అంకితం చెయ్యమని కోరినట్టు లేదు. మడిమాన్యా లిచ్చి ఆస్థానకవులుగా ఆదరించినట్టూ లేదు.

కాబట్టి —

వీరు ఏ పురాణపరంపరనూ తెనిగించలేదు. ఏ తెలుగుప్రబంధసందోహాన్నీ నిర్మించలేదు.

ఫలితంగా —

వీరు ప్రజలకూ, వీరికి ప్రజలూ మిగిలారు. ఒకరికి ఒకరు చేరువగా చేరి పరమాప్తులైనారు.

ఈ సన్నివేశంలో — నవ్యసాహిత్య కల్యాణమందిరానికి ఒక పునాదిరాయి వేసే అదృష్టం ఈ కవియుగళానికి దక్కింది.

తమ తరంలో ఎగసివచ్చే ప్రచలనాన్ని శ్రద్ధగా చూచి ఈ కవియుగ్మం జాగ్రత్తగా అన్నిటినీ ఉపయోగించుకుంది.

అటు వంగీయసారస్వత జంఝూనిలం, ఇటు ఆంగిలేయ కావ్యతాలోత్తాల తరంగ

మాలికలూ ఈకవులకు అగ్గలమైన ఉత్సాహమునూ, ఊహనూ ఇచ్చి ప్రోత్సహించి అపార రచనావిశేషాలకు పురిగొల్పాయి.

ఆంధ్రప్రచారిణి ఉద్భవించింది.

ఏమూల చూచినా దేశం 'ప్రమదావనాల'తో 'వసుమతీవసంతాల'తో కలకలలాడింది. వెంకటపార్వతీశ్వరుల నవలలు లేని సీమ నాల్గువైపులకూ విసరి అద్భుతమైన వచనవాఙ్మయప్రచారం చేశారు. ప్రజాభిరుచి నింతగా సంతృప్తిపరచిన వెంకటపార్వతీశ్వరులను తెనుగునాడు ఏనాడూ మరవలేదు.

ఎవరైనా ఈకవియుగళనామధేయం ఉచ్చరిస్తే మొట్టమొదట ఎట్టఎదుట నిలిచేది వీరి అతివేల 'నవలా' సాహిత్యమే.



కవిరాజహంసలకు సన్మానము

శ్రీ కొంతి వెంకటరామమూర్తి పంతులుగారి అధ్యక్షతక్రింద రాజమహేంద్రవరమున శ్రీ వేంకటపార్వతీశ్వరకవులకు జరిగిన సన్మానసభ దృశ్యము. కూర్చొన్నవారిలో మొదటివారు బాలాంత్రపు వెంకటరావుగారు; నాలుగవవారు వోలేటి పార్వతీశంగారు. అధ్యక్షులు మధ్య కూర్చొనియున్నారు.

పల్లెటూరుగాని, పడుచుపెయ్యగాని చూడడం 'అపురూప'మయింది ఆనాడు. అంతవరకూ ఉన్న పద్యవాఙ్మయముగుట్టలను మెట్టలేని ప్రజాసామాన్యం వీరి సరికొత్తరుచుల నవలలను తనివితీర చదివింది. ప్రజాదరాన్ని ఊతగా తీసుకుని వందలకొలది నవలలు — చాలభాగం అనువాదమే అగుగాక — తెలుగు

౧౯౨౯-వ సంవత్సరం.

ఒక విచిత్ర సందర్భంలో మా అధ్యాపకుల సలహామీద ఏకాంతసేవ — పీఠికా చూచాను.

అంతవరకూ ఒక మునిపల్లెలో గురుకులక్లిష్టంగా చదివిన సంస్కృతకావ్యాలలో

నుంచి, అప్పుడు కళాశాలాధ్యాపకులు గరపే ఆంధ్రకావ్య పరిధులలోనుంచీ పయనించు కొంటూ వచ్చే నాయెదుట హఠాత్తుగా ఒక కొత్త ప్రపంచం!

నా చూడనివైపుతలుపు ఆకస్మికంగా ఆనాడు విడిపోయింది.

ఎన్ని తలపులు —

ఎన్ని పిలుపులు —

మేలుకొలుపులు !

నేను చదివిన శాకుంతలంకంటె, కళా పూర్ణోదయంకంటె ఈరచనలు ఏమీ గొప్పవి గావు. నిజం.

అయితే —

ఎందు కీ ఆకర్షణ? ఎందు కీ ఆతురత ?

అదే నవ్యసాహిత్యనిర్మాణపు మూల సూత్రం.

నీ కష్టసుఖాలు విని, నీ బాధలూ, ఆనందం పంచుకొని, అభిరుచులను సాను భూతితో చూచి సన్నిహితంగా వచ్చే వాడు నీకు పరమాప్తుడు. వా డెంత సామాన్యుడైనా సరే.

సరిగ్గా — అట్లాగే — అన్నివిధాలా ప్రజానమూహంపట్ల ప్రవర్తించి దగ్గరగా వెళ్లే రచయిత నవకవి ఐనాడు. అత డెంత సాధారణశక్తివంతుడైనా కానీ.

నాతరంలో నాహృదయానికి దగ్గరగా పుట్టిన పుస్తకాలు నాస్నేహితులు. వెనకటి తరంలోని ఉద్గ్రంథాలు నాఆచార్యులు. తొలివానియందు గుండెకు ఒత్తుకొనే అను రాగం. మలివానియందు ఔదల వంచే భక్తి —ఇదీ భేదం.

కాగా—

శ్రీవెంకటపార్వతీశ్వరకవులు ఈతరానికి ఆ ప్రమిశ్రకోటిలోనివారు. నవ్యసాహిత్య మహోద్యమానికి తలవనితలంపుగా శంఖం ఒత్తి జెండాఎత్తినవారు.

అసలు నవ్యసాహిత్యాన్ని రెండు శాఖలుగా విడదీయవలసి ఉంది. ఒకటి గురు జాడ అప్పారావుగారి అతివాదసాహిత్య విప్లవశాఖ. ఇప్పుడు భాషకు, సాహిత్యానికి ఉన్న నిబంధనలు తెంచి స్వాతంత్ర్యం అవలంబిస్తేగాని ఆంధ్రసాహిత్యానికి దీప్తీ, అభ్యుదయమూ రావని ఆయనవాదం. తరు వాతివారైన శ్రీ రాయప్రోలు, విశ్వనాథ, అబ్బూరి, సాహితీసమితివారూ పూర్తిగా ఆయనవాదాన్ని అనువదించి అనుసరించక పోయినా ఆయనఆదర్శములు చాలవరకు కలిసివచ్చేటట్టుగా భావతీవ్రతలో — పద్ధతిలో అప్పారావుగారి శ్రేణిలో నడచి ముందుకు వెళ్లారు. మరికొందరు మరీదగ్గరగా ఆయన్ను అనుసరించినవారున్నారు.తరువాత క్రమంగా నవ్యసాహిత్యోద్యమాదర్శాలనే పూర్తిగా మరచి ప్రగతి, అభ్యుదయం అన్నది శూన్యమై నేటి నవ్యసాహిత్యపరిషత్తు నిర్జీ వంగా గుంటపువ్వులు పూస్తోంది.

రెండవ శాఖ-మితవాదులైన శ్రీవెంకట పార్వతీశ్వరులది.

వీరి పద్యకావ్యములన్నీ నవ్యసాహిత్య యుగలక్షణమునకు ఎక్కువగా చెందిన ఖండకావ్యాలు. హృద్యములైన ఏకాంక రూపకాలుకూడ వీరు కొన్ని రచించారు. తమనాటి ఉద్యమాలు, ప్రచలనాలు అన్నీ వీరిని పలకరించి పద్యాలు వ్రాయించాయి.

దేశభక్తి, హరిజనోద్ధరణం, బ్రహ్మసమాజం మొదలైనవాటిపై వీరు వ్రాసిన పద్యాలు నవ్యకావ్యదృష్టికి సూటియైన నిదర్శనాలు. ఛందస్సులో, పదబంధంలో, భావనలో వీరు పోయిన పోకడలు తరువాతి నవ్యసాహిత్య పరులు ముఖ్యంగా గమనించదగ్గవైనాయి. గీతపద్యాది దేశివృత్తాలకు వీరు కూర్చిన పరువం తర్వాతివారు గుర్తించారు. ఇంతే కాక - వీరు ప్రతికవీ వర్ణించే వసంతకోకిల, ప్రభాతవాతంవంటివానినే తమ మధుర కంఠానికి పాత్రం చెయ్యలేదు. 'మక్షికం' మొదలు 'నక్కదోస' వరకూ వీరి కంటికి కావ్యసామగ్రి కాని వస్తువు లేదు. ఔను, ఆలంకారికశిరోమణులేమన్నారు:"యద్వాప్య వస్తు కవిభావకభావ్యమానం తన్నాస్తి యన్న రసభావ ముపైతి లోకే." అయితే—వీరు ఆంధ్రకవితను వికృతపరిచే కేవలశ్లేషలను, నారికేళపాకమును, దీర్ఘసమాసములను, యమకభూయిష్ఠతనూ తెగడి, తమ నవీన దృష్టిని ప్రదర్శించినప్పటికీ భాషా, ఛ్ఛందో, నిబంధనలమీద తెచ్చే తిరుగుబాటును సహించరు.

"ఎవరేమన్న సరే మరేవయసు రా
నీ యెల్లకాలంబు మా
కవితాసుందరి నూత్నయౌవనము నా
కాంక్షించునేగాని గా
రవవృత్తంబుల వేషభాషల పదా
ర్థజ్ఞానసంసిద్ధులన్
లవలోపంబు సహింపబోదు నవహే
లామోదలీలాత్మరై".

శ్రీ వెంకటపార్వతీశ్వరుల కావ్యగానం ఉషఃకాలంలో మామిడిచెట్టుగుబురులో కూర్చుని తీయగా పాడే కోయిలపాటలోని హాయివంటిది. దానిలో తీవ్రభావోద్వేగ కలకలంగాని, ప్రబోధకాహళధ్వనులుగాని వినిపించవు. కనుకనే వీరు యుగసంధిలో చల్లని మెలకువలు పాడి, నీలితెరల అడ్డమును లాగివేసి పక్కకి తప్పుకొన్నారు.

వైష్ణవగీతాలలోని భక్తిపారవశ్యం వీరి ఏకాంతసేవలో, సేవాంజలిలో గోచరించి యావదాంధ్రసీమనూ పులకరింపజేస్తుంది.

ప్రాచీనాంధ్రశతకాల భక్తిపచేళిమను మించి వీరి భక్తిగీతాలు విశ్వపతికి కర్పూర హారతులు పట్టినాయి.

వీరి కావ్యకుసుమావళి ఒక ఉదాత్తమైన ఖండకావ్యసంపుటి. శ్రీ కవిరాజహంసల కవితాశక్తికి సమగ్రాదర్శం.

తెలుగుతల్లి, బంగరుపూలు, వెన్నెలపాట, చందమామ, శరత్కుమారి వంటి కావ్యాలు ఎన్నిసార్లైనా చదువదగ్గవి. ఈ కావ్యసంపుటి ఎల్లకాలమూ సాహిత్య ప్రియాళువులకు ఒక కమ్మని ఆమెతగా నిలుస్తుందని నా విశ్వాసం.

వీరు రామాయణ మహాకావ్యాన్ని అనువదిస్తున్నారని వినికిడి. వీరి కవితాకల కంఠం వాల్మీకిమహర్షి వాక్కు మీదుగా మరీమధురంగా వినిపించగలదని ఆంధ్ర రసికులు ఆశిస్తున్నారు.

ఈ ఉత్తమభాషా సేవకులకు, కవిరాజహంసలకు డిశంబరు ౧౨, ౧౩ తేదీలలో రాజమహేంద్రవరంలో అఖండసన్మానమిచ్చి రాజమండ్రిపౌరులూ, ఆంధ్ర ప్రచారిణీవారూ కృతకృత్యులైనారు.

# అయిదు కవిత్వాలు

= శ్రీ జమ్ములమడక మాధవరామశర్మ =

కేవల కవిత్వము, వర్ణనామయ కవిత్వము, శాస్త్ర కవిత్వము, తత్త్వకవిత్వము, సాహిత్యక కవిత్వము- ఇట్లా కవిత్వములు అయిదు విధాలుగా ఉండడమును మనము సూక్ష్మదృష్టితో గమనించవచ్చు. వీని ఉద్దేశములు, ఫలములు భిన్నభిన్నముగా ఉంటవి. అధికారులు కూడా భిన్నభిన్నంగా ఉంటారు. వీనిపై లోకాదరమూ వేరువేరుగా ఉంటుంది. ఈ నిరూపించిన విధాన ఆయాకవిత్వాలకు ఆయాధర్మాలను సమన్వయించుకొనడము సముచితము.

౧. కథా ప్రచురము
౨. యథాతథముగా ప్రకృతివర్ణన
౩. ధర్మాధర్మవివేకము
౪. దర్శనతత్త్వసమన్వయము
౫. రసమయతాసంపాదనము

ఈ చెప్పిన అయిదున్నూ పైని నిర్దేశించిన అయిదు కవిత్వాలకు సామాన్యస్వరూపములు. ఈ కవిత్వముల ప్రసారములో దృష్టి ఏకవిధముగా ఉండదు. అట్లా ఉండడముకూడా అవసరము కాదు.

౧. అన్నవస్త్రదృష్టి
౨. ప్రాణశక్తుల విలాసము
౩. మనఃప్రజ్ఞల ప్రాభవము
౪. విజ్ఞాన విజృంభణము
౫. ఆనందవిహారము

వరుసవరుసగా ఈ అయిదువిధములయిన దృక్పథములను బట్టి ఆయాకవిత్వములు స్వరూపలాభమును పొందుతూఉంటవి. ఈ కవిత్వములలో నిరూప్యమాణములంనుకూడా తేడా ఉంటుంది.

౧. వాచ్యవస్తువు
౨. వాచ్యాలంకారము
౩. వ్యంగ్యవస్తువు
౪. వ్యంగ్యాలంకారము
౫. రసభావవ్యంగ్యము

ఇటువంటి కవిత్వములను నిర్దేశించే కవులు ఆకాంక్షించే ప్రయోజనములున్నూ ఏకవిధముగా ఉండవలసిన అవసరము లేదు.

౧. యశస్సు, ద్రవ్యము (అర్థము)
౨. వ్యవహార (లోకవృత్త) విజ్ఞానము
౩. అమంగళ (శివేతర) క్షతి
౪. సద్యఃపరనిర్వృతి
౫. కాంతాసమ్మితమైన ఉపదేశము

ఈ చెప్పిన అయిదుకవిత్వముల సామాన్యస్వరూపము ఈవిధముగా ఉంటుంది. ఇక వీని విస్తరణమును చిత్తగించండి.

## ౧. కేవలకవిత్వము

సామాన్యరూపముయిన కవిత్వము అనాగరకుల చిహ్నం. నాగరకత సరిగా వికసించకపోతే జనులు కవితావినోదమును కాంక్షించుతారు. ఇటువంటివారు పామరు లన్నమాట. వీరికి కథాదృష్టి అధికంగా ఉంటుంది. అంతమాత్రమునే వీరు అభిలషిస్తారు. ఇట్లా అభిలాషపడేవారు పామరులు. ఇటువంటి కవిత్వానికి వీరే అధికారులు. రాజకీయంగా బాధితులయినవారూ, దైశికంగా వ్యథపడేవారూ, జీవితములో క్లేశమును అనుభవించేవారూ, అనుదాత్త ప్రజ్ఞలయినవారూ కథాకవి

తారసికు లవుతారు. ఇటువంటి కవిత్వంవలన వారికి తాత్కాలికంగా చిత్తసంతోషము కలుగుతుంది. వారికి అక్కడ అంతమాత్రం చాలు. అసలు కేవలకవిత్వము చమత్కారసృష్టిని మాత్రమే సంపాదించుతుంది. ఈచమత్కారమును సంపాదించే కవితవలన పాఠకునకు ఒకరకంగా చిత్తవృత్తులలో స్పందము, అంటే చలనము, లేక కదలిక కలుగుతుంది. ఈకదలికకే చమత్కార మని పేరు పెట్టినా పెట్టవచ్చు. ఈస్పందం కలుగగానే పాఠకుడు స్వాభావికమయిన అవస్థనుండి అస్వాభావికమయిన అవస్థను పొందుతాడు. అప్పుడాతనికి ఒక అద్భుతావేశం కలుగుతుంది. దానిని ఆతడు సరిగా జీర్ణంచేసుకోలేడు. ఏమీ తెలుసుకోలేక "ఇది బాగున్నది" అంటాడు. చిత్తవృత్తుల సూక్ష్మగతిని గ్రహించినవాడయితే ఈవిధంగా అవిష్టుడూ కాడు. చిత్తవృత్తుల సూక్ష్మగతి తెలియక బాధపడేవారి అవస్థ ఇట్లా విస్మయావిష్ట మవుతుంది. వారు ఇంద్రియావశత్వము పొందుతారు. ఇదీ కేవలకవిత్వము. దీనిలో అన్నవస్త్రాభిలాషులకు ఆనుషంగికంగా అవి లభించవచ్చు. రాజకీయంగా, దైశికంగా కలిగిన బాధలు దీనిలో నిరూపింపబడే వాచ్యవస్తువును భావించినందువలన తొలగిపోతవి. ఇక్కడ వర్ణింపబడేది విస్పష్టంగా ఉంటుంది. గూఢార్థాలు, కల్పితార్థాలు ఈ కవిత్వంలో ఉండవు. దీని ఫలము యశమూ, అర్థమూను.

## ౨. వర్ణనామయకవిత్వము

దీనిలో వర్ణనాదృష్టి అధికంగా ఉంటుంది. కథ ఉండకపోదుకాని దానియందు ఆదరం తక్కువ. అంతకన్న ప్రతివస్తువునూ వర్ణించడము కవికి చాలా అభీష్టము. ఇటువంటిదానిని ఒకవిధమయిన సభ్యత కలవారయిన మధ్యములు ఆదరించుతారు. కవి ఈ కవిత్వంలో ఏదో వర్ణన చేస్తూఉంటే పాఠకులయిన మధ్యములు తమ భావనకు ఒక నైశిత్యం సంపాదించుకొని వర్ణనలను భావించి భావించి భావనాసంతోషం పొందుతారు. కవి చేసే వర్ణనలో జగత్పదార్థములు విషయము లవుతూఉంటవికదా! ఈ జగత్పదార్థములు చాలా చిత్రవిచిత్రంగా ఉండకతప్పవు. వీటిని భావించేటప్పుడు భావాలకు ఒకరకంగా పరిపుష్టి కలుగుతుంది. అప్పుడు స్పందించే చిత్తవృత్తులకు ఒకరూపం ఏర్పడుతుంది. ఆ ఏర్పడిన రూపమును అంతర్వ్యాప్తి అవగాహనం చేసికొంటుంది. ఇక్కడ కథ ముఖ్యము కాదు. అది కేవలము ఆధారముగామాత్రము స్వీకృతమవుతుంది. వర్ణన ఎప్పుడయితే ముఖ్యమయిందో అప్పుడు వర్ణ్యమానవస్తువుకూడా చిత్రమవుతుంది. ఆచిత్రవస్తువును వర్ణించే కవి వాచ్యాలంకారములను ఘటించుతాడు. చిత్రవిచిత్రములయిన జగద్వస్తువుల వర్ణన ఇక్కడ ఉంటున్నదికాబట్టి నానావిధమయిన లోకవృత్తము తెలుస్తుంది. ఇదే ఈరకమయిన కవిత్వము వలన కలిగే వ్యవహార విజ్ఞానరూపమయిన ఫలము.

ఇటువంటి వర్ణనాకవిత్వంలో కవి ఒకప్పుడు స్థిరభావన కలవా డవుతాడు. వేరొకప్పుడు అస్థిరభావన కలవా డవుతాడు. స్థిరభావనలో కవితావిషయములు వేరు; అస్థిరభావనలో కవితావిషయములు వేరు. మేఘము, పువ్వు, నది, కొండ, గవ్వ, తీగ, రాయి, నలుసు-అన్నీ కవితావిషయములే అవుతవి. ఇందువలననే అష్టాదశవర్ణనలూ అవకాశము పొందుతున్నవి. వర్ణనలో కుదింపబడేటప్పటికి ఏవస్తువయినా కవితారూపము పొందుతుంది.

## 3. శాస్త్రకవిత్వము

ఉత్తమనాగరకత కలవారికి శాస్త్రాభిమానము అధికముగా ఉంటుంది. శాస్త్రకవితను ఉత్తములు ఆదరించుతారు. దీనిలో చిత్తవిస్ఫారము కలుగుతుంది. మస్తిష్కము విజృంభించుకుంది. విజ్ఞానము అతిశయించుతుంది. కవిత్వము కేవలము ఆనందమిచ్చేదే కాక విజ్ఞానమిచ్చేదికూడాను అని దీని ఆధారమున నిరూపించవచ్చు. కవిత్వమునకు, విజ్ఞానమునకు సంబంధం ఉంటుందా అని కొందరి సందేహము. కవితవలన కలుగవలసింది ఎప్పుడూ ఆనందమే కాదు. మనోవికాసం కూడా కలగాలి. శాస్త్రకవిత్వము మనోవికాసమును సంపాదిస్తుంది. కవికూడా అనేకవిధాల సంకల్పవికల్పాల ప్రాభవచక్రములో పడి ఏమేమో భూతాభూత విషయాలను నిబంధించుతాడు. ఇక్కడకూడా కథ ఉండకపోదు కాని కథలలో శాస్త్రీయసమన్వయము వస్తుంది. ప్రతి

పాదింపదలచిన అర్థము రూపాంతరములో వస్తుంది. కాబట్టి వ్యంగ్యమయిన వస్తువు ఇక్కడ అవకాశమును పొందుతుంది. ఏతత్కవితాఫలంగా శివేతరక్షతి కలుగుతుంది. దైవికబాధలు నివృత్తము లయిపోతవి. శబ్దమర్యాద శాస్త్రకవిత్వములో అధికమవుతుంది. శాస్త్రయుగకవిత్వము ఎప్పుడూ ఇట్లాగే ఉంటుంది. అసలు శాస్త్రము వాదయుగములో వికాసము పొందింది. వాదాలు నేర్చిన కవులు ఈ పని చేశారు. అప్పటి నుంచీ కవిత్వమునకు శాస్త్రాలతో ఘనిష్ఠసంబంధము ఏర్పడింది. కవితలో శాస్త్రాల పట్టుదల కలవాళ్లు నేటికీ ఇంకా చెలామణి అవుతున్నారు.

## ౪. తత్వకవిత్వము

దీనిలో సాంఖ్యయోగాది దర్శనార్థములు నిరూపితములవుతవి. ఆయా దర్శనాలపై అభిమానం కలిగిన వారు కవులయితే తత్వకవిత్వము వెలువడుతుంది. అత్యుత్తమసభ్యత కల మానవజాతి దర్శనవిచారణాసక్తమవుతుంది. కాగా ఉత్తమోత్తములు తత్వకవితాసమాదరము కలవారవుతారు. దీనిలో తత్వసంపద ఉంటుంది. దీని అనుసరణమువలన జీవవికాసము కలుగుతుంది. ఆత్మశక్తులు చక్కగా ఇక్కడ స్వరూపప్రకాశము కలవి అవుతవి. దీనిని అనుసరించే భావుకుడు ఆనందసాధన యత్నములను స్వీకరించుతాడు. కాగా ఇటువంటి కవిత్వములోని కథలలో తత్వసమన్వయము ఉంటుంది. శాస్త్రీయాంశములు విజ్ఞానరూపముగా తనకు అవగాఢమగుటయేకాక అవి అనుభవపథములో జ్ఞానరూపములై విజృంభణము పొందుతవి. వ్యంగ్యములయిన అలంకారములు స్వరూపలాభము కలిగి దీనిలో ఉంటవి. చిత్రమయిన వ్యంగ్యార్థమును వ్యంజనముచేయడానికి లలితలలితములయిన శబ్దముల సంయోజనము ఆవశ్యకమనే అభిప్రాయము ఏతత్కవికి కలుగుతుంది. అందువలన శబ్దాల లాలిత్యానికై ప్రయత్నించుతాడు. ఈ తత్వకవిత్వము ఆధ్యాత్మికములయిన బాధలను నివర్తింపచేస్తుంది. కాబట్టి ఇది సద్యఃపరనిర్వృతిసంపాదకము కావచ్చు. ఇటువంటి కవిత్వము ఎక్కువగా రాదు. రావడము మట్టుకు చాలా అవసరము. లోకము అంతరంగికంగా బాగుపడాలంటే ఇటువంటి కవిత అవసరము. నేటి కాలములో మరీని.

## ౫. సాహిత్యిక కవిత్వము

కవిత్వములో సాహిత్యికమయిన సంపద కలిగితేనే కవిత్వము కవిత్వ మవుతుంది. కవిత్వములో కవి సాహిత్యికదృష్టిని ప్రసరింపచేయాలన్నమాట. ఈ సాహిత్యిక సంపద కల కవిత్వమును ఆస్వాదించడానికి అనుత్తములు అర్హులవుతారు. దీనిలో పామరులు, మధ్యములు, ఉత్తములు, ఉత్తమోత్తములు అనేవారి అందరి సమన్వయమూ ఉంటుంది. ప్రపంచపదార్థము లన్నిటిలోనూ ఉండే అంతఃస్పందమును దీని కవి అవగాహనం చేసికొంటాడు. బహిఃస్పందముతో తన హృదయమును స్పందింపచేసికొంటూ కవి యీసాహిత్యమును అవగతం చేస్తాడు. దీనిలో సహృదయులు హృదయసంవాదము పొందుతారు. స్వాత్మసమావేశమును సంపాదించుతారు. సహజానుభూతిని ఆవిష్కరింపజేసికొంటారు. దీని కవి తన అనుభూతిని ఇతరములలో దర్శించుకొంటూ ఇతరములను తన అనుభూతిలో సాక్షాత్కరించుకొని సమన్వయించుకొంటూ ఆనందవిహారము చేస్తాడు.

ఈసాహిత్యిక కవిత్వములో శబ్దోపాసన ఇమిడి ఉంది. ఇతరములలో శబ్దము సాధనమే అయింది కాని ఉపాస్యము కాలేదు. దేవీస్వభావకమయిన శబ్దము ఇక్కడ ఉపాస్యస్వరూప మయింది. ఈవిధముగా నిరూపితమయిన కవిత్వమే కాంతాసమ్మిత మవుతున్నది. ఇట్లా ఇది కాంతాసమ్మితము కావడమువలన స్త్రీజాతికి సహజంగా ఉన్న గౌరవమూ, ఉచ్చైస్స్థానమూ సురక్షితమయింది. అప్పుడు కావ్యము కామిని అయింది. ఈదృశమయిన దీనిలో రసవ్యంగ్యమే ప్రాణము. ఇట్టి నిబంధనానికి ప్రతిభ ఉండాలి. అన్నిటికీ భావనారూపత సంపాదించే సంవేదనమూ ఉండాలి. ఇటువంటి ఈసాహిత్యికకవిత్వము ఉపదేశమునకు ఉపయోగించుతుంది. అప్పుడే కవిత్వము మంత్రమవుతుంది. అది మంత్రమయితేనే ముక్తి. ఈవిషయమును శ్రీమమ్మటపాదులవారు కావ్యప్రకాశలో ఇట్లా సూచిస్తున్నారు:

౧. కావ్యం యశసేఽర్థకృతే
౨. వ్యవహారవిదే
3. శివేతరక్షతయే
౪. సద్యః పరనిర్వృతయే
౫. కాంతాసమ్మిత తయోపదేశయుజే.

సాహిత్యక దృష్టితో కవిత్వమును సమీక్షించి భారతీయకవులు తమ కావ్యములను నిబంధించారు. అవే లోకోపకారకములు, లోకోపదేశకములు కాగలుగుతూ ఉన్నవి. నేటికాలంలో సాహిత్యకదృష్టి చాలామంది కవులకు ఉన్నది. అనేకులు ఆ దృష్టితో కవితాప్రకాశము చేయడము చాలా అవసరము. అట్లా చేసినప్పుడే ఆ కవుల అవసరముకూడా తీరుతుంది.

---

## శాస్త్రచర్చ



# డబ్బుయంత్రం - కరెన్సీవిధానం

= శ్రీ బి. యల్. యన్. శాస్త్రి =

"డబ్బు ఉంటే కొండమీది కోతినికూడా క్రిందికి రప్పించవచ్చు" అన్న పిచ్చిఅభిప్రాయం అనాది నుంచి ఉండటంచేత ప్రజలూ, ప్రభుత్వాలూ దానికి అనవసరమైన ప్రాముఖ్యం ఇస్తున్నారు. ఇది పెట్టుబడీదారీవిధానానికి ముఖ్యసూత్రం. కాని శారీరక సౌఖ్యాలు కేవలం డబ్బుతో చేకూరవు. అవి పొందటానికి మధ్యవర్తిగా వర్తించటానికి ఉపయోగించే కొలబద్ద అది. దీని మూలకంగా సంపదవిలువ తైపారు వెయ్యవచ్చు. సృష్టించిన వ్యక్తికి నిజసంపద అనవసరమైనప్పుడు, దానిని డబ్బులోకి మార్చి భవిష్యత్తు నిమిత్తం దాచుకోవచ్చు. నేటి ఆర్థికజీవనంలో డబ్బు సంపదరూపాంతరముగా వ్యవహరింపబడుతున్నది. పదార్థాల విలువ, ఉద్యోగస్థుల జీతాలు, అప్పులు, పన్నులు మొదలైన ఆర్థికవ్యవహారా లన్నీ డబ్బులోనే లెఖ్ఖలువెయ్యబడుతున్నవి. అన్నిదేశాలలోనూ ఏదోవిధమైన డబ్బు ఉండటంచేత అంతర్జాతీయవాణిజ్యంలో, వివిధదేశాల డబ్బువిలువప్రకారం వాణిజ్యపు లెఖ్ఖలు వేసుకొంటారు. అందుచేత ఏదేశపుడబ్బుకైనా రెండు రకముల విలువ ఉంటుంది. ఒకటి - దేశంలో పదార్థాలూ, సౌకర్యాలూ కొనే విలువ; రెండు - ఇతర దేశాల డబ్బును కొనే విలువ. ఈ రెండవదానిని ప్రభుత్వాలు నిర్ణయించుకొంటాయి. ఈ మారకపువిలువను స్వదేశక్షేమంకోసం పరదేశాల ఆర్థికపరిస్థితులనుబట్టి సమయానుకూలంగా ప్రభుత్వాలు మారుస్తూ ఉంటవి. జాతీయఅంతర్జాతీయవాణిజ్యధోరణి గమనించి దేశంలోని మొత్తపుడబ్బును మారుస్తూ ఉండాలి. నేటి ఆర్థికజీవనానికి డబ్బుయంత్రం మూలముకుళం అవటంచేత పక్షపాతం గల పార్టీప్రభుత్వాలు స్వకీయలాభం కొఱకు ఈయంత్రాన్ని దుర్వినియోగం చెయ్యకుండా ఉండేటందుకు గతశతాబ్దంలో అన్నిదేశాలూ తమ కరెన్సీని జాతీయబ్యాంకుల హస్తగతం చేసినవి. ఈ బ్యాంకులు ప్రజాపాలనలో ఉంటవి. కాని, అంతర్జాతీయడబ్బువిషయాల్లో-మారకపువిలువ మార్పులలో- ప్రభుత్వాలే పూర్తిఅధికారం చెలాయిస్తున్నాయి. మన దేశంలోకూడా ఇటువంటి జాతీయకేంద్రబ్యాంకు, ౧౯౩౪ రిజర్వుబ్యాంకుచట్టం అమలుపరచి, స్థాపించేరు. నామకః అన్నిదేశాల జాతీయబ్యాంకులూ ప్రజాపాలనలో ఉన్నప్పటికీ, అవసరసమయాల్లో, క్లిష్టపరిస్థితులలో ప్రభుత్వాలే పూర్తి అధికారం చెలాయిస్తున్నవి. డబ్బుయంత్రం నడపటంలో మన దేశానికీ, తదితరదేశాలకూ చాలా వ్యత్యాసం ఉంది. మన రిజర్వుబ్యాంకు వైస్రాయిచిత్తానుసారం కార్యక్రమం సాగిస్తుంది. మన ప్రతినిధులైన కేంద్రశాసనసభాసభ్యులకు మన డబ్బుమారకపువిలువలో మార్పులు కలిగించటానికి అధికారం లేదు. మన రూపాయకూ, ఇంగ్లాండు స్టెర్లింగుకూ అంతర్జాతీయవాణిజ్యంలో బ్రహ్మముడి వేసేరు. అది తెంచివేయటానికి ఆమెరీ మహాశయుని బృందానికితప్ప మనకు హక్కులేదు. అందుచేత,

మన డబ్బుయంత్రజీవసూత్రం బ్రిటిషుప్రభుత్వపు హస్తాలలో చిక్కపట్టిఉంచే రన్నమాట.

### కరెన్సీ చరిత్ర:

హిందూదేశపు డబ్బుయొక్క జీవితసంగ్రహం చూస్తే, డబ్బుయంత్రాన్ని దేశక్షేమానికి అనుకూలంగా ప్రభుత్వం నడపటం లేదని స్పష్టమవుతుంది. ౧౮౩౫-వ సంవత్సరంవరకు మన దేశంలో బంగారు మొహరులు, బంగారు 'పెగోడాలు', వెండి రూపాయలూ నాణాలుగా చలామణిఅవుతూ ఉండేవి. తూర్పు ఇండియావర్తకసంఘం ౧౮౩౫ లో రమారమి తులం వెండి గల రూపాయలు జారీచేసి, దేశం అంతటా శాసనరీత్యా ముఖ్యనాణెంగా స్థాపించింది. టంకశాలలకు వెండి ఇచ్చి రూపాయినాణాలు ముద్రించుకునే హక్కు ప్రజలకు ఉండేది. ౧౮౯౩ లో 'హెర్షలు కమిటీ' టంకశాలలను మూసివేయించింది. అప్పటి నుంచి ఎనిమిదిఅణాల వెండి గల రూపాయలు ప్రభుత్వపు చట్టంవల్ల పదహారుఅణాల రూపాయలలోకి పరిణామం చెందేయి. ౧౮౯౮ లో 'ఫౌలరు కమిటీ' బంగారుకాసులు (Sovereigns) చెలామణిలో పెట్టమనీ, అమలులో ఉన్న బంగారు వెండిసహజమారకపు రేటు ౧ రు=౧ షిల్లింగు ౪ పెన్నీల బంగారంగా నిర్ణయించమనీ సలహా ఇచ్చేక ప్రభుత్వం కొద్దిరోజులు పంజాబు, బొంబాయిలలో బంగారునాణాలు ప్రవేశపెట్టి, అనాగరికులైన హైందవుల ఆర్థికజీవనానికి బంగారునాణాలు అనవసరమని తన ఉదారకృత్యాన్ని ఉపసంహరించుకొన్నది. మారకపు విలువమాత్రం కమిటీ సలహాప్రకారం స్థాపించింది. అంతర్జాతీయ వాణిజ్యం బంగారు మారకపువిధానంవల్ల (Gold Exchange Standard) సాగేది. ౧౯౧౩ లో 'చాంబర్లయిను కమిటీ' అనుకరిస్తూ ఉన్న బంగారుమారకపు విధానాన్ని స్థిరపరిచేటందుకుగాను ఒక జాతీయ కేంద్ర బ్యాంకు స్థాపించేటందుకు తదితర చిల్లరసలహాలు చేసింది. గతప్రపంచయుద్ధ రణరంగంలోని బాంబులు ఈసలహాలను ధ్వంసంచేసినయి. యుద్ధసమయంలో రూపాయిని బంగారంలోకి మార్చే హక్కు రద్దుపరచి స్టెర్లింగుతో జతపరిచి, నోట్ల అతివృష్టిచేసి యుద్ధం సాగించేరు. ౧౯౧౮-౧౯ వరకు మన కరెన్సీ చాలాక్లిష్టపరిస్థితులలో పడ్డది. వెండిధర అమితంగా పెరగటంవల్ల రూపాయి స్టెర్లింగురేటును ప్రభుత్వం విసర్జించటం మూలాన రూపాయిమారకపు విలువ ౨ షిల్లింగులవరకు ప్రాకిపోయింది. ౧౯౧౯ లో 'బేబింగుటన్ స్మిత్తుకమిటీ' ౨ షిల్లింగుల మారకపు రేటు ప్రసాదించటంవల్ల ఆరుమాసాలలో ౫౦ కోట్లకు పైగా బంగారం మనం నష్టపోయేము. అప్పటికి ప్రభుత్వానికి చైతన్యం వచ్చింది! మళ్లా మారకపు విలువతో జోక్యం వదలుకొంది. ౧౯౨౫ వరకు రూపాయి స్టెర్లింగుమారకపువిలువ సహజమార్గాలలో నడవటంవల్ల రూపాయి = ౧౫ లేక ౧౬ పెన్నీలు ఉండేది. కాని ౧౯౨౫ లో 'పొల్టన్ యంగుకమిషను' ౧ షిల్లింగు ౬ పెన్నీలకు మార్చమని సలహా ఇవ్వటంవల్ల, ప్రజల ఆందోళనకు వ్యతిరేకంగా, ప్రభుత్వం ఆ రేటును స్థాపించింది. ౧౯౩౧ లో బంగారానికి శనిమహాదశ ప్రారంభించింది. ఈ 'దశ' ఇంక ఎల్లకాలం ఉండవలసిందే. ఆనాడు ఇంగ్లాండు (సెప్టెంబరు ౨౧-వ తారీకు) బంగారాన్ని తన కరెన్సీలోనుంచి తీసివేసింది. తదుపరి అన్నిదేశాలూ ఈ పంథా అనుకరించేయి. రూపాయిబంగారురేటుకూడా అంతటితో అంతరించింది. అప్పటినుంచిఇప్పటివరకు రూపాయికి ఇంగ్లాండు కాగితపు స్టెర్లింగు ౧ షిల్లింగు ౬ పెన్నీలరేటు స్థాపింపబడ్డది. అంతర్జాతీయవాణిజ్యంలో తొలినుంచి మన రూపాయి ఇంగ్లాండు స్టెర్లింగుపై ఆధారపడిఉండటంచేత మనము ఆర్థికంగా అధికమైన నష్టానికి గురిఅయినాము. రాజకీయంగా అంతర్జాతీయ సమస్యలలో మన వ్యక్తిత్వం కోలుపోయేము. ౧౯౩౧ లో అధిక రేటులో రూపాయిని స్టెర్లింగుతో లంకెవెయ్యటంచేత, బంగారం ఎగుమతి నిషేధించకపోవటంవల్ల ౧౯౪౦ వరకు రమారమి ౩౫౦ కోట్ల రూపాయల విలువ గల బంగారం మన దేశంనుంచి వెళ్లిపోయింది.

### ఉత్కృష్ట కరెన్సీవిధానం:

ఉత్కృష్టకరెన్సీవిధానానికి అవసరమైన అంగాలు మూడు: ౧. ప్రజాబాహుళ్యానికి దేశపు డబ్బులో పూర్తిఅయిన నమ్మకం; ౨. అవసరమై

నప్పుడు దేశపు మొత్తపుడబ్బును మార్చే శక్తి; 3. దేశపు డబ్బుయొక్క మారకపు విలువను ప్రజాక్షేమ నిమిత్తం మారుస్తూ ఉండటం. మన దేశంలో ఈవిషయాలు ఎంతవరకు పాటింపబడుతున్నవో చూద్దాం.

ప్రజాసామాన్యానికి దేశంలో చలామణీ అవుతూ ఉన్న డబ్బుయందు విశ్వాసం ఉందా అంటే, పూర్తిగా లేదనే చెప్పాలి. "విశ్వాసం లేకుండాఉంటే ప్రభుత్వం జారీచేస్తూఉన్న రూపాయలూ, కాగితపు నోట్లూ ఎందుకు ఉపయోగిస్తున్నారు? అవి విసర్జించటానికి ప్రజలు ఆత్రుతపడటంలేదే! అందుచేత నమ్మకంవల్లే వ్యవహారాలన్నీ సాగుతున్నాయన్నమాట!" అని కొందరు వాదించవచ్చు. ఈ సందేహ నివృత్తికి ఒకవిషయం జ్ఞాపక ముంచుకోవాలి. మన రూపాయి అసలువిలువకూ, ప్రభుత్వం దానికి ఆరోపించిన విలువకూ చాలాభేదం ఉందని మనకందరికీ తెలిసిన విషయమే. ఈ యుద్ధారంభంవరకూ ఎనిమిది, లేక తొమ్మిది అణాల వెండి ఉండేది రూపాయిలో. ప్రస్తుతం అదీ లేదు. అయిదు అణాలు మాత్రమే. అంటే-ముఖ్యనాణెం, వెండిమీద అచ్చువేసిన నోటు అన్నమాట. ఏదేశంలోనైనా, ముఖ్యనాణెపు అసలు విలువా, ప్రభుత్వపు విలువా ఒకేమాదిరిగా ఉంటవి. మన దేశంలోమాత్రం ఆరెంటికీ చాలా తేడా ఉండటంమూలానూ, ఆర్థికశాస్త్రపరిజ్ఞానం ప్రజలందరికీ ఉండటం కష్టతరం అవటంచేతా ప్రజలు తమ నిలువ డబ్బును (Savings) బంగారంలోకి మార్చివేసుకొంటున్నారు. ప్రజలకు బంగారంమీద అధికమైన వ్యామోహం ఉండటానికి ఇది ప్రబలమైన కారణమని గుర్తించాలి. బ్యాంకులలోను, పరిశ్రమలలోను పెట్టుబడిగా వర్తించవలసిన డబ్బు ఆర్థికశాస్త్రరీత్యా నిరుపయోగమైన బంగారంలోకి మన మూలధనం మార్చుకోవటంవల్ల మన పరిశ్రమలూ, ఉత్పత్తీ చాలినంత పెట్టుబడి లేక, అభివృద్ధి చెందటంలేదు. ఇటువంటి పర్యవసానం కలగకుండావుండేటందుకు 'పాల్టన్ యంగుకమిషను' వెండి రూపాయలకు నిర్ణయరేటు ప్రకారం (౧ రూపాయి = ౮.౫ గ్రాముల బంగారం) ప్రజలకు బంగారం ఇచ్చేటందుకు పూనుకోవాలనీ, కొద్దిమొత్తాలకు బంగారుపత్రాలు (Gold Cash Certificates) జారీ చెయ్యమనీ సూచన చేసింది. కాని, ప్రభుత్వం ఈరెంటినీ అమలుపరచలేదు. దీని మూలకంగా ప్రజలకు రూపాయియందు ఇప్పటికీ నమ్మకం లేదు. ఎప్పుడైతే తమ రూపాయల విలువకు తగిన బంగారం అడిగిన తక్షణమే, అభ్యంతరం చెప్పకుండా ప్రభుత్వం ఇస్తుందని దృఢమైన విశ్వాసం కలుగుతుందో అప్పుడే ప్రజలు తమ మూలధనాన్ని ఉత్పత్తికి నిరుపయోగమైన బంగారునగలలోకి మార్చకుండా, విరివిగా పరిశ్రమల అభివృద్ధికి తాము నిలువ చేసుకొన్న డబ్బును ఇవ్వగలరు. అప్పటివరకూ ప్రస్తుతపు అలవాటు-బంగారంనగలు భోషాణపు పెట్టెలలో పాత్రలువేసుకోటం - సాగుతూనే ఉంటుంది. పాఠకులు ఈవిషయంలో తప్పు అభిప్రాయపడకూడదు. బంగారునాణాలు చలామణిలో పెట్టాలని నేను వాదించటం లేదు. అసలు, బంగారానికి ఆర్థికవ్యవహారాలన్నిటిలో ప్రస్తుతం ఇస్తూఉన్న అనవసరమైన ప్రాముఖ్యం పోవాలనీ, ఈ యుద్ధంతో అది పూర్తిగా నశిస్తుందనీ నానమ్మకం. జాతీయవాణిజ్యంలో బంగారాన్ని నేడు ఏదేశమూ ఉపయోగించటం లేదు. అంతర్జాతీయవాణిజ్యంలోకూడా మోతాదుగా చలామణి అవుతున్నది. అందుచేత యుద్ధానంతరం బంగారాన్ని అంతర్జాతీయవాణిజ్యంలో కూడా ఉపయోగించకుండా, దానికి దేశాలు ఇస్తూ ఉన్న డబ్బువిలువను (Monetary Value) పూర్తిగా త్యజిస్తేనే చిరస్థాయిగా నిలువగలిగే శాంతి చేకూరగలదని నావాదన. ప్రజాబాహుళ్యానికి దేశపుడబ్బుయందు పూర్తి విశ్వాసం కలిగించేటందుకు తాత్కాలికంగా - స్వాతంత్ర్య జాతీయప్రభుత్వం వచ్చేవరకూ-ఈ పోకడ అవలంబించాలని నాసూచన.

### దేశంలోని మొత్తపుడబ్బు:

ఇంక రెండో విషయం - జాతీయ, అంతర్జాతీయవాణిజ్య ధోరణిప్రకారం దేశంలోని మొత్తపు డబ్బును మార్చే శక్తి. ముఖ్యంగా మన దేశంలో బ్యాంకులలో డబ్బువేసే అలవాటు అట్టే లేకపోవటం వల్లా, చెక్కులద్వారా (Cheque currency) మన

వ్యవహారాలు అరుదుగా జరుగుతూ ఉండటంచేతా మన నోట్లడబ్బును అవసరమైనప్పుడు హెచ్చుచేసే శక్తి జాతీయకేంద్ర బ్యాంకుకు ఉండాలి. వాణిజ్యం పెరుగుతూ ఉన్నప్పుడు దేశంలోని మొత్తపుడబ్బునుకూడా అధికం చెయ్యాలి. లేకపోతే ధరలు తగ్గిపోతవి. ధరలు తగ్గితే ఉత్పత్తికీ, పరిశ్రమలకూ తగిన ప్రోత్సాహం ఉండదు. మన దురదృష్టవశాత్తు మన కరెన్సీని హెచ్చుచేసే విధానం పూర్తిగాలేదు. ప్రజలు తమ పదార్థాలను ఎగుమతిచేసి సంపాదించిన స్టెర్లింగును రూపాయలలోకి మార్చుకుంటేనే తప్ప దేశపు డబ్బు హెచ్చు అవటానికి అవకాశాలు లేవు. అంటే, అంతర్జాతీయ వాణిజ్యం అభివృద్ధి చెందుతూఉంటే చెలామణీలో ఉన్న డబ్బు హెచ్చుఅవటానికి వీలుంది. కాని జాతీయవాణిజ్యం ఎంత అధికమైనా, దేశపు మొత్తపు డబ్బుమాత్రం మారదు. అసలు మన జాతీయవాణిజ్యం అంతర్జాతీయవాణిజ్యంకంటె పదిరెట్లు అధికంగా ఉంటుంది. అందుచేత దేశీయవాణిజ్యాభివృద్ధికి సులభంగా డబ్బుహెచ్చుచేసే మార్గాలు ఉండాలి. ఇంపీరియల్ బ్యాంకు చట్టప్రకారం (Imperial Bank of India Act 1920) అత్యవసరసమయంలో, ౧౨ కోట్ల రూపాయలవరకు జాతీయవాణిజ్యపత్రాలపైని (Internal Bills) డబ్బును అధికంచేసే అధికారం ఇంపీరియలుబ్యాంకుకు ఉండేది. కనీసం ఇటువంటి సదుపాయం అయినా ప్రస్తుతపు కేంద్రబ్యాంకు అయిన రిజర్వుబ్యాంకు కార్యక్రమంలో లేకుండా ఉంది. మొత్తంమీద అభివృద్ధిసమయాల్లో జాతీయ వాణిజ్యానికి అవసరమైనంత డబ్బు లేకుండాఉందని నిస్సందేహంగా చెప్పవచ్చు.

### మారకపురేటు :

మూడోవిషయం దేశపు డబ్బుమారకపువిలువను ప్రజల ఆర్థికజీవనక్షేమనిమిత్తం మారుస్తూఉండటం. తొలుతనే చెప్పినట్లు అన్ని దేశాలలోనూ తమ డబ్బు మారకపువిలువను మార్చే శక్తి ప్రభుత్వపుహస్తాలలో ఉన్నది. కాని మన శాసనసభకు ఈ అధికారం లేదు. ఆచంద్రార్కం ప్రస్తుతపు రూపాయిస్టెర్లింగురేటు ఉండాలని బ్రిటిషుప్రభుత్వపు ఆశయం. మన డబ్బు మారకపువిలువస్థాపనలో మూడులోపాలు ఉన్నవి: ౧. రూపాయిని స్టెర్లింగుతో లంకెవెయ్యటం; ౨. అది హెచ్చురేటులో నిర్ణయించటం; ౩. శాసనసభకు మార్చే శక్తి లేకుండా చెయ్యటం.

౧౯౩౧ వ-సంవత్సరంలో ఇంగ్లాండు బంగారాన్ని పూర్తిగా విసర్జించేక రూపాయికీ బంగారానికీ ఉన్న సంబంధం తీసివేసి, స్టెర్లింగుతో జతపరుపబడింది. ఏదేశంతో అయినా మారకపువిలువ చిరస్థాయిగా స్థాపించుకుంటే ఆదేశంయొక్క ఆర్థికకష్టనష్టాలు మనంకూడా అనుభవించాలి. ఇంగ్లాండులో ఏకారణంచేతనయినా ధరలు మారుతూఉంటే, మన ఉత్పత్తి పరిశ్రమలలో ఎట్టిమార్పులూ లేకపోయినా, మన దేశపు పదార్థాల ధరలుకూడా చలనం పొందుతూ ఉంటవి. ఇంగ్లాండు, అమెరికా, ఫ్రాన్సులతో మారకపురేటులు నిర్ణయించుకోవటంవల్ల ఈ మూడుదేశాల స్థితిగతులపై మన ఆర్థికజీవనం ఆధారపడిఉంది. ఆర్థికజీవనంలో అభివృద్ధి చెందిన దేశాలతో మనలను జతపరచటంచేత వారి పురోగమనంతో మనంకూడా సాగటానికి శక్తి లేదు. గంటకు ఏభైమైళ్ల చొప్పున నడిచే రైలుబండిని పట్టుకుని పరుగిడటానికి ప్రయత్నం చేస్తే ఏఫలితం కలుగుతుందో, మనకూ అగతే పట్టింది. అందుచేత ఆర్థికజీవనంలో భేదాలు ఉన్న దేశాలతో మన మారకపురేటును లంకె వెయ్యటం మన శ్రేయస్సుకు హానికరం.

ఇంక ఈరేటు అధికంగా స్థాపించటంలో మన ప్రభుత్వం మనకు ఘోరమైన అన్యాయంచేసింది. మన ఆర్థికశాస్త్రజ్ఞులూ, రాజకీయవేత్తలూ నెత్తీ నోరూ కొట్టుకున్నా, ససేమిరా అని స్వకీయ లాభంకోసం ఇట్లాంటి కార్యానికి పూనుకుంది. ప్రపంచంలో అన్ని దేశాలూ తమ మారకపురేటు తగ్గించుకుంటూవున్న సమయంలో పారిశ్రామికాభివృద్ధి లేని మన దేశం అధికమైన మారకపురేటుతో ఎంతమాత్రమూ అంతర్జాతీయబజారులో పోటీచేయ్యలేదు. ఈ అధికరేటువల్ల మన ఎగుమతులకు రావలసిన మొత్తంకంటె తక్కువగా ముట్టుతుంది. అందుచేత ఎగుమతులు క్షీణిస్తాయి. దిగుమతులుమాత్రం తక్కువధరలో లభిస్తాయి.

వల్ల దిగుమతులు అభివృద్ధిచెంది, ఎగుమతులు దెబ్బ తింటవి. చవకరకపు పదార్థాలను పైదేశస్థులు మన దేశంలో అతివృష్టి చెయ్యటంవల్ల మన పరిశ్రమలు, ఉత్పత్తి వృద్ధిచేసుకోటానికి అవకాశాలు ఉండవు. అసలు ఒట్టావావాణిజ్య సంధిప్రకారం (Ottawa Pact) మన వాణిజ్యంలో చాలాభాగం ఇంగ్లాండుతో చేసుకోవలసిన స్థితిచేత మనరూపాయకూ, ఇంగ్లాండు స్టెర్లింగుకూ సంబంధం చిరస్థాయిగా స్థాపించటం బ్రిటిష్‌ప్రభుత్వపు స్వార్థపరత్వాన్ని పూర్తిగా వెల్లడి చేస్తున్నది.

ఇంక ఈ అధిక రేటు మార్చటానికి శాసనసభకు అధికారం లేకుండా చెయ్యటం అమానుషమైన కృత్య మని చెప్పాలి. మారకపురేటు అంతర్జాతీయ వాణిజ్యసమస్యలను ఎదుర్కొనే అస్త్రం. ఆ అస్త్రం తుప్పుపట్టేటట్లు చేస్తే, దేశానికి ఎంత హానికరమో వేరే చెప్పనక్కరలేదు. ప్రపంచంలో దేశాలన్నీ తమ మారకపురేటులతో తీవ్రయుద్ధాలు సాగించుకొంటూ మనమీదకు విరుచుకునిపడుతూఉంటే మన ఆయుధాన్ని అమెరికీ మహాశయుని పడకగదిలో ఒకమూల దాచటం దేశక్షేమానికి తీరని నష్టం.

## మన డబ్బుయంత్రంలో లోపాలు :

ప్రజలకు దేశపుడబ్బుయందు పూర్తివిశ్వాసం లేకపోవటంవల్ల పరిశ్రమలకు పెట్టుబడిగా వర్తించవలసిన డబ్బు బంగారంరూపంలో ఇనపపెట్టెలలో బంధింపబడిఉంది. అందుచేత మన ఆర్థికజీవనం అభివృద్ధిచెందటం లేదు. అవసరసమయాల్లో మొత్తపు డబ్బును హెచ్చుచేసే శక్తి లేకపోవటంవల్ల శాంతి సమయాల్లో మన గృహవాణిజ్య పరిశ్రమలు విజృంభించటానికి అడ్డంకులు కలుగుతున్నవి. మారకపురేటు మార్చటానికి అవకాశాలు లేకపోవటంమూలాన మన ఆర్థికజీవనం యావత్తూ పరదేశాల స్థితిగతులపై ఆధారపడి, నిత్యక్షోభకలిగిస్తూ స్వదేశవ్యవహారాల్లో కూడా స్వాతంత్ర్య ప్రవర్తనకు అవకాశం లేకుండా చేస్తున్నది.

## యుద్ధఫలితాలు :

౧౯౪౦ జూలై వరకూ మన కరెన్సీవిధానంలో ఎట్టి ముఖ్యమైన మార్పులూ జరుగలేదు. కాని అప్పటి నుంచి ప్రభుత్వం డబ్బుతో గారడీచెయ్యటానికి పూనుకుంది. రూపాయినాణాల కఱవు వచ్చిం దన్న మిష పెట్టి, రూపాయికాగితాలను జారీచేసింది. ఈ రూపాయికాగితాలను రూపాయినాణెము లనే భావించుకోమన్నది. అంటే, రిజర్వుబ్యాంకు అచ్చువేస్తూఉన్న పెద్దనోట్లు వెండిరూపాయిలలోకి మార్చుకోటానికి గల అవకాశం ప్రజలకు లేకపోయింది. దేశంలో డబ్బు అతివృష్టి చెయ్యటానికి (Inflation) ఈ చర్య మొదటి సోపాన మని చెప్పవచ్చు. తమ ఉద్దేశం వెంటనే బయటపడకుండా ఉండా లనే ఉద్దేశంతో ప్రజల కళ్లు తుడవటానికని అరతులం వెండి గల రూపాయిని క్రొత్తగా కొన్నాళ్లు జారీచేసింది. అసలు మొత్తంమీద యుద్ధారంభంనుండి ఇప్పటివరకు రమారమి ౭౫ కోట్ల రూపాయినాణాలు చెలామణిలోంచి ప్రభుత్వమే తీసివేసింది. ఇంకా చెలామణిలో ఉన్నవి ౧౩ కోట్లకంటె అధికంగా ఉండవు. ప్రజలు ప్రభుత్వపు చర్య అంతరార్థం కొన్నాళ్లకు గ్రహించి ఈ రూపాయిలను పాత్రలు వేసేరు. అందుచేత బజారులో ప్రస్తుతం మనకు రూపాయినాణెం కనిపించదు.

క్రొత్తగా అచ్చువేసే నోట్లకు వెండిరూపాయిలు ఇవ్వనక్కరలేదన్న నిబ్బరంతో మన రిజర్వుబ్యాంకు విరివిగా నోట్లు అచ్చువెయ్యటం ప్రారంభించింది. యుద్ధారంభంలో రిజర్వుబ్యాంకు అచ్చువేసిన నోట్లసంఖ్య ౨౧౮ కోట్ల రూపాయలు. కాని ఇప్పుడు రమారమి ౮౦౦ కోట్లు. రోజుకి ఒకకోటిరూపాయల చొప్పున ఇంకా ఈకాగితాల సంఖ్య హెచ్చుఅవుతూనే ఉంది. ఈ నూతనపు డబ్బుకు ఇంగ్లీషుడబ్బు హామీ. కాగితాలకు కాగితాలే హామీ! బ్రిటన్ తన కోసం, తదితరమిత్రరాజ్యాల నిమిత్తం మన పదార్థాలు కొంటూ, తన కాగితంస్టెర్లింగుడబ్బు మనకు ప్రసాదిస్తున్నది. దిగుమతి అవుతూఉన్న ఈ ఇంగ్లీషుకాగితాల హామీపైన మన రిజర్వుబ్యాంకు క్రొత్తనోట్లు అచ్చువేస్తున్నది. అందుచేత మన దేశంలో జరుగుతూ ఉన్న డబ్బుఅతివృష్టి ఇంగ్లాండు మన పదార్థాలు పరిమితి లేకుండా కొనటంవల్లే. దీనివల్లమనంమనదైనికజీవితానికి అవశ్యకమైన పదార్థాలు ఇవ్వటమేకాకుండా, డబు

అతివృష్టివల్ల కలిగే ఆర్థికక్షోభకూడా అనుభవిస్తున్నాం. ఈఅతివృష్టివల్లే బీదవాళ్లు నిరుపేదలు అవుతున్నారు. సంసారికుటుంబాలు వీథిపడవలసివచ్చింది. వర్తకులు కోటీశ్వరులు అవుతున్నారు. పదార్థాల ధరలు నాలుగురెట్లకు పైగా పెరిగినయి. క్షామం, క్షుధా దేశంలో నిరంకుశంగా విహారంచేస్తున్నాయి. ఇటువంటి పోకడలు యుద్ధసమయంలోనూ, యుద్ధానంతరమూ తమకూ, ప్రజలకూకూడా హానికరమని ప్రభుత్వం ఇప్పటికైనా గ్రహించి, తగిన చర్యలు వెంటనే తీసుకోకపోతే, గతయుద్ధంలో జర్మనీ అనుభవించిన దుర్భర ఆర్థిక, సాంఘిక, రాజకీయపరిస్థితులు మనంకూడా చవిచూడవలసిఉంటుంది. యుద్ధానంతరం నిజమైన జాతీయప్రభుత్వం వచ్చినా, ఈకరెన్సీక్లిష్ట పరిస్థితులు సరిచేసుకోటం కష్టసాధ్య మవుతుంది.

---

# "వైష్ణవకులమ్ములో మహేశ్వరుడ నేను"



'శ్రీఆచార్య'

ఈశ్వరోపాస్తికంటె మాహేశ్వరీప-దాంబుజాతంబులే నను నాకృశించు
సుందరీశక్తి నెదిరి నిల్చుండ దరమె-మొగమునన్ మూడుకన్నులు మొలుచుగాక!

నీ మాధుర్యములో శతాంశమునుగాని కానగాలేని ఏ
వామాలోకవిలోకనంబులకొ దైవత్వంబు పోబెట్టి యా
వ్యామోహమ్మున జిక్కి చిక్కి సగమై యల్లాడువా రంటగా
దా ముమ్మూర్తులు; ఇంక మానవుని కౌనా దాని పోనాడగన్?

ఈశ్వరునియంతవాడు ఆయింతిమహిమ-కెరగి సామే నొసంగి యూరేగుచుండ
ఆమెపదసేవ కేను వెన్కాడ నేల-వైష్ణవకులమ్ములో మహేశ్వరుడ నేను.

నీకై నేను తపింప నవ్వుదురుగాని తాపసుల్ నీపద
శ్రీ కైంకర్యవిధానముం గని ననున్ శ్రీవైష్ణవుల్ తిట్టనీ
నాకైలాసము నీ కుటీరమె యనన్ శైవుల్ ననుం దూరనీ
నా కైలాసము నావైకుంఠమును కాంతా! నీవ ముమ్మాటికిన్.

నేను శివదీక్ష పొందని నిత్యశైవ-పూజనాభిరతుండను! పొలతి నీది
పుష్పచక్రాంకనమ్మును పొందినట్టి-వైష్ణవం; బిది హరిహరాద్వైతసిద్ధి.

---

# అతి లాభ పరునితో పోరాడుటకు మంచి మార్గం!

అవి లేకున్నా గడిచేవస్తువులను యుద్ధకాలంలో కొనడం తప్పు. అంతులేని ధరలలో కొనే ప్రతి పైకీ అతి లాభపరునికి లాభిస్తున్నది. మీరు నష్టపడుతున్నారు. నేడే డబ్బు నిల్వచేయండి; అవసరమయిన వాటికే ఖర్చు పెట్టండి. విజయం, ధరలను మామూలు స్థితికి తెచ్చేవరకూ విలాస వస్తువులను కొనడం మానండి.

**జాగ్రత్తగా వ్యవహరించండి** మీరు కూడబెట్టిన డబ్బుకు విలువ తగ్గని వాటిపైన వెచ్చించండి. ఒక కోఆపరేటివ్ సొసైటీలో వేయండి. ఒక ఇన్సూరెన్సు పాలిసీ తీసుకోనండి; బ్యాంకులోగాని పోస్టాఫీసు సేవింగ్సు బ్యాంకులోగాని సేవింగ్సు అకౌంటు ప్రారంభించండి. అన్నిటికన్నా ఉత్తమం ప్రభుత్వ ఋణాల మీదగాని, సేవింగ్సు సర్టిఫికేట్ల మీదగాని వెచ్చించండి.




**భద్రంగా నిల్వచేయండి** మీరు కూడబెట్టిన డబ్బును దాచుకోవడంలో జాగ్రత్తగా ఉండండి. బంగారు, వెండి, నగలు, భూములు, కట్టడాలు, సామాన్లమీద డబ్బు వినియోగించడం మంచిది కాదు; ఎందుకంటే, వాటికి నేడున్న హెచ్చు ధరలు ఒకనాడు పడిపోయి తీరుతవి; [illegible] ఒక్కసారిగా పడిపోవచ్చు.

# భవిష్యత్తు కోసం నిల్వ చేయండి



దేశీయ యుద్ధ దళము వారి దేశీయ విజ్ఞప్తి

# తెలుగు నటుడు

= శ్రీ భమిడిపాటి కామేశ్వరరావు =

ఆంధ్రనాట్యవిమర్శకులు తెలుగునటుడికి ఉండవలసిన వివిధప్రజ్ఞలూ, లక్షణాలూ బేరీజు వేశారు. ఆ జాబితాలో ఆంధ్రచ్ఛందోలంకారాలవంటి అల్పాంశాలు తప్ప అన్నీ ఉన్నాయి. నటుడికి సౌష్ఠవమూ బలమూ గల విగ్రహమూ, ఆడే కాళ్లూ, తిరిగే చేతులూ, కోటేసినట్టుండే ముక్కూ, చారడేసి జిలజిలలాడే కళ్లూ, హృదయభావాన్ని స్వీకరించి స్థిరం చేసుకోగల ముఖమూ, కంమగీసినట్టూ మధురంగానూ ఉండగల గాత్రమూ, ఉచితమైన సంగీతసామగ్రీ, ఆరువిశేషాలు గల తెలుగుఉచ్చారణా, ఆంధ్రభాషా, ఇతరసన్నిహితభాషల్లో ప్రవేశమూ, వాటిల్లో ఉచ్చారణా పాటవమూ, అమోఘమైన ధారణా, ఉచితవేషం ధరించుకోగల తెలివీ, బోధనాశక్తీ, ఆకర్షణా, సౌశీల్యమూ, నాటకకర్త గిలికిన రచనకి మెరుగుపెట్టగల ప్రతిభా—ఇలాగ్గా వీటైనన్ని శక్తులూ సామర్థ్యాలూ ఉంటేగాని ఎంతమాత్రమూ వీల్లేదని కోప్పడి శాసించారు. వీటిల్లో చాలాభాగం నటుడికి స్వతస్సిద్ధంగానే ఉండాలిగావును అన్నట్టుగా కనిపిస్తుంది. అనగా, రాజువేషం ఒప్పించడానికి ఒక్కప్పుడుకూడా రాజలక్షణాలతో పెట్టిపుట్టినవాడుగాని పనికిరాడు అని. ఎవడేనా ప్రకృతిమహిమవల్ల, విధిలేక, అందంగా ఉంటే, వాడు నాటకరంగంమీదకూడా అందంగా కనపడడానికి వాడు ఏమీ నటించాలో, వాడి నటప్రజ్ఞ ఏమిటో బోధపడదు. సరి, ఇక సాధారణాంధ్రజనం తమకి ఇష్టప్రకారం ఇష్టనటుడిమీద మెప్పులు కురిపించేటప్పుడు ఈరీతిగా అంటూంటారు: 'బాగా పాడతాడ్రా, గొప్ప యాక్టరూ'; 'చాలా ఖరీదైన చమ్కీరా, మంచి యాక్టరు'; 'చాలా ఆస్తి ఉంది, డబ్బంటే గవ్వ, గట్టి యాక్టరు'; 'బి. యే. ప్యాసయ్యాడు, సామాన్యపు యాక్టరా'; 'మంచి కుస్తీపడతాడట, ఉద్యోగంట, ఉపద్రవపు యాక్టరు'; 'నిద్రాహారాలు లేకుండా చచ్చిచెడి అద్దంఎదట తంటాలుపడడం అదీ లేదుట, యాక్టరంటే వాడే యాక్టరు'; 'బొమ్మలు ఫస్టుక్లాసుగా గీస్తాడు, ఉషా వాడే వెయ్యాలి, ఉషార్ యాక్టరు!'; 'జిహ్వ లేచివచ్చేటట్టు వండుతాడు, వాడికి పోటీగా భీముడు వెయ్యడానికి ఎడ్డోయ్ మరో యాక్టరూ'; 'చుట్టేనా కాల్చడు, మహాసాత్వికుడు, మా మేలైన యాక్టరు'; 'ఏమి క్రాపింగ్‌రా వాడిదీ, హార్మనీ ఫిడేలూ వాయిస్తాడు, ఎంత యాక్ట రనుకున్నావ్'; 'నాకూ వాడికీ స్నేహం, నేనూ కాదంటే ఏమన్నా అనుకుని ఇదవుతాడు, అందవేసిన యాక్టరు'; 'ఇవతల ఎంత వినయం, ఎంత నెమ్మది! పైగా, రంగంమీదికి వెళ్లేటప్పుడు సెంటూ లవండరూ వాడతాడు, మహా ఎక్కా యాక్టరు'; 'ఎన్ని రికార్డులిచ్చాడురా, టాకీవాళ్లు ఊరికేనే తీసికెళ్లారా మరీ, వాడికి రోజుకి ఎన్ని ఉత్తరాలో తెలుసా? మరోడు యాక్టరేమిటో'—అనే ధోరణిలో మెచ్చుగుని విమర్శిస్తూంటారు. ఈ పామరవిమర్శలో కేవల హాస్యాస్పదంగా ఉండే లక్షణవిశేషాలు మినహాయించి తక్కినవి పండితులు కోరే శిక్షణాలతో జతపరిచి, వాట్లయొక్క ప్రాతిపదికలు గమనిస్తే, నటుడూ నాట్యం చేసేవాడుగనక,

అతడికి ఆకర్షణగల వేషమూ, గంతూ, చేష్టా, స్వరమూ, పదమూ ఉండేవనీ, ఉండాలిగావుననీ తేలుతుంది. భగవన్మహిమకీ ప్రకృతిసౌందర్యానికీ మానవ హృదయం వికసిస్తుందనీ, ఆటవికులుకూడా ఉద్రేక సంభ్రమాలతో మంచివేషంలో గంతులేస్తూ పాడుకుంటూఉండేవారనీ మనం ఊహించుకోవచ్చు. పట్టణవాసులయొక్క వినోదంకోసం వాళ్లు వెళ్లి ఆడగా పట్టణవాసులు వాళ్లని అనుకరించి, వాళ్ల ఆటల్ని సంస్కరించి ఉద్ధరిస్తాం అంటూ తమరూ ప్రారంభించి ఉంటారు. భావప్రకటనకి ఈ వేషాది పంచకంతో మానవులు ప్రారంభంచేసి, కాలక్రమాన్ని దాన్ని నాట్యం అని పిల్చిఉంటారు. ప్రతివిషయంలోనూ మొట్టమొదటలో వివక్షత తక్కువగా ఉంటుందనీ, భావనమాత్రమే విరివిగా ఉంటుందనీ నమ్మచ్చు. అంచేత, ప్రథమంలో ఏనాడో భాగవత ప్రదర్శనాలలో నటుడు భుజకీర్తులూ కర్రకత్తీ చెక్కలకిరీటమూ వగైరాలతో వేషంకట్టి, చిందులుతొక్కి గంతులేసి, చేతులు తిప్పి, ముఖానికి అరదళం పట్టించుకుని, కొన్ని కొన్ని దీర్ఘాలు తీస్తూ, కొన్ని కొన్ని మాటలు అంటూ, చుట్టూ చేరిన జనాన్ని రంజించిఉంటాడు. అనగా, ప్రతీనటునికూడా తక్కినవాటితోపాటు నృత్యంకూడా చేసితీరవా డన్నమాట. అన్నింటికీ మూలం ఓం ప్రథమంలో నృత్యం చెయ్యడమే తరిఫీయతు అయేవాడు. భాగోతంలో చేరదలిచిన ఒకానొక అభ్యర్థి నృత్యం చెయ్యడం నేర్చుగోడానికి రాత్రి తెల్లవార్లూ శ్రమించడం నా బాల్యంలో నేనే చూశాను. ఇవికాక, భాగవతనటుడికి హస్తాలుపట్టడం, లయజ్ఞానం, రాగజ్ఞానం, అర్థంతో సహా సంస్కృతశ్లోకాలూ, వాటిల్లో ప్రమాణించవలసిన అమరమూ, సమగ్రంగా పురాణగాథలూ తెలిసిఉండేవి. ఇక, భాగవతహాస్యనటుడికి అనర్గళవాగ్ధారా, అనేకవిషయాల గురించిన సంచికట్టువాక్యాలూ, సభాభిరుచినిబట్టి కొంచెం పచ్చిగా ఉండి బండజనాన్ని కూడా పకాలుమనిపించగల మోటముచ్చటలూ, అవసరాల్ని హేళనచెయ్యగల నేర్పూ, సంఘంలో ఉండే సాంసారికవ్యత్యాసాల వయినమూ, పక్కపాత్ర చెప్పే దాన్ని ఊకట్టి బలపరిచి, వ్యాఖ్యానించి, ఉదాహరించి, ఆచరించి, 'నాకు తెలియదేమో, ముర్రో' అనే ముతకమనిషి నెత్తికెక్కినా, చెప్పబడే సంగతి రుద్దిపట్టించగల ఓపికా-మొదలైన లక్షణాలుం ఉంటూన్నట్టు నేటివరకూ గోచరిస్తాయి. కలాపనటులు దేవతలతో తమరికి సంబంధాలు సమర్థించుకుంటూ, మానవులకి మానవ సంస్థల విశేషాలూ అభివృద్ధిమార్గాలూ సంగీతంలోనూ దరువుల్లోనూ మాటుపెట్టి ఎగిరి గంతేసి అందించగల నేర్పు సంపాదించినవాళ్లు. ప్రదర్శిత విషయాలు మనికీ మనికీ సంబంధించినవే అంటే మూర్ఖులు చప్పరించి 'అయితే ఇందులో ఏముంది!' అంటారు. ఆ విషయాల్నే పట్టిగిల్లి నేరుగా ఏ అసలుభగవంతుడికో, లేక చిల్లరదేవుళ్లకో ముడెట్టి, ముందు ఒఖ్ఖముక్కైనా తెలియని భాషలో రైంయిమని పాడి, తరవాత వ్యాఖ్యానంచేస్తే, తరవాత, జనం, లెంపలువేసుకుని సంగతి ఆరగిస్తారు. 'భాగవతాలు' అని పేరు రావడానికి అంతే కారణం. క్రమేపీ, కథలూ పాత్రలూ పెరగడం, కథల్లోకి రాక్షసులూ రాజులూ స్త్రీలూ రావడం జరిగింది. అటువంటివి ఎక్కువ పట్టింపుగా, విశేష సామర్థ్యంతో, చాలా నిష్ఠగా ఆడినవారు కూచిపూడి భాగవతులు అని దేశప్రసిద్ధమే. వాళ్లని అపాంక్తేయులుగా కట్టక శ్రోత్రియులుకూడా మన్నించడం నేను కూడా ఎరుగుదును. వాళ్లు, ఎద్దైనా గ్రామం వెళ్లి, ఆగి, ఒకవీథివివర బల్లలరంగం కట్టుగుని వీథి చివర దాకా వీధులోనూ, అరుగులమీదా ఉదయందాకా జనం కూర్చుని ఉండగా, దీక్షగా (నరసింహమూర్తి వేషగాడు ఉపోష్యం ఉండేవాడు!) ఆడి వృత్తాంతం విశదంచేస్తూ ఆ జనాన్ని రంజింపజేసి, ఊర్నించి వెళ్లేటప్పుడు గ్రామం మెచ్చిఇచ్చింది పుచ్చుగుని వెళ్లేవారు. వాళ్లు ఆడగా నేను చూసిన ప్రహ్లాద(౧౯౦౮)లో ఏనటుడూ నృత్యం చెయ్యలేదు. బహుశ వాళ్ల ప్రదర్శనాల ప్రారంభంనాటికే పైన సూచింపబడ్డ కళాపంచకంలోంచి నృత్యం విడిపోయి ప్రత్యేకకళగా ఏర్పడిఉంటుంది. ఆకళని ప్రత్యేక కృషితో ఉపాసించి అర్జించినవాళ్లు ఉంటూండగా, కాస్తకూస్త నృత్యం చెయ్యడం పిప్పిగంతులకిందికి.

రావచ్చు ననే భయంవల్ల నటుడు అకళని వదిలేసి ఉంటాడని మనం భావించాలి. నృత్యానికి ప్రత్యేకత వచ్చినట్టు మరోటి కనిపిస్తుంది. నృత్యంసంగతి అటుంచి కేవలం అన్యవేష స్వీకరణంవల్లా, అన్యగాత్రానుకరణంవల్లా అపరిచితజనాన్ని (ఒకొక్కప్పుడు ఎరిగున్న వాళ్లనికూడా) చాలా భ్రమింపజేసి, తద్వారా జనానికి ఆనందంకలిగించుతూండే పగటినటులు బయల్దేరడం! ఒక అసలు తాహసీల్దార్ని బెదిరించి ఆజ్ఞాపించి కాగితాలు మోయించి తన యిష్టంవచ్చినట్టు పన్ను చెయించుగోడానికి కలెక్టరుగా వెళ్లిన పగటివేషగాణ్ణిగురించీ, ఒక కలెక్టరుసాలలో ఉండే గుర్రాన్ని హయహేషానుకరణంవల్ల బయటికి వచ్చేటట్టు చేసిన పగటిభాగవతుణ్ణిగురించీ, ముందు నోటీసిచ్చి పగల్లా వేషంలో వీధుల్లో తిరుగుతూ గుర్తుపట్టడానికి దొరక్కుండా ఉన్న పగటివేషపు వీరుణ్ణి గురించీ ఎరుగుదుం. అనేక జనానికి పగటివేళే వ్యామోహం కలిగించగల అన్యవేషభావలు ఆరోపించుకోగలిగిన ఇటువంటివాళ్ల వేషధారణలోని సమగ్రత వేరే చెప్పడం ఎందుకు! గాత్రోచ్చారణలలో వాళ్లు చూపించగలిగిన పరివర్తనయొక్క విశిష్టత ఇక అడగడం ఎందుకు! సోమయాజులూ సోమిదేవీ, దొరా బంట్రోతూ, పంతులూ పఠాణీ, బుడబుక్కలు, ఫకీరు — ఇవన్నీ విశేష చాతుర్యంతో గ్రామాభిరుచుల్ని బట్టి వాళ్లు ప్రదర్శిస్తోచ్చారు. మరి అనకట్టు,ఉప్పెనలకి చాలక్రితమే వెండితెర కట్టి దానిమీదికి చలనచిత్రా లెక్కించి, తమరు వెనకే ఉండి, భారతభాగవతరామాయణగాథల ముఖ్యఘట్టాల్లోని పాత్రల చర్యలూ, వృత్తాంతాలూ, కలహాలూ సంభవాల పౌర్వాపర్యమూ — ఎన్ని జన్మలెత్తినా తమ మత మేమిటో తమరికి తెలియడానికి వీల్లేని పరమపామర తెలుగుజనానికికూడా మొఖం ముందు వేళ్లాడేలాగ బోధచెయ్యడానికి యత్నించి నెగ్గి తద్వారా తెలుగుజాతికి కొన్ని ఉమ్మడిప్రసంగ విషయాలు చేకూర్చిపెట్టినవాళ్లు తోలుబొమ్మలాడించినవాళ్లు! ఆబొమ్మల అభావం ఊహించుకుంటే తెలుగుపామరజనం యొక్క సాధారణజ్ఞానప్రమాణం ఇప్పటిమాత్రం లేకపోయుండేదని రూఢిగా చెప్పొచ్చు. వాట్లవల్ల కీడు కలిగిందేమో అని సంకోచించేవాళ్లు ఉండగల్రు. కాని, వాట్ల మేలు అంతకంటె చాలా రెట్లని తోస్తుంది. కీడు ఏమిటీ అంటే అశ్లీలత! కాని, ఎదేనా సభఎదట జరిగే అశ్లీలం సభవారికంటె మోటుగా ఎన్నడూ ఉండదు, ఉంటే ఆసభవాళ్లు దాన్ని ఆపేస్తారు, ఒక్క సభ్యుడు లేచి ఆపగలడు, ఆపిన సందర్భాలు ఎరుగుదుం! తమరు తెరవెనక పడినా, ఈనాట్యగాళ్లు రాగాలూ కీర్తన్లూ వదల్నూ లేరు, ఆరితేరి తయారూ కాలేదు. కాని వాళ్ల సంసారానికంతకీ కథ క్షుణ్ణంగా రావడమూ, ఒకరు బొమ్మని వదిలి తమల్లో ఇంకోరికి అప్పగించినప్పుడు ఆ ఇంకోరు బొమ్మని ఆడిస్తూ కథ కొనియ్యడమూ ఉంటాయే కాని, చెప్పవలిసిన ముక్కలు తడుముకోడమూ, మరోరిదగ్గిర్నించి అందుకోడమూ ఉండవ్. ఒకఅవసరంలో వాళ్లల్లో ఒక అనుభవజ్ఞుడు ఛటుక్కున ‘వేధమూర్తులు’ అని ఉచ్చారణ చేసేసరికి సభలో కొందరికి నవ్వురాగా, “స్రష్టా ప్రజాపతిర్వేధా” అని వాడు అమరించేటప్పటికి నవ్వు తగ్గిపోయిన సంగతి యథార్థమే. ఈఆటగాళ్లుకాక, తెల్ల పరికిణీ కట్టి, నడుం బిగించి, చేత్తో చిన్న తంబురా పట్టుగుని ముందునడకా వెనకనడకా నడుస్తూ హరిశ్చంద్రవంటి కథ ఆడే మాలదాసరియొక్క నటనలో హృదయాకర్షణ చెయ్యగల నేర్పు కనిపిస్తుంది. పైరకాలన్నింటిలోనూ ఆట ఒకరిద్దరిమీద ఆధారపడడం, కథయొక్క వృత్తాంతంలోని సూక్ష్మవిశేషాలుకూడా వ్యాఖ్యానం చెయ్యబడడం, సంగతులు అధముడికికూడా బోధపడడం, ఒకడు ఆటనిర్వహణంగురించి పూచీపడి రంగకర్తగా ఉండడం, ఆడే సంఘం తెల్లవార్లూ మనసారా నోరారా పఠించి జనాన్ని ఉత్సాహంగా కూచోపెట్టడం, జనం ముందు మెచ్చుగుని తరవాతే నటుల్ని బహూకరించడం మొదలైనవి స్ఫురిస్తాయి. కాని, ఉపయోగింపబడే పదవాక్యాల సంపుటీగాని, గేయకాండగాని యావత్తూ లిఖితంఅయి ఉండడంగాని, అరచనకి ఫలానవాడే కర్త అని ఉండడంగాని ఎరగం.

ఒకేవ్యక్తి ఊహించి, రచించి, లిఖించి ఒకే గ్రంథరూపంలో దేవకథా, లేక పురాణగాథా ఫలాని గద్య

పద్యాలూ దరువులూ ఫలానివారు చెప్పాలి, పాడాలి అనేటటువంటి సూచన్లతో సహా బయల్దేరినదాని పేరు యక్షగానం. యక్షగానాలు ఆరువందల సంవత్సరాల క్రితంనించీ ఉన్నట్లున్నా, ఆదిని వీటిల్లో నృత్యం ఉన్నా క్రమశః ఇవి ఛందోగానప్రధానాలైనట్టున్నా తెలుస్తుంది. యక్షగానాల్లో రచింపబడ్డ గేయాలు లయానుగుణఛందస్సులకీ కీర్తనలకీ మధ్యరంగం. యక్ష గాననటుడు నృత్యం వదిలేసి, ఇటు ఛందస్సూ అటు రాగాలూ రెండూ సమపాళంగా తెలిసినవాడై, వేషం ధరించడంలో నేర్పు గలవాడై, కథితాంశం మూర్ఖులకి కూడా బోధపడేయ్యవలిసినవాడై ఉండవలిసొచ్చింది. కాక, యక్షగానాలు ప్రబంధాలకీ పామరరచనకీకూడా మూలకందా లని పెద్దలు సెలవిచ్చారు. నృత్యానికి ప్రత్యామ్నాయంగా యక్షగానాల్లో కాలక్రమాన్ని ప్రవేశించిన పద్యాల ఛందోబాహుళ్యమూ, పద్యం యొక్క చరమపాదాన్ని రెట్టించి దరువేసి కీర్తించడమూ, సువ్వి, ఏల, తుమ్మెద మొదలైన పదాలయొక్కా రాగాల యొక్కా విస్తరణమూ—ఇవన్నీ సాధారణనటుణ్ణి మించిపోడంవల్లనున్నూ, త్యాగరాజువంటివాళ్లు రచించిన భక్తివేదాంతప్రధానాలైన యక్షగానాలకంటె శృంగారమాత్రాలైన రచనలే జనం కాంక్షించడంవల్ల నున్నూ, అర్హులైనవాళ్లుమాత్రమే యక్షగానరచన చేసినా అనర్హులు తమరుకూడా జక్కులమోస్తరుగా యశం ఆర్జించాలనే దురాశతో యక్షగానాలు పాడడానికి తగుదుమమ్మా అని తయారవడంవల్లనున్నూ అవి వెనక్కి వెళ్లిపోయా యని పెద్దలు సెలవిచ్చినది సమంజసం. యక్షగానకళాకాంతంతో రెండు సంగతులు ముఖ్యంగా తెలుస్తున్నాయి. ఒకటి, పండితాభిరుచికీ పామరాభిరుచికీ రచనలు వేర్వేరుగా ఉండాలనీ; రెండు, ఛందోవారిధిలో గణాల్ని గానసాగరంలోని రాగాల్తో లగాయించేపనిమీద నటుణ్ణి నోటేసిచ్చి వొదిలిపెట్టినా సరే పర్యవసానం శూన్యమే అనీ! నృత్యం, వేషం, అభినయం, గానం, (గద్య పద్య గేయ) కవనం—ఈ ఐదూ పంచకోలకషాయంగా కాకుండా నాట్యసిద్ధికి పంచప్రాణాలుగా ఏకకుటుంబంగా ఉండేవనీ, ఉండవచ్చునీ, ఉండాలనీ విమర్శకులు ఓమూల గోలెత్తుతూఉండగానే మొట్టమొదట్లో నృత్యం వేరడిపోయింది. వేరడడానికి ఒకర్ని అడగాలా ఏమిటి! ఇతరసహాయం లేకుండా తనే ప్రత్యేకంగా జనాన్ని ఆకర్షించుకోగల స్థైర్యం దానికి రాగానే అది వేరైపోయింది. పైగా, అన్నీ కలిసి కనిపించినప్పుడు, నృత్యమే జనాన్ని తక్షణం తనకేసి ఆకర్షించుగోడమూ, తక్కిన కళలకేసి మరి చూడనియ్యక జనాన్ని తనే కట్టేసుగోడమూ అనే విషయాలు తక్కిన కళలకి నృత్యంమీద ఈర్ష్య రేపడంవల్లకూడా నృత్యం వేర్పడి ఉంటుంది. అంతే గాని, ఒకరి ఇష్టానుసారం నృత్యం మానుకోలేదు నటుడు! తక్కిన నాలుగు కళలూ కలిపి తనవే అనుకున్నాడు. కాని, క్రమేపి వీటిల్లో స్వరం స్వాతంత్ర్యం వహించి ప్రత్యేక కళ అయిపోయింది. అదే గానం. గానం చిరకాలం పదాలతో కలిసే జీవించింది. అయితేం, ఎప్పుడు జంత్రవాద్యం ప్రత్యేకంగా ప్రాణికోటుల్ని రంజింపగలిగిందో అప్పుడే అది ప్రత్యేక కళగా విడిపోయింది. వీణా, పిల్లనగ్రోవీ, పాము బుర్రా - ఇటువంటి వన్నీ పదాలయొక్క సాయంతో నిమిత్తం లేకుండానే మానవుల్నీ జంతువుల్నీకూడా రంజింపజేస్తాయి. ప్రత్యేకగానంవల్ల మనస్సుల్ని హరించేవాడు గాయకుడు. శుద్ధగానానికి అర్థం గోచరించదు. మానవుడు, పామరుడైతేకొద్దీ, అర్థం తెలియని వ్యాపారాన్ని ప్రయత్నపూర్వకంగా గాని చాలాసేపు వినలేడు. అందువల్ల, అర్థం ఉండి తెలిసే మాటలు గల సంగీతం వచ్చింది. ఆ మాటలేనా మనికి లోగడ తెలిసి ఉండాలిగాని గాయకుడి నోటంట మొదటిసారి మనం వినడం జరిగిందా, మనపని సరి! మెట్టుమాట, తెలుగు నటుడు గాయకుడి ప్రత్యేకాభిమానకళ అయిన గానాన్ని 'ఉచితం'గా, పద్యంలోమాత్రం చేసితీరాలని విజ్ఞులు శాసించడంవల్ల, ఉచితం అంటే ఘటుక్కున తెలుసుగోలేక, ఒకవేళ తనకి గొప్పగానం వస్తే అది ఖచితంగా చెయ్యడానికి స్తిమితావకాశం లేక, మెప్పునష్టం భయంవల్ల మితంగా చెయ్యలేక, లేవిడీ కొడతారేమో అనే భీతిచొప్పున అసలు మానలేక నానాబాధలూ పడడం ప్రారంభించాడు.

ఇంతట్లో భరతఖండంలో ఆంగ్ల విద్యాలయాలూ విశ్వవిద్యాలయాలూ ఆంగ్లభాషాగౌరవమూ పుట్టి, ఆంగ్లభాషాకృషీ భాషాంతరీకరణాలూ, అంచేత పదపడి సంస్కృతగ్రంథభాషాంతరీకరణాలూ బయల్దేరి, అచ్చులు వచ్చి, ధార్వాడకాంగ్లీ కంపెనీలవంటివి తెలుగుదేశంలో నాటకాలు ఆడగా వాటిని అనుకరించి తెలుగులోకూడా ప్రదర్శనాలు చెయ్యాలనే కుతూహలం జనంలో రేగినమీదట, వాటంతట అవే పైకి లేచిపోతూండే తెరలూ, వైరువర్కూ, చమ్కీడాబూ, సగ్గిలపుమంటలూ, హార్మనీ జంతువూ మొదలైనవి జనాన్ని ఆకర్షించినమీదట, పద్యంమీదా మట్టుమీదా ఆధారపడి పండితుడు నాటకరచన చెయ్యగా తన మంచిపీకమీదా క్షుద్రరాగాలమీదా ఆధారపడి నటుడు ఆడటం ప్రారంభించాడు. తెలుగునాటకాలు అచ్చుపడడం సాగింతరవాత "స్టేజీడ్రామాకంపెనీ నాటకము" అనీ, "సంగీతనాటకము" అనీ పైఅట్టమీదే ఉండేవి. అల్లా లేకపోతే, అవి సంఘాలు ఆడకపోతే, జనం రాకపోతే, ఆ నాటకప్రతులకి అమ్మకం ఉండకపోతే! అదీ భయం.

కాని, ప్రదర్శనాళ్నిబట్టి ఆలోచిస్తే కొత్తరికంలో రాగాలకి ప్రాధాన్యం లేదు సరికదా, మాటలయొక్క అర్థాలవల్ల ద్యోతకంఅయే అంశానికే ప్రాముఖ్యత ఉండినట్టు తోస్తుంది. కాదు, అసలు మొదటి తెలుగునాటకాలు వచనంలోనే ఉద్భవించాయి. వాటిని జనం ఆనందించారు, పామరజనం కూడా విని అవగాహనచేసుకుని ఆనందించవలిసిన బాధ బయల్దేరింది. వాటిని ఆడే నటుల్ని 'వచననటులు' అనేవారు, 'పురిటివాళ్లు' అన్నట్టుగా, వాళ్లల్లో ఏదో కళంకం ఉన్నట్టుగా! దాంతో, నాటకవేషాలు కట్టడానికి మిడిమిడిసంగీతజ్ఞానమైనా గాత్రనాదం గలవాళ్లు రావడం మొదలెట్టారు. వాళ్లు నిజానికి రాగనటులే అయినా, పద్యనటులుగా ఎంచబడ్డారు. 'వచననటులు' అంటే పద్యాన్ని అభినయయుక్తంగా పఠించలేనివాళ్లనికాదు, తియ్యగా కూనురాగాలు తియ్యలేనివాళ్లన్నమాట! 'పద్యనటుడు' అంటే ఛందస్సు ఏమీ రానక్కర్లేదుసరికదా దేవుడిచ్చిన గొంతికతో తను సేకరించుకోగలిగిన నాలుగైదు రాగాలతో లుంగచుట్టి సాయంపట్టి, పద్యాన్ని, రాగానుపానం ఉంటేగాని పద్యవిషం పుచ్చుకోలేని జనంమీద ఝుమాయించి విసరగలవాళ్లు అన్నమాట! కవిపదాలకి నటుడి రాగం జోడించడంవల్ల అభినయం ఎక్కువయేదో, శూన్యం అయేదో, విరుద్ధం అయేదో తెలియదుగాని, మోజు అటువంటివాళ్లమీదే ఉండేది. మోజులేనివాడికి రాజువేషం దొరకదు. రాగాలు తియ్యని పురాణరాజు పూర్వం ఉండేవాడా అని ఆంధ్రజనం శంకించేటంత అభిరుచి బయల్దేరింది. రాగ రాజశబ్దాల వ్యుత్పత్తినిబట్టి అంతే శాస్త్రి అని పండితులన్నారు. రాగాలు రానివాడికి రాజువేషం కల్లవార్త అయిపోయింది. రాగనటులు నాటకరంగం ఎక్కినకొద్దీ, లోగడ గద్యంలో అవతరించిన నాటకపు మాటల మధ్యమధ్య — రీసర్వేరాళ్లు పాతినట్టు — పద్యాలు ఇరికించారు నాటకకర్తలు. మరి ఉన్న వచనపదార్థాలతోనే, హిందూస్థానీవరసల్లో, మట్లు ఒకప్పుడు నాటకకర్తే అనుబంధించేవాడు, లేనప్పుడు నటుడే సంధించుకునేవాడు. హార్మనీ మొదట అదృశ్యంగా పక్కనుండి, తరవాత కనిపిస్తూండి, పదపడి నువ్వా నేనా అని రంగానికి ఎదురుతిరిగింది. సరి, ఆ పద్యాలూ మట్లూ లేకపోతే నాటకం ఆడబడదని రాశారా, ఒకవేళ ఆ స్థలాల్లో భావం గడ్డకట్టి పద్యగేయరూపం దాల్చిందా, అంత గొప్ప భావమూ ఒక్క రాగవాచికం పొందగానే అవగాహన అయిందా? ఓ వందసార్లు జనం విన్నతరవాతేనా నేటికేనా బోధపడిందా? కొన్నికొన్ని అధమం నటుడికేనా బోధపడ్డాయా?—అనేవి మీమాంసలు! ఎక్కడాకుడా మొదటిఉద్దేశాలు మంచివీ, గొప్పవీనూ. పద్యానికి అర్థం ఉండాలి, దాన్ని ప్రకటించి, అన్యథా తోస్తే, వాడు 'నటుడు' — అన్నారు. ఒక అర్థజ్ఞానం గల నటుడు భావబోధ చేస్తూ పద్యం చదివి రసం హెచ్చి ఒప్పేటట్లు 'ఉచిత' రాగకల్పన చేయగల్గి, మిక్కిలి అపరూపసామర్థ్యంతో హరిశ్చంద్రపాత్ర పోషించాడనుకోండి. అతడిపక్క, అర్థంతో నిమిత్తం లేకుండా పీక మంచిది ఉండి శ్రావ్యంగా రాగాలు తియ్య

గలిగిన ఒకడు నక్షత్రకుడు వేశాడనుకోండి. "హరిశ్చంద్రుడు గట్టివాడే! పాపం, పాట ఒకమోస్తరు. కాని, ఆ నక్షత్రకుడున్నాడే వాడి మొహం ఈడ్చా, వాడికి పార్టు రాకపోతేం అన్నాను, ఏమిపాట ఏమి గొంతిక ఏమి 'స్టోను'-అబ్బఅబ్బ, చెక్కేశాడు, ఊపేశాడు, జంఝూటిజన్మ తరించింది, జింగ్లా చెవలతుప్పు రాల్చేసింది-వీడేస్తే హరిశ్చంద్రుడు, దొల్లించెయ్యడూ!" అనే జనవిమర్శ రేగేది. పండితులు ఇదంతా మూర్ఖవిమర్శ అని కాగితంమీదా అక్కడా కొప్పడితే ఏమైనట్టూ! దాన్నించి మళ్లీమాటు హరిశ్చంద్ర ఆడినప్పుడు వీడికి హరిశ్చంద్రుడూ, వాడికి నక్షత్రకుడూ వేషా లయేవి! అక్కణ్నించి, అతిశయోక్తి లేకుండా చెప్పాలంటే, పెట్టిపుట్టిన కంఠమాధుర్యానికి తోడు ఎన్ని రాగాలుంటే అంత పెద్ద వేషం! కాదుకాదు, రాగాలొచ్చినవాడికి పెద్దవేషం ఇవ్వకపోడం దోషం అనే మాటకూడా బయల్దేరింది. "వాడంత బాగా పాడతాడు, మంత్రిచ్చారేమిటిరా!" అనేవారు. కథ అల్లి, పాత్రల్ని పిల్చుకొచ్చి (పురాణపాత్రలే గనక సృష్టించడపుగొడవ లేదు!) సంభాషణలు సాగించి, కవిత్వం రచించిన నాటకకర్తకి రాగాల ప్రమేయం లేకపోవడమున్నూ, ఆడేవాళ్లకీ ఆడబడేవాళ్లకీ రాగాల ప్రమేయం తప్ప రెండోది లేకపోవడమున్నూ సంభవించింది. ఆహాడా విడిసందడిలో చాలామంది రాగనటులు అర్థంతో నిమిత్తం లేకుండానే పద్యం పాడి మెప్పుపొందడం నేర్పు సంపాదించారు. తరవాత ఏం చెప్పనూ, అసందర్భంగా ఆగేవాళ్లు, కర్తకర్మక్రియలు తెలియనియ్యనివాళ్లు, సంతకింద చెప్పించుగోడమేగాని చదువుకోలేనివాళ్లు, మూక్కులమరుపు కమ్మడానికి సంగతులు గుమ్మరించేవాళ్లు, రైలుదిగి తమపక్క వేషం వెయ్యవలసినవాడు వచ్చేదాకా సీసాల్ని రాగాల్లో సాగేసేవాళ్లు, పద్యపదసంఘాల్ని దూదిపింజలు ఏకినట్టు ఈమూలనించి ఆమూలకి ఉప్పట్లాడినట్టు ఆడుతూ ఏకేవాళ్లు, మారొడ్డించాలని జనం ఘొల్లుమనేదాకా పాడేవాళ్లు, ఇలాగ్గా అనర్హులు క్షుద్రరాగలాభం ఆర్జించుగోడానికి అవకాశం ఇవ్వబడి జనప్రియత్వం పొందడం ఎరుగుదుం. వీళ్లల్లో చాలామంది, కేవలం 'లాటరీ' వంటిదైన పామరజనతాతాత్కాలికశ్లాఘ పొందడమే అయిందిగాని, వందలాదిపద్యాలొచ్చినా ఛందస్సు తెలుసుగోడంగాని, వందలాదివాక్యాలొచ్చినా కొత్తవాక్యం రచించడంగాని, రాగాలేకాక గానంకూడా వచ్చినా గానలక్షణగానమహిమలు గుర్తించడంగాని, తనకంటె మంచికంఠం గలవాడు వస్తే తన సమాజంలో చేరనియ్యడంగాని, చేర్చుగుంటే వాడికి పద్యాలుండే పార్టు ఇవ్వడంగాని, ఇస్తే అవి తీసేసి వాటిబదులు వచనం రాసిఇవ్వకుండా ఉండడంగాని జరగలేదు! జరిగితే, తన మాట! దాన్నిబట్టి నటసమ్మేళనవల్ల జనానికి విశేషానందం కలగడానికిబదులు నటుల్లో ఒకరిమీద ఒకరికి 'కంఠం' వరకూ ఉండడం సంభవించింది. పక్కవాడు వాడి మాయధారికంఠంతో 'వన్సుమోర్' లాగేస్తే, తను పైసలా! ఒకే రంగంమీద, ఒకడివెంట ఒకడు, పావలాకి, పదిమంది రాగాలు తీస్తే, అందులో ఎవడో ఒకడు ఆరాత్రికి ప్యాస్, తక్కినవాళ్లంతా అప్పట్లో వాడితో పోలిస్తే, ఫేల్! ఆఒకడూ పాడినప్పుడు జనం మెచ్చడం (గానానికి తక్షణశ్లాఘ ఉంటుంది. అది దాని ధర్మం, రాగనాటకంయొక్క కర్మం-ఎవడేం జేస్తాడు.) ఓమోస్తరువాళ్లని క్షమించడం, తక్కినవాళ్లని తీసేసి దూసేసి కూసేసి మోసేసెయ్యడం! "ఉచిత రాగం చాలురోయ్" అని నటుణ్ణి శాసించేవాళ్లు భావబోధ చెయ్యగల నటుడు పఠీగ్గా అల్లా కానీ అయిపోతూంటే చూసి, విని, అవశులై ఊరుకుని, తరవాత మళ్లీ మరీఘాటుగా శాసిస్తూండడం! పోనీ దేనివల్లో ఓదానివల్ల సభవారు ఆనందిస్తున్నారు కదా తగాదా ఏమిటీ అని అడిగితే, ఆపని చేసేవాడు అన్యత్వం సిద్ధింప చెయ్యగల నటుడు అనిమాత్రం అనకుండా ఉండాలి. అనడం మానారా? రమ్మన్నారు. వాడే ఒకటోరకంయాక్టరు, రంగగాయకుడు, రంగనాయకుడు, నాటకరంగడు, రంగపహిల్వాన్ అంటారు. అతణ్ణి, అప్పట్లో, గాయకుడనిమాత్రం గాయకులు అనరు. అల్లాంటి పరిస్థితుల్లో చాలామంది రాగనటులు అన్యత్వారోపణకి శత్రువైన అల్పరాగాన్ని ఆశ్రయించి, నాటకరంగంమీద అన్యాయాక్రమణ చేసి, వివక్షత చెయ్యలేని జనం దగ్గిర్నించి మెప్పులు లాగి, సాహిత్యరాహిత్యం సంపా

దించి, నాటకోద్దేశానికి శూన్యం పెట్టేశారు. కర్మవశంచేత, మొహమాటంచొప్పున, కక్కుర్తికి, ఈ రాగనటులతోసహా రంగం ఎక్కుతూ కొందరు వచన నటులు కాలం గడిపారు. హాస్యాయుధం ఉన్నవాళ్లు మాత్రం నిర్భయంగా బతికారు. వాళ్లకి పద్యాలుండే పాత్రలు సింహస్వప్నమని జనాభిప్రాయం. వాళ్లకి సుందరకుడు, కౌశికుడు, కైరవుడు, ప్రతీహారి, దౌవారికుడు — వంటివి తప్ప ఇతరవేషాలు దొరికేవి కావు. వచననటుడు, రాగనటులమధ్య ఉదయందాకా ఒళ్లు హూనంచేసుకున్నాసరే వాడికి మెప్పూ లేదు, క్షమాపణా లేదు. ఒకవేళ శృతిలో ఉంటూ కాస్తంత ఉచితరాగం కలిపి తేలిస్తే చాలని విమర్శకులు అన్నారుగదా అని పద్యాల పాత్ర తీసుకుంటే, "ఏడిశావ్, దిగరోయ్, వన్సుమోర్ రోయ్" అని, కవనగానాభినయసమ్మేళనాస్వాదన - అన్యత్వం స్వీకరించినవాడిదగ్గిర్నించికూడా - చెయ్యగల నాటకమహాసభ్యులు కేకల్తో సెలవిస్తారు. వాళ్లని అనవలిసిన పనేముందీ! విమర్శకులు వాళ్లకి బాఘా మప్పారు. మప్పి, అల్పరాగపు తాటిచెట్టెక్కించి మొవ్వలో కూచోపెట్టేశారు. అక్కణ్ణించి వాళ్లు దిగరు, వీళ్లు దింపలేరు. పక్కని గవ్వలసుత్తిలాంటి శారీరంతో ఒక రాగనటుడు అదే తిప్పగోడం తిప్పుగుంటూ తన శారీరసంబంధమైన కుస్తీ కసరత్ వగైరాసాధకాల వివరం సభ్యులమీద గుమ్మరించేటప్పుడు, అంతఘాటైన గానవిశేషం అప్పట్లో వినగలవాళ్లకి కాస్తకూస్త 'ఉచిత'రాగాలు చెవికెక్కుతాయా! అందువల్ల భావబోధ చెయ్యగల నటులు పూజానమస్కారాలు లేక రంగంమీద బూజెక్కారు! ఎక్కువ సాహిత్యవాసన గల నటులు జనం తిట్టినాసరే తిట్టుకి ఒడిపట్టి తమ రాగంతో ప్రధానపాత్రలు బలవంతాన ఆడి, "అరసికేషు కవిత్వనివేదనం శిరసి మాలిఖ మాలిఖ మాలిఖ" అని ఒక్కొక్కప్పుడు సభాముఖాన్నే పైకి అనేస్తూ చూపించారు. ఎక్కువ సంగీతవాసన గల నటులు తమ ప్రజ్ఞ చూపెట్టడానికి నాటకరంగంమీద స్థాయిగాని తరుణంగాని సావకాశంగాని లేక, రంగంమీద ఉంటే తమ పరపతి అంతే అనిగావును ఒడుపు కనిపెట్టి రంగంమీంచి నిష్క్రమించి యథాప్రకారపు గాయకులుగా మళ్లిపోయారు; లేకపోతే హరిదాసులుగా మారిపోయారు. కాని, కవనగానాల్ని రెండింటినీ నిలుపుతూ, పామరుల్ని ఆకర్షిస్తూ, భావబోధ ప్రమాణంగా పెట్టుగుని, అన్యత్వం సిద్ధింపజేస్తూ, అన్యప్రాంతాల్లోకి వెళ్లినప్పుడు సంగీతంగురించి చప్పరింపబడ్డా, విజయం పొందిన కొందరేనా రాగనటుల్లో లేకపోడం జరిగితే, అరవైయేళ్ల రాగనాటకరంగం సహారా అయిపోయి, నటించడం అంటే స్వత్వం చంపుకుని అన్యత్వం సిద్ధింపచెయ్యడం అనే అర్థం కూడా ఈపాటికి అందరూ మరిచిపోయిఉండేవాళ్లు. ఆయెడారిలో చలిపందిర్లవంటి (కీ. శే.) హరిప్రసాదరావు, దొరసామయ్యంగారు, నుప్పిడి జగ్గరాజు, యడవల్లి సూర్యనారాయణ—అనే కొన్ని పేర్లు ఈసందర్భంలో మనఃపూర్వకంగా స్మరిస్తున్నాను.

రాగనాటకపు కొత్తరికంలో నటజన్మ మహాకష్టంగా ఉండేది. వీథుల్లో నటుడు వెళ్లేటప్పుడు "వాడు నాటకంలో వేస్తాడ్రోయ్, రాత్రెళ్లు క్షౌరం, స్వంతం!" అని అనుకునేవాళ్లు. "నిజంగా నేటా! వాళ్ల అల్లుడు నాటకాల్లో తిరుగుచాష్టా, హు, కాలం!" అని పెద్దలు ఒక్కొక్కర్ని తల్చుగుని ముక్కుమీద వేలెట్టుగునేవాళ్లు. అనగా, చెయ్యవలిసినవన్నీ చేసేసి, అన్నిందాలా పాడై, ఇంకా పాడవడానికి వేషాల్లోకి కూడా దిగారని రాగనటుల్ని అందరూ నిరసించినా నటనాభిలాష చంపుగోలేక, చాలామంది ఇంట్లో దెబ్బలాడి ఎదిరించేసి లేచిపోయివెళ్లి మసిపూసుగునేవాళ్లు. ౧౯౧౦ తరవాత ఊరికొకంపెనీ అన్నట్టు లేచాయి. కొంచెం ఆస్తికి తోడు కొంచెం పాట కూడా ఉన్న యువకులు, పొలాలమ్మి, సమాజం స్థాపించి, మంచిపీకా మంచిరూపం ఉన్నవాళ్లకోసం తిరిగి ఆడవేషాలకి తెచ్చి, స్థలం కొని, నాటకశాల కట్టి, శాలాప్రవేశ సంతర్పణ చేసి, తెరలు గీయించి, ఇతరచిక్కులు పడి, ఉన్నదాల్లో వేషాలు కుట్టించి, నాటకం ప్రతి రాసితెచ్చుగుని, మళ్లీ మళ్లీ ఆట పూర్వాభ్యాసంచేసి, ప్రదర్శనాలు చేసేవారు. ఇప్పుడు రాబడి వెయ్యిరూపాయలూ, అప్పుడు రాబడి పాతిక రూపాయలూ అయినా నటుల తయారీ, త్రికరణశుద్ధీ అప్పుడే ఎక్కువ అని అంతా ఒప్పుగుంటారు.

సంవత్సరంలోపల వాళ్ల పస ఊరికీ, ఊరిపస వాళ్లకీ తెలిసిపోగా, వాళ్లు గ్రామాంతరాలు లేచిపోయి, చీలిపోయి, అడుక్కుంటూండడమూ—ఊళ్లో వాళ్లు కొత్తవాళ్ల పాట వినాలని చెవికోసుకుంటూండడమూ! అట్లా గ్రామసమాజాలు కొన్నాళ్లు ఉండి, కొన్నాళ్లు ఊగి, కొన్నాళ్లు పడుకుని, మళ్లీ లేచి, మళ్లీ పడుకుని నిద్రపోయాయి. బస్తీనాటకసమాజాలలో ఎక్కువ రాబడి ఉన్నా, రంగపరికరాలకే ఖర్చు మిక్కిలి అయిపోతూండడంవల్లా, ప్రధాననటుల్ని ఒకేసంఘంలో ఆపి ఉంచడంలో ఉండే చిక్కులవల్లా, ఉన్న నటవర్గంలోని అంతఃకలహాలవల్లా, కీ. శే. సత్యవోలు గున్నేశ్వరరావువంటి నిర్వాహకుల యాజమాన్యం లేకపోడంవల్లా అవి ఉండినన్నాళ్లుండి, తిరిగినన్నాళ్లు తిరిగి, వెలిగినన్నాళ్లు వెలిగి గొప్పగా ఆరిపోయాయి. (క్షమించాలి! నేటివరకూ ఏకంగా ఉన్న శ్రీ డి. వి. సుబ్బారావుగారి సమాజంతప్ప!) రాగనటులు మొత్తం మీద మెత్తని హృదయం గలవాళ్లై (లేకపోతే తను అన్యుడైతే చాలని ఎందుకు గోలెత్తుతాడూ!), స్వార్థం మరిచి, ఆర్జించే రోజుల్లో ఒళ్లెరక్క, మామూలుగా తెచ్చినదానికి ఎక్కువగా వెచ్చిస్తూ, చివర చివరకి మొదటిఅవస్థలో పడిపోయినవాళ్లు ఇంకోళ్లులా జీవించగలిగి తనలా జీవించలేకపోయారు. వాళ్లని రంగం మీద చూట్టానికి కళ్లు చించుకుని, వినడానికి చెవులు నిక్కపొడుచుకుని తెల్లవార్లూ అనేక వత్సరాలు కూచున్న ఆంధ్రమహాజనం వాళ్లని మెచ్చుకునేటప్పుడు కూడా తిడుతూ మెచ్చుకునే ఔదార్యం గలవారవడంచేత వాళ్లని మరిచిపోడంలో ఆశ్చర్యంలేదు. ఇక, శీలం అనేది వ్యక్తిపరంగనకనున్నా, ఒకానొక నటుడి శీలాన్ని బట్టి నటశీలం సూత్రించడం మూర్ఖత్వంగనకనున్నా శీలంసంగతి ఎత్తడం అనవసరం. ఒక్కటి మాత్రం అనచ్చు. సగటు రాగనటుడి ఐవేజు ఏమిటీ అంటే, పదిపన్నెండు 'సకాల' రాగాలు — హస్తాంగుళ్యాభరణాలకీ పట్టుచీరా పట్టురవికా సమస్తమున్నూ అంటారే, మామూలునూలో, 'ప్రమాణవస్త్రాని'లో ఇచ్చి—అల్లాగ! అతనికి వచ్చినవే అవి, రావలసినవే అవి, అతడు అభ్యసించేవే అవి, విసిరేవే అవి, మాట్లాడేవే అవి, గోలెట్టి రాగాలెత్తేవే అవి—అంతే. మరి అతడి సరుకు అఖరు! ఆ రాగాలవల్ల పామర జనానికి ఏమాత్రమూ 'హాయి' ఉండదని అనేటంత మూర్ఖత్వం నాకు లేదుగాని, వాట్లవల్ల సగటునటుడు ఎందునా బొందనివాడయాడనిన్నీ, అవి అన్యత్వారోపణకి అర్హుల్ని రంగంమీంచి దూరంచేసి, అనర్హులకి రంగస్వాగతం ఇచ్చాయనిన్నీ, అవి నటుణ్ణి కృషికీ, వృద్ధికీ, కవిత్వానికీ, పాండిత్యానికీ, రచనకీ, అధ్యాపకత్వానికీ విరోధిగా చేశాయనిన్నీ, అవి ఎరుగున్న వృత్తాంతాన్నే మొయ్యగలిగాయిగాని తెలియనిచోటు తెలియనిచోటుగానే ఉంచాయనిన్నీ, అవి ఆకర్షణీయం అయినకొద్దీ స్వత్వాన్నే స్థాపిస్తాయనిన్నీ నానమ్మకం. నేడు ఉన్న రాగనటుల్ని గురించీ, రాగవైముఖ్యంతో వ్యంజకం చేసేవార్ని గురించీ ఎరుగుదుం, చెప్పను. మొదట చెప్పిన పంచకళల్లోనూ నృత్యంలాగే గానంకుడా యక్షగానశకాంతంనాటికే ప్రత్యేకకళ అయిపోయిందిగనక, అదికూడా—తను నటావస్థలో ఉన్నప్పుడు—తనదికాదనుకుని మరి మిగిలిన వేషమూ మాటా అభినయమూ ఇవే తన కళ అని నటుడు గ్రహించుకోవలసిన ఘడియ వచ్చి చాలాకాలం అయింది. అయినా, డబ్బనీ, కక్కుర్తిఅనీ, పండితులు కోప్పడి పామరులు తిడతారనీ, ఏముటో జనాభిరుచనీ, పొట్టకోసం అనీ, లేకపోతే, పాపం, పద్యకవిత్వం చచ్చిపోతుందనీ, ఆ కాసినిరాగాలూ పాడకపోతే ఇహ నాటకమేమిటి నాపిండం అనీ తమాషాసబబులు చెబుతూ రాగనటులు వ్యవహరిస్తారు. వ్యవహరించి, స్వానుభవంవల్ల తమ ప్రత్యేకకళ ఏదో గుర్తించుకుంటారు. రాగశోభ పడలేకా సమాజాన్ని కూర్చలేకా ఒక్కొక్కనటుడు వేషపరివర్తనంమీదే ఆధారపడి తనుగానే ప్రదర్శనం ఇవ్వడం కద్దు. గొప్ప తెలుగువాళ్లు అటువంటి ఏకనట ప్రదర్శనాన్ని దూషణా చెయ్యక పోషణా చెయ్యక వీలునిబట్టి చిత్తగించి రాగహీనం ఐనందుకు సానుభూతి తెలుపుతారు. ఇక, కేవలవచననాటకాలు నటులచేత ఆడబడినప్పుడు నిశ్శబ్దంగా వాటిని సభ్యులు గమనించడమూ, వాటివృత్తాంతం యావత్తూ సభకి అవగాహనకావడం, సందర్భం ఏదేనా ఎంత గొప్పగా ఆడబడినా ఆసందర్భమే మళ్లీ కానిమ్మనడాలు లేకపోడం, నట

వర్ణానికి తరీఫ్ యిస్తూ ఉండడం, ప్రతినటుడికీ తన ప్రత్యేక కళగురించి ఆత్మవిశ్వాసం బయల్దేరడం, ఒకరంగంలోని పాత్రల కలయికవల్ల గాని నాటకప్రదర్శనం నడవ దనే జ్ఞానం అందరికీ గుర్తుండడం — ఇవన్నీ నాటకరంగాన్ని ఆనందబోధ కలిగించే చోటు అని నిరూపించాయి. ఈమాట కీ. శే. ఈమని లక్ష్మణస్వామి గారి నా డెంత నిజమో నేడూ అంతే! ఇవి ఇట్లా జరుగుతూండగానే నిశ్శబ్దచలనచిత్రాలు (మూకీలు) వచ్చాయి. వాటిలో మధ్యమధ్య తెరమీద కథగురించిన అక్షరాలు పడేవి. తెలుగున తీసిన ఫస్టుమూకీ నేను చూడలేదు. మాటేనా లేకుండా కేవలచేష్టవల్ల మాత్రమే భావబోధ చెయ్యగలవాడు గాని అందులోకి ఎక్కడు. రాగం లేకపోతే ఇవతల కవిత్వానికీ, అవతల నటుడికీ ప్రాణాపాయం అని ఆంధ్రవిశ్వాసం గనక, తెలుగు మూకీ లేదు, నటులూ లేరు. కాని, తియ్యబడ్డ కథలు హిందీలో అయితేం ఇంగ్లీషులో అయితేం మూకీల్లోకి ఎక్కిన -తెలుగునటుడు— ఒక్కడంటే ఒక్కడే, నిజంగా మూకీనక్షత్రం — కీ. శే. కొచ్చెర్లకోట రంగారావు! మూకీలని తరుముకుని టాకీలు వచ్చేశాయి. నటులైనవాళ్లు టాకీలోకి పనికిరానట్టు తాను గ్రహించానని శ్రీ బళ్లారి రాఘవాచారి గారు చెబుతూండగా విన్నాను. టాకీలోకి కూడా పనికిరాని మానవు లుండరని ప్రదర్శకుల అభిప్రాయాలవల్ల తెలుసుకున్నాను. టాకీ సశబ్దచలనచిత్రం గనక, ఇందులో మళ్లీ మంచి పీకలక్షణం పనిచేసి, అరవై ఏళ్లల్లో రాగనటులు జరిపిన చర్యలన్నీ ఆరేళ్లలో టాకీనటులు కనపరచి వినపరచడంలో పురాణభక్తి ఘట్టాలూ, సాంఘిక శృంగార సమస్యలూ ఛీదాగా అయిపోయినాయి. టాకీనటుల్లో విశేషజనం హాస్యాస్పదులైనా పలువురు తేరుకుని నిలబడిఉండడం సంతోషదాయకం. యుద్ధకారణంగా తెలుగు టాకీల సృష్టి సన్నగిల్లింది. ఇప్పుడే రేడియో శకంగూడా పుట్టి రేడియోనటులు జనించవలిసొచ్చింది. రేడియో నటుడు అదృష్టవంతుడు, కనపడడు! ఆదెబ్బతో అతడికి వేషం గొడవా, అభినయం గొడవా వొదిలిపోయాయి, గానమూ మాటా మిగిలాయి. మాటకీ కాని ఉచ్చారణకీ తెలుగులో ఖాతరీ ఇంతవరకు లేదు, అది ఒక కళ అని ఎవ్వరూ మన్నించరు. పైగా ఆమాటలు సరికొత్తవాడు చూసి చదవచ్చు. కాబట్టి కేవల "రాగుడు" రేడియోనటుడుగా పేరుపొందగల సూచన్లు ఉన్నాయి. టెలివిజన్ రాగానే రాగనటుల్ని అందర్నీ పునరుద్ధరించి బుక్కుచేస్తారని నమ్మడానికి అవకాశాలున్నాయి. ఇదీకాక, ఉత్కృష్టమైన నవ్యాంధ్ర ప్రదర్శనాలు ఆడబడడానికి హోదా గల రూపక రచనలు జనించాయనిన్నీ, కొన్నికొన్ని ఆడడమే తరువాయనిన్నీ తెలుస్తుంది.

అన్యత్వం ఒప్పించడమే నటన! అది నృత్యమూ గానమూ వేషమూ అభినయమూ కవనమూ అంటూ విశ్లేషిస్తే దొరుకుతుం దన్నమాట కల్లవార్త. అది ఒక ప్రజ్ఞావంతుడి హృదయంలో జనించాలి. అతడికి పాండిత్యమూ, ఒకేకాలంలో అందర్నీ రంజింపజేయాలన్న ఆసక్తీ, శక్తీ, జాలీ వుండాలి. అనగా అతడు మెత్తని పండితుడు కావాలి. ప్రతీ పండితుడూ కవీ, వక్తా, వుపాధ్యాయుడూ కాజాలనట్టుగానే నటుడూ కాజాలడు. కాని, ప్రతీనటుడూ పండితుడై తీరాలి. సాహిత్యనటుడే నటుడనిన్నీ, నాటకరంగమే జనాన్ని బోధించాలి గాని, జనం కోరి నాటకరంగాన్ని బోధించలేరనిన్నీ జనం గ్రహించాలి. నటుడు జన్మపొడుగునా తను ఇంకోడు అవుతూండాలి. రాగనటుల్లో రాజు రాజే, బంటు బంటేలాగ కాక, సార్థకనటుడు కావలిసినట్టు మారగలిగి, రాజై బంటై సన్యాసై రాణై పదవుల సమత్వం ప్రత్యక్షం చెయ్యాలి. ఆంతర్యం ప్రధానం కాని, ఆకారం కాదని నటుడు ఋజువు చెయ్యాలి. నటుడుకంటే స్వార్థత్యాగీ పరార్థపోషకుడూ ఏడీ? తన స్వత్వాన్ని చంపుకుని అన్యత్వారోపణ చేసుకుని కవి కల్పించిన పాత్రయొక్క వ్యక్తిని జనహృదయాల్లో ముద్రించగలిగితే తన జన్మకి చాలనుకొనేవాడు నటుడొక్కడే! వక్తా, వుపాధ్యాయుడూ, నటుడూ వీళ్ల ముగ్గుర్లో బహురమ్యంగా, హృదయరంజకంగా, కళ్లకి కట్టినట్టుగా బోధ చెయ్యగలవాడు నటుడొక్కడే! అన్యవ్యక్తిప్రతిష్ఠాపన చేసే యత్నంలో తనకి సామర్థ్యం లేకపోబట్టి జనం తన్ని హేళన చేసినాసరే, లేనిపోని

బాధలూ, లేనిపోని కష్టాలూ, లేనిపోని బాదరబందీ అంతా తన నెత్తిమీదా, వంటిమీదా, అంతర్యంలోనూ పెట్టుకునేవాడు నటుడొక్కడే! కాలకర్మ సంబంధ సంప్రాప్తాలైన నానారసానుభవాలకి ఆలవాలమైన ఈ మిథ్యాజీవితం జీవింపతగినదే అని అనిపించగలవాడు నటుడొక్కడే! తాను అయథార్థస్థితులు స్వీకరించి, తద్వారా ఆసంగతి ఎరిగున్నవాళ్లకికూడా యథార్థ మనస్థితులు కల్పించగలవాడు నటుడొక్కడే! ఇటువంటి పనే తనకళ అనుకుని పనిచూపించి మన్నన పొందగలడేమో, తెలుగునటుడు !!!

---

# ముహూర్తపు ముప్పు



= శ్రీ రాళ్లపల్లి గోపాలకృష్ణమాచార్యులు =

ఒకానొక స్వదేశ సంస్థానాధిపతియగు మహారాజ పుత్రుని వివాహమహోత్సవ శుభలగ్నసమయమందలి గ్రహస్థితి ఇది:— .

| | | | |
|---|---|---|---|
| గు ౦-౨౫ | X ౯-౦<br>శ ౧౩-౩౧<br>బు ౨౭-౮౭ | వ ౧౮-౧౩<br>ర ౨౩-౮౦<br>కే ౨౪-౬ | శు ౧౮-౩౯<br>కు ౧౭-౩౧ |
| | సాయన గ్రహభావ | | I ౧౨-౨౫ |
| | కుండలి | | |
| చ ౨-౩౯ | రా ౨౪-౬ | | ఇం<br>౧౭-౨౫<br>(వక్రి) |

ఆ'శుభ'దినమున (౯-౨౭ A. M., I. S. T.) వేళలో రాజకుమారియగు వధువు వివాహమంటపమునకు సమస్తవైభవములతో నరుదెంచి వరుని యెదుట నిలుచుటయు,తోడనే పరస్పరసందర్శనపుష్పమాలికాధారణమహోత్సవములును అతివైభవమున నడచినవని వార్తాపత్రికలుద్ఘోషించినవి. ఆ'శుభ'సమయమందు సాయనపద్ధతితో సాధించిన గ్రహస్థితిని, భావస్థితిని పై కుండలి చూపుచున్నది. ఇది (Clock-wise) కుండలియనియు, లగ్నము సాయనకర్కాటకరాశిలో ౧౨ భాగల ౨౫ లిప్తలనియు చదువరులు గుర్తింపఁగలరు.

మనవారు సాధారణముగా నిరాదరణముచూపు నెప్ట్యూను (Nept une), యురేనస్సు (Uranus) గ్రహముల తాత్కాలికస్థితిసైతము పైకుండలి చూపఁగలదు. కేతకరు మొదలగు పండితులు చేసిన నామకరణము ననుసరించి ఆ గ్రహములను ఇంద్రా (ఇ) వరుణు (వ) లనియే నేనును వాడితిని. ఈగ్రహములపై అనాదరము చూపుట లోపమని భావించువారిలో నే నొక్కఁడను. ఇవి లేకయే సర్వఫలములను సాధింపవచ్చునను శాస్త్రిజ్ఞులున్నారని యెఱుఁగుదును. కాని వీనినిగూడ గమనించుట ఎక్కువ ప్రయోజనకారియని నాయనుభవము చూపుచున్నది. అది యట్లుండె.

ముహూర్త జాతక శాస్త్రములకు ప్రాచీనకాలమం దుండినంత గౌరవమర్యాదలును, రాజానుగ్రహమును నేఁటికాలమున మనదేశమున లేనిమాట సత్యమైనను, కొందఱు స్వదేశసంస్థానాధిపతు లింకను ప్రాచీన సంప్రదాయములను అడుగంటనీయక కొంతలో కొంత పోషణము చేయుచుండుట మన యదృష్టము. అర్థ

యును, ప్రశంసలోనున్న మన రాజపుత్రుని వంశ మీ విషయమున చాల ఎన్నికగన్నది. జ్యోతిశ్శాస్త్రవిద్వాంసు లనేక శ్రీవంశమువారిచే మన్నింపఁబడుచున్నారు. వారి విద్యయు పోషింపఁబడుచునే యున్నది. ఇట్టి సందర్భమున రాజపుత్రుని—భావిసంస్థానాధిపతి—యొక్క వివాహమంగళమునకు శుభలగ్నము నిర్ణయించియిచ్చు దైవజ్ఞు లరుదై యుందురా? అంబరాగ్రహారాదిదానములకు కఱవా?

కాని, పైని లగ్నకాలకుండలిని చూచినచో సామాన్యజ్ఞానము కలవారికి సైతము భయమగుచున్నది. చూడుఁడు—లగ్నమునకు కేంద్రములో శుభగ్రహ మొక్కఁడైనను లేఁడు. చంద్రుఁడు షష్ఠస్థానమున నుండుటచే చంద్రబలమును కానరాదు. కాక, చంద్రుఁడే లగ్నాధిపతి యగుటచే లగ్నాధిపతికి షష్ఠస్థితి గలుగుట మఱియును విశేషమే. కళత్రకారకుఁడగు శుక్రుఁడు పాపగ్రహమగు కుజునితో చేరి వ్యయస్థానమున నుండుట గొప్ప లోప మనక తప్పదు. దశమ కేంద్రమున శని యుండుట యొక దుర్గుణము. ఆ శనికి సప్తమాధిపత్యము మాత్రమే కాక రంధ్రస్థానాధిపత్యముకూడ వచ్చుటయు, నీచరాశి స్థితి కలుగుటయు పైదోషమునకు మిక్కిలి దోహదకారకములు. నవమకోణమున బృహస్పతియు, లాభస్థానమున రవి బుధు లుండుట ఈలగ్నమందుఁ గల గుణములని చెప్పవత్తురేమో! గురుదృష్టి లగ్నమునకుఁ గలదన్నచో దాని మోతాదు చాల తక్కువ. అసలు గురువు నవమభావమధ్యమునకు చాల నెడముగా నున్నాఁడు. లగ్నముపై ఈగురువునకుఁ గల దృష్టికన్న దశమకేంద్రమున అత్యున్నత స్థాన మాక్రమించియున్న నీచశనియొక్క దృష్టి బలవత్తరముగా నుండుట గమనించితిమేని, లగ్నమునకుఁ గల సహజ దౌర్బల్యమును మాన్పుటకును, పాపగ్రహదృష్టివలని దోషమును పోఁగొట్టుటకును పై గురుదృష్టి చాలినది కాదని స్పష్ట మగును.

కళత్రకారకుఁడగు శుక్రునకు సంపూర్ణ చతుర్థ కేంద్రమున ఇంద్రగ్రహ ముండుట వివాహలగ్నమునకుఁ గల మఱియొక గొప్ప లోపము. దీని ఫలము పాశ్చాత్య హోరాశాస్త్రజ్ఞులు చాల స్పష్టముగా వ్రాసిరి. ప్రణయ విచారమున ఆదర్శముల నసాధ్యములుగాఁ జేసి అతృప్తి నిచ్చుటయు, భావచాపలమును కల్గించి వైవాహిక సంబంధమును ప్రమాదములపాలు గావించుటయు, అల్పవ్యత్యాసములను గోరంతలు కొండంతలుగా చూపి ప్రేమవిషయమున పరస్పర ద్రోహబుద్ధి తలపెట్టించుటయు, సత్య మసత్యముగా, అసత్యము సత్యముగాఁ దోఁపఁజేసి నైతికమార్గ ప్రవృత్తి కధోగతి తెచ్చుటయు శుక్రేంద్రుల కేంద్రస్థితికి సామాన్య ఫలములుగా వారు వర్ణించిరి. వివాహలగ్నమున కళత్రకారుని కీదుర్గుణము పట్టుటయు, కళత్రాధిపతికి రంధ్రాధిపత్య దోష మబ్బి నీచస్థితి వచ్చుటయు మిగుల శోచనీయములు.

మఱియు చంద్రజామిత్రమున పాపగ్రహమగు కుజుఁ డుండుట యొక దోషము. ఈ కుజుఁడు శుక్ర సంయోగము నభిలషించుచు నాల్గుభాగల దూరమందే యున్నాఁడు. ఇంద్రకేంద్రవర్తిత్వదోషము ఈకుజునకు సైతము కలదు. అనవసరశంకలు, అధార్మికప్రవర్తనము, అనైతికచర్య మున్నగు ఫలములు దీనివి. ఇట్టి కుజునికి శుక్రునితో రానున్న సంయోగము వైవాహికజీవితమున కొక కళంకమును అచిరకాలమున నాపాదింపఁజాలిన దనుటలో ఆశ్చర్యము లేదు.

కాని, సాయనపద్ధతి అశాస్త్రీయ మనియు, నిరయనపద్ధతిప్రకారము నడుచుటయే శాస్త్రసమ్మత మనియు తలఁచువారు పలువు రున్నారని యెఱుఁగుదును. ఏపద్ధతి మంచిదను చర్చతో ఇప్పు డవసరము లేదు. నిరయనపద్ధతితోనైనను పైలగ్నము సాధువన వచ్చునాయనిమాత్రము పరిశీలించినఁజాలును. కేతకర పండితుని 'జ్యోతిర్గణితము' ననుసరించి వివాహలగ్న కాలమునకు అయనాంశములు ౨౨ భాగల ౫౬ లిప్త లగుచున్నవి. ఈ ఆధారమున గుణింపఁబడిన నిరయన గ్రహభావకుండలి యిది:— (౫౬-వ పుట చూడుడు)

శనికి దశమకేంద్రస్థితియు, ద్వాదశభావమున కుజశుక్రసంయోగమును, చంద్రునికి షష్ఠస్థితియు, కేంద్రములో శుభగ్రహాభావమును, లగ్నముపై 'శ్రీపతిపద్ధతి' రీత్యా శనిదృష్టియును ఇక్కడకూడ తప్పలేదు. ఇఁక లగ్నమునకో పట్టరాని మీనవాంశ పట్టినది. పైగా సప్తమాధిపతి యగు గురువు రాహుకేతువుల నడుమఁ జిక్కి తికమకలాడుచున్నాఁడు

మఱియు అంశచక్రమున జామిత్రమున చంద్రస్థితియూ, శుక్రునకు షష్ఠస్థానయోగమును దాపురించినవి. నవమ కోణమున ఒకకోనలో చేరఁగాని గురువున్నూ, ఏకాదశ

| | | | |
|---|---|---|---|
| శ ౨౦-౩౫<br>X ౧౬-౧౨ | బు ౫-౫౨<br>వ ౨౧-౨౧ | ర ౦-౪౪<br>కే ౬-౧౦<br>శు ౨౧-౪౩<br>కు ౨౫-౩౫ | (ల)<br>౧౯-౪౨ |
| గు ౭-౯<br>(వక్రి) | నిరయనకుండలి | | |
| | | | ఇ ౨౫-౨౯ |
| | రా ౬-౧౦<br>చ ౯-౪౩ | | |

భావాంతమున దుర్బలుఁడైన రవియును కలరనుటయే తప్ప వేఱు సుగుణము లేవియును కానరావు. లగ్నమున కేమాత్రమును బలములేదు.

ఇవన్నియు నిట్లుండ నిత్తము. వివాహదినము నకు ముందునాఁడు సోమోపరాగమని కుండలినుండియే చదువరులు గుర్తించియుందురు. ఆదినమున గ్రహణ కాలమధ్యము పగలు ౨-౧౦ P. M. (I. S. T.)లో వచ్చినది. అనఁగా ఈవివాహ'శుభ'ముహూర్తము చంద్ర గ్రహణకాలమునకు తరువాత ౧౯ ఘంటల ౧౭ నిమి షములలో జరిగిన దన్నమాట. ఉపరాగానంతరము వారముదినములు ఏశుభకార్యమును తలపెట్టరాదని శాస్త్రముద్ఘోషించుచుండఁగా సంస్థానపండితోత్త ములు ఈదినమున తమ మహారాజపుత్రుని వివాహ మహోత్సవమున కీలగ్నము నెట్లు నిర్ణయించిరో ఆశ్చర్యజనకముగా నున్నది. ఈ చంద్రగ్రహణము మన దేశమున కానరాని దనుట సత్యము. అగపడని గ్రహణము దానతర్పణాదుల కనవసరమగుటచే మన పంచాంగములలో వ్రాయఁబడనంతమాత్రమున వివాహ లగ్నాదుల విషయమున దానిని గమనింపవలదా!

వివాహదినమునకు రాజపుత్రుని దైనికజాతకము Diennal Horroscope) సాధించినచో దైనిక? లగ్నము వృశ్చిక రిలో ౧౯-వ భాగలో వచ్చును; అనఁగా దైనికజాతకమందలి సప్తమభావము శాత్కా లికరవివరుణుల మధ్యమున నుండును. నాల్గుభాగల దూరములో ఒకవైపు వరుణుఁడు, మఱియొకవైపు రవియు కలిగియున్న నాఁటిదినమున జరిగిన వివాహము నాల్గుసంవత్సరములకాలములోనే ఆ రాజపుత్రుని వైవాహిక జీవితమున గొప్ప తుపాను దెచ్చుటలో నాశ్చర్య మేమున్నది!

రాజపుత్రుని జాతకమున పూర్వపుణ్యసహమము (Part of fortune) తులారాశిలో ౧౩-వ భాగలో కలదు. దానికి సరిగా సమసప్తమస్థానమున (మేషము ౧౩-వ భాగ) శని యుండిన కాలమున నిర్ధరింపఁబడిన యీవివాహలగ్నము రాజపుత్రునకు సుఖము నియ్యఁ జాలునా? వివాహలగ్నకాలపు దశమకేంద్రము శనికి నాల్గుభాగలలో నున్నది. వివాహానంతరము నాల్గుసం వత్సరముల కాలములో వైవాహికజీవితమున రానున్న క్లేశము నిదినైతము సూచింపఁజాలదా?

ఈలగ్నవిషయమున ఇంకను వ్రాయఁదగిన యంశము లనేకములు గలవు. కాని యిప్ప డింత చాలును. చెప్పవచ్చిన దేమనఁగా భావిసంస్థానాధిపతి వివాహమంగళమునకే యిట్టి దోషభూయిష్ఠమగు లగ్నము నిర్ణయించియిచ్చునంతటి అవిచారపరత శాస్త్రజ్ఞులలో నున్నపుడు సామాన్యజనుల వివాహ ముల మాట యేమి? లేదా, సంస్థానమువారికి జ్యోతిష ముపై విశ్వాసము లేక తమ యిచ్చవచ్చిన దినమున ఈవివాహము జరిపిరో! ఈరెంటిలో ఏది సత్యమైనను శోచనీయమే.

ఖండాంతరములవారు జ్యోతిషవిచారమున అపారపరిశోధనలు సలుపుచు దానికి గౌరవము చూపు చున్న యీకాలమున, మన భరతఖండమున, సామాన్య జనుల మాట యట్లుండఁగా, శాస్త్రజ్ఞులనిపించుకొను వారును, విశ్వవిద్యాలయములును, సంస్థానాధిపతులును ఈశాస్త్రవిషయమున చూపుచున్న నిరాదరము చూచి భరింపరానిది. జ్యోతిషమును వేదాంగముగా పరిగణించి గౌరవించిన భారతదేశమునకా యిప్ప డీగతి?

---

# అతిథి

[ కథానిక ]

●

= శ్రీ నెల్లూరి కేశవస్వామి =

"ఒరేయ్ ! ... ఒరెఒరేయ్ !..."

నాక్కలపడ్తోంది.

"ఒరేయ్ ! ...నిన్నేరా పిల్చేదీ..."

ఉలిక్కిపడి లేచాను. ఎదట ఓ వ్యక్తి. అయిదున్నరఅడుగుల ఎత్తు. లాంగ్ కోటు, ధోవతి, సిల్కుకండువా, చేతిలో తోలు పెట్టె, నల్లగా, బొద్దుగా ... ఆవ్యక్తి ప్రత్యక్షం!...ఎవరూ?

"ఇప్పుడేం నిద్దరా" అంటూ సరాసరి ఇంట్లోకి దూరుకొచ్చాడు.

నిలుచున్నవాడిని నిలుచున్నట్టుగానే వుండిపోయాను.

సూటిగా ట్రంకుపెట్టె లున్నచోటికి వెళ్లాడు. అక్కడ తన పెట్టె పెట్టాడు. అక్కణ్ణించి తిన్నగా నాకోటు వున్న చోటికెళ్లాడు. అక్కడ తన కోటూ, కండువా తగిలించాడు. తిరిగొచ్చి నే నింతవరకూ నిద్రిస్తోన్న ఈజీచేర్లో వారిగి ధోవత్తో మొహాన చెమట తుడుచుకుంటూన్నాడు. ఇంతసేపూ నావేపు తిరిగన్నా చూళ్లేదు.

ఇంకా కలకంటూన్నానా?

"నిల్చున్నావేంరా, కూర్చో" అన్నాడు పక్కన కుర్చీ చూపిస్తూ.

మాట్లాడకండా వెళ్లికూర్చున్నాను.

ఈ 'రా' ఏమిటీ? మాఇంట్లో పెద్దవాళ్ళూ, రాజూతప్ప నన్ను 'రా' అని పిలిచేవాళ్లు ప్రపంచంలో మరెవ్వరూ లేరే? మరీయన నాదగ్గిర ఇంతచనువు తీసుకుంటూన్నాడే ? ఎవరీయనా ? ... అసలెవరంటా?

ఇదంతా 'కలయో వైష్ణవమాయయో' అర్థంకాకండావుంది నాకు.

"అదేంరా, అట్టా చూస్తావేం? నన్నెరగవూ?"

ఈయన్నెరుగుదునా? ఎరుగుదునేమో. కాని ఎక్కడ చూశానూ ? ఎప్పుడూ ? ఎక్కడా చూసినట్టు లేదే.

"నేను ప్రసాదరావును కాదుట్రా?"

ప్రసాదరావా ? ఏప్రసాదరావ్ ? నే నెరిగిందల్లా ఒక్క ప్రసాదరావే నే, నాటకాల్లో వేషాలువేసే ప్రసాదరావు. కాని ఆయన ఈయన కాడే. అందులో మొన్నేగా ఆప్రసాదరావు సజీవంగా లైబ్రరీలో అవుపడి నమస్కారం చేశాడు.

"ఇంకా తెలీలేదుట్రా?...పోనీ, మీ అమ్మా అన్నయవాళ్లన్నా జ్ఞాపకమున్నారా?" అన్నాడు విసుక్కుంటూ.

"అయ్యో, వాళ్లు జ్ఞాపకం లేకేమండీ?"

"మరి నేనేవర్రా జ్ఞాపకం లేందీ ?"

అంటే, ఈయనా నాకు అంతటి దగ్గరి బంధు వేన్నమాట. మరీయన్ని నే నెరక్కపోవట మేవిఁటీ ? ఆశ్చర్యం !

"మీ పెద్దన్నయ్యా, నేనూ ప్రాణస్నేహితులం కాదుట్రా ? చిన్నప్పుడు నేనూ అయినా కలిసి గోలీలాడుతూంటే నువ్వు మీ తాతయ్య వొళ్లో కూర్చుని చూసేవాడివి కాదుట్రా? నిన్ను నేను ఎన్నోసార్లు ఎత్తుకుని ఆడించా కదరా ?"

పెద్దన్నయ్య పేరు వినగానే హాడలెత్తింది. ఇంక లాభం లేదనుకున్నాను. ఈయన్ని నేను ఎరిగినా ఎరక్కపోయినా రాజీపట్టమే మంచిదని, బొంకాను: "ఆఁఆఁ, అవునండీ, మరిచిపోయాను. మా అన్నయ్య మీ పేరు ఎప్పుడూ చెబుతూంటాడు."

"ఓరి సీతస్వాద్దియ్యా! ఎంత గోలచేశావురా...మీ అన్నయ్యేగా నా కీఅద్రసిచ్చిందీ. ఇట్లా అని తెలిసివుంటే మహారాజులా మరెక్కడేనా దిగేవాణ్ణే."

"రామరామ! ఎంతమాట. క్షమించాలి. ఏదో పొరబాటున జ్ఞాపకం రాకపోయింది."

"నాకు తెలుసులేరా. నీకూ పట్నం నీళ్లు బుఱ్ఱకెక్కాయి...అబ్బే. ను వ్విట్లా అవుతా వనుకోలేదురా" నామనసుకు చాలా కష్టంవేసింది. నేను "ఇట్లా" అయానని కాదు, ఆయన మాట్లాడే ధోరణి సహించలేకండావుంది.

"మ రిప్పుడు నిద్రపోతూన్నావేఁరా? ఇంకా ఆరన్నా కాలేదే" అన్నాడు ఒక్కసారి విషయం మారుస్తూ.

"మరేంలేదండీ, ఇవ్వాళ ఆఫీసులో కాస్త ఎక్కువ పనుండటంచాత వొళ్లు అసిలినట్టయింది. అట్లావొరిగానో లేదో కునుకు పట్టింది."

"అ.తెరె, మీ రింకా అట్లానే వూచున్నారే. స్నానం చేస్తారా ?"

"ఇప్పు డెవడు చేస్తాడ్రా"

" పోనీ, కాళ్లూచేతులన్నా కడుక్కోండి."

లేచాడు. వంటింటోకి దారి చూపించాను. ధోవతి చేత్తో పట్టుకుని ఠీవిగా నడుస్తూ వంటింటోకి కాలుపెట్టాడు. అడుగు పెట్టగానే గదంతా కలయచూశాడు. తిరిగి నాకేసి చూశాడు. ఆకళ్లల్లో నిరాశ కనుపించింది. మాట్లాడకుండా వెళ్లి కాళ్లూ మొహమూ కడుక్కుని వచ్చాడు. తుండుగుడ్డ అందిచ్చాను. కాళ్లు కుర్చీపైన పెట్టి తుడుచుకుంటూ అన్నాడు: "బ్రహ్మచర్యం ఆచరిస్తూన్నావేఁరా?"

ఆప్రశ్న అంత హాఠాత్తుగా వొచ్చినందుకు కొంచెం కంగారు కలిగింది.

"చిత్తం, ప్రస్తుతం అంతేనండీ"

"ఏఁ?"

"పుట్టింటి కెళ్లిందండీ"

"ఓహోఁఅదా సంగతి? తెలిసింది"

ఏవిఁటి సంగతి? నాకు తెలియం దాయనకేం తెలిసింది? అపోహాపట్టం లేదుకదా?

"వూరకనే వెళ్లిందండీ"

"అంటే ?" అన్నాడు నిమ్మళంగా కూర్చుని నా వేపు ప్రశ్నార్థకంగా తిరిగి.

"వొచ్చి చాలారోజులైందనీ, అందులో వాళ్లఅక్కయ్యకూతురు పెళ్లనీ వాళ్ల అన్నయ్య వొస్తే పంపించాను."

"అదేలేరా అన్నీ కలిసొస్తై. అట్లానే పురుడోసుకొస్తుంది లే."

"అబ్బెబ్బే! అల్లాంటిదేమీ లేదండీ" అన్నాను వెంటనే అందుకుని.

"ఏం?" అన్నాడు బొమలు ముడుస్తూ.

ఏం చెప్పనూ?

"ఏం లేదండీ" అన్నాను పూరుకో లేక.

"అమ్మాయి కాపరాని కొచ్చి ఎన్నేళ్ళయిందిరా?"

ఈఅడ్డునవాళ్లంతా ఏఁవిటీ? నాకు అసహ్యం వేసింది.

"రెండేళ్లు"

"మరీ?"

ఏవిఁటి మరీ, నా శ్రాద్ధం! నడీబజారులో నన్ను మెడికల్ పరీక్ష చేసినట్టుగా వుంది.

"నాకు తెలుసులేరా మీసంగతి. మీరూ పెద్దపెద్దచదువులు చదివి మరీ అన్యాయమైపోతున్నార్రా. దేవుడూ దైవం అంటే మీకు భయంపోయింది. పిల్లలంటే మీకు అసహ్యంకదూ?"

"అయ్యో! ఎందుకండీ?"

"ఎందుకేవిఁటి నాకు తెలీదూ? ఈ పట్నంవాళ్లసంగతి నన్నడుగు చెబుతా. అదేదో బర్త్‌కంట్రోల్ అంటూ వుంది టగా?..."

"రామరామ! చాలా అపోహపడు తున్నారండీ."

"ఆఁ, నాదగ్గిరారా మీఆటలూ?"

ఇంక భరించలేకపోయాను. వెంటనే ధోవతీ, తువాలా తీసుకుని, "స్నానం చేసి వొస్తా" నంటూ గబగబా మెట్లు దిగి పోయాను.

పంపుధారకింద పదినిమిషాలపాటు నిశ్చలంగా కూర్చునికాని మరీ తేరుకోలేదు. అప్పుడు కాస్త వేడితగ్గింది. బుఱ్ఱ పనిచేయటం మొదలెట్టింది.

అసలు పొద్దునే లేచి ఎవరిమొహం చూశానో మరీ కష్టాలకు గురిఅయ్యాను. లేకుంటే, ముక్కూ మొహం ఎరగని ఎవడో వొహడు ఇంట్లోకి దూరుకొచ్చి నా మొహం ముందటే నన్నే చెడామడా తిట్టేస్తూంటే నేను, నేనేమీ అనలేక వాజమ్మలా కూచోటం ఏంఖర్మమూ? నే నేం పాపం చేశానని నా కీశిక్ష, పరీక్ష? బి. యే. పరీక్ష కూడా ఇంత కఠినంగా తోచలేదే.

ఇంతవరకు అతిథులంటూ — పిలిచిన వారూ, పిలవనివారున్నూ — చాలామంది ఈఇంటికి వచ్చారు; మళ్లీ వాళ్లమానాన వాళ్లు వెళ్లిపోయారు. వెళ్లనివారిని నేనూ, సుశీలా కలిసి వుపాయంగా దారిపట్టించాం. కాని వాళ్లల్లో ఎవ్వరూ ఇంతవరకూ నన్ను గానీ, సుశీలనిగానీ పల్లెత్తుమాట అని ఎర గరు కాని ఈయనమాత్రం వచ్చీ రావటమే నన్ను వేపుకుతింటం మొదలెట్టాడే! అస లీయన వచ్చిందే ఇందుకా?

నా ఈపీడ వొదలించుకోటం ఎల్లాగో తోచిందికాదు. ఇల్లాంటి మొండిఘటాలకోసమనే నేనూ, సుశీలా కలసి కొన్ని గోసాయి చిటికెలు తయారుచేసిపెట్టుకున్నాం. కొన్నింటిని ఇదివరకే ప్రయోగించాం. కొన్ని ఇంకా అట్లానే మాహృదయపేటికల్లో సీలుచేయబడివున్నాయి. అందులోంచి ఏది ప్రయోగించినా అతిథి అనేవాడు మళ్లీ ఈజన్మలో మాఇంటిపేరు తలవడని మాకు బాగా నమ్మకం. లేకుంటే, ఈపట్నంచోట ఆ వొచ్చేనలభైఅయిదురూకల్తో అతిథిసత్కారాలు చేస్తూ ఏం బతికేడుస్తాం చెప్పండి?

కాని రెణ్ణెల్లక్రితంమాత్రం కొంచెం కథ అడ్డంగా తిరిగినందువల్ల ఇప్పుడు కాస్త హుషారుగా వుండాలిసివొస్తోంది. ఏం జరిగిందంటే, ఇల్లాంటి ఎరగనిమొహమే ఒకడు మీవూరివాణ్ణంటూ వచ్చాడు. సరేనని ఒకరోజు వుండనిచ్చాం. కాని అల్లాంటి మరి పది, పదిహేనురోజులైతేగాని ఆఘటం కదలనట్టు సూచనలు కనుపించాయి. ఇంకేం? వెంటనే అయ్యవారిని ఉద్వాసన పట్టించాలని నిశ్చయం చేసుకున్నాం. రెండోరోజు సాయంత్రమే మాఅతిథిఎదటే సుశీల నన్నో మాట అనేసింది. దాంతో నే నుగ్రుణ్ణాయిపోయి పెద్దగా అరిచాను. సుశీల వెనక్కు తీయలేదు. నాకంటే పెద్దగా గోలచేసింది. నేను నాలుగు తిట్టాను. అది ఏడ్చుకుంటూ వంటింటోకి వెళ్లిపోయింది. నేనూ వెనకాలే వెళ్లి మాఅతిథికి బాగా వినపడేట్టు నాలుగు చరిచాను. సుశీల పెద్దగా యేడవటం మొదలెట్టింది. ఇల్లా అరగంట నాటకమాడాం. తర్వాత ఈవలికొచ్చి చూస్తే మాఅతిథి తన బిఛాణాతోసహా మాయమైనాడు. ఆ రాత్రి హాయిగా నిద్రపట్టింది.

కాని నాలుగురోజులతర్వాత మా పెద్దన్నయ్యదగ్గర్నించి వోవుత్తరం వొచ్చింది. తన స్నేహితుణ్ణి మేము అవమానపరిచామనీ, అంతగా మాకు గతిలేకపోతే తనకు రాస్తే తానేమేనా పంపించేవాడనీ రాశాడు. నాకు చాలా కష్టమనిపించింది. అప్పట్నించి కాస్త హుషారుగావుంటున్నాం.

మరీయనా పెద్దన్నయ్యప్రాణస్నేహితుణ్ణేననీ, ఇద్దరూ కలిసి గోలీలాడేవారనీ చెబుతూన్నాడే. అంచాతే ఈయనపైన డిసిప్లినరీచర్య తీసుకుందామన్నా తీసుకోటానికి వీల్లేకుండావుంది......

ఇంతలో వెనకాల ఎవరో మెల్లిగా దగ్గినట్టనిపించి, వెనక్కు తిరిగిచూశాను. కొసాఇంటివారికోడలు బిందెతో సహా నిలుచునివుంది. పాపం, ఎంతసేపయిందో వొచ్చి? నేను గమనించనేలేదు. వెంటనే లేచి ఈవలి కొచ్చేసి పొడిగుడ్డ కట్టుకుని, కంగిపోయిన హృదయంతో మెల్లిగా మెట్లెక్కాను.

పైకెళ్లేసరికి అతిథిగారు చూరుకేసి చూస్తూ కూచున్నారు. నేను తిన్నగా వారి దృష్టిని తప్పించుకుంటూ గాలరీలో కెళ్లి నిల్చున్నాను. ఆయనగారు ఏ క్షణాన ఏ బాంబు విసురుతారో అన్న భయంతోనే తల తుడుచుకుంటున్నాను. ఇంతలోకి "ఒరేయ్!" అన్న పిలుపు వినిపించగానే గుండె గుభేలుమంది. మళ్లీ ఏంకొంప మునిగిపోతుందోనని భయపడుతూనే "ఏఁవండీ?" అన్నాను మెల్లిగా.

"ఇది అద్దెకొంపేఁరా?"

"మరేఁవండి."

"ఎంతా?"

"ఏడున్నరండీ."

"వోరిబాబూ! ఏడున్నరే? ఎందుకింతా?"

"పట్నంకదండీ."

"అయితే? ఇక్కడ గోడలు బంగారంతో కడ్తారా?... మనవూళ్లో చూడూ, రెడ్డిగారి బంగళా వుందే అది అయిదురూపాయలకి అద్దెకిస్తామంటే ఎవరూ అడగటంలా."

ఏం చెప్పనూ?

"మరి పట్నంలో ఇంతేనండీ." అన్నాను, మరేం చాతకాక.

"వెధవపట్నమూ, మీరూనూ. మీ కేంరా డబ్బు తగలేయటంమాత్రం వొచ్చు మా పట్నంవాళ్లకి. అందుకే మహాత్ముడే మన్నాడో తెలుసా?"

"నాతో ఏమీ అనలేదే!"

"నీతో కాదురా వెధవాయ్! నీలాంటి సజ్జుకుంకల్తో అన్నాడూ—'వెంటనే పల్లెలకు పొండి, అక్కడే మీకు స్వరాజ్యం లభిస్తుంది!' కాని మీరు వింటేనా? మీకు సోకులూ, టీకులూ కావాలెనాయె, మీ రెందు కింటారూ?..."

ఇంక భరించలేక మొహం తిప్పేసుకున్నాను. మళ్లీ తల తిరగటం మొదలెట్టింది. బోనులో చిక్కిన ఎలికెలా తన్నుకోసాగింది నాహృదయం. ఎటూ పాలుపోలా. కాని ఇది ఆట్టే సాగనివ్వద్దనిమాత్రం నిశ్చయం చేసుకున్నాను. ఏదయితే అదయింది. ఈ శనిమాత్రం విరగడ చేసుకుని తీరాలి. అన్నయ్యకి కోపం వొస్తే తర్వాత మాసుకుందాం.

కాని ఎట్లా? ఎట్లా ఈ మహానుభావుణ్ణి ఉద్వాసన పట్టించటం? నా హృదయపేటికలో దాచివుంచిన గోసాయి చిటికెలు వొక్కొక్కటే తీసి చూశాను. కాని వాటిలో వొక్కటికూడా ప్రస్తుతపు కేసులో సరిపోక పోటం చూసి నా గుండె ఇంకా బేజారై పూరుకుంది.అన్నింటిలోనూ సుశీల సహాయం తప్పనిసరైంది అసలు ఎన్నడేనా ఇల్లా ఒంటరిగా వ్యవహరించాలిసి వొస్తుందేమోన్న ఊహే మా కప్పుడు తట్టనందుకు చాలా విచారం వేసింది. కాని విచారించి లాభం? పోనీ కొత్త దేదేనా సృష్టిద్దామంటే పాలుపోవటం లా.వొద్దని ఎంత ప్రయత్నం చేసినా ఆ మాటలు శూలపోట్లలాగా చెవిలో మారుమ్రోగుతోంది.

కొంచెం సేపటికి ఆయన అకాత్తుగా ఆగాడు. నే నెంతసేపూ ఏఁవీ జవా బివ్వనందుకు నాపైన దయదలచేడేమో. నా మనసు కాస్త శాంతించింది. కాని బుఱ్ఱ మాత్రం పనిచెయ్యటం లా. ఏంచెయ్యాలో, ఎవర్ని ఆశ్రయించాలో పాలుపోటం లా.

ఎదుటింటి అయ్యరుగారి రేడియోలో రాజమ్మ 'మరి వేరె దిక్కెవరయ్యా రామ' కమ్మగా పాడుతోంది. ఆ తియ్యని కంఠాన్ని మింగేస్తూ కింద పంజాబీ హోటెల్ రేడియోలో 'ముల్తానీ' అలాపిస్తోంది. ఆక్షణానికి నన్నూ, నా సంసారసాగరాన్నీ, నాఅతిథినీ అన్నీ మరిచి ఆ ద్వంద్వయుద్ధంలో లీనమైపోయాను.

"ఏఁరా?" అన్న పిలుపు వినబడగానే వులికిపడ్డాను.

"నన్ను చీకట్లోనే కూచోబెట్టావేఁరా?"

పాపం, నిజంగానే అంత చీకటి కమ్ముకురావటం నేను గమనించనేలేదు. వెంటనే వెళ్లి దీపం వెలిగించాను. మళ్లీ గాలరీలో కెళ్లబోతోంటే "స్వయంపాకమేంరా?" అని అడిగాడు.

"అబ్బే, కాదండీ."

"మరి?"

"హోటలా భోజనమండీ."

"హోటల్లో? ఏఁ? నీకు వంట చాతకాదూ?"

"అవుతుందండీ, కాని టైం చిక్కదు."

"ఓరి వెధవా! వంట చేసుకోటానికే టైం చిక్కదురా? మరి నువు వుద్యోగం

చేస్తూంట దేనికీ? పొట్టకోసం కాదూ? నీ పొట్టకు నువ్వు వుడికేసుకోలేకపోతే ఈ వుద్యోగం ఎందుకూ? ఆ కిరస్తానీ కూడు కుడిచి ఎన్నాళ్లు బతుకుతావురా?"

"బ్రాహ్మణహోటలే నండీ."

"ఆంధ్రులా?"

"అబ్బే కాదు, ఆంధ్రు డెవడేనా హోటలు పెట్టి బాగుపడ్డాడండీ?"

"మరి?"

"అయ్యరుహోటలండీ."

"అయ్యర్లూ బ్రాహ్మలూ ఒకటేనా?"

"అదేమో తెలీదు కానండి మొత్తానికి ఆ హోటలు బ్రాహ్మణహోటలే నని బోర్డుపైన స్పష్టంగా రాసుంది."

"ఏం పాడో, ఏంవో. వెధవ అనాచారాలూ మీరూనూ." విసుగుతో తల తిప్పేసుకున్నాడు.

టైం చూశాను. ఏడూ యాభై.

"మొద్దల్లే అట్లా నిల్చున్నావేంరా? మధ్యాహ్న మెప్పుడో భోంచేశానా, మరి ఆకలేస్తోంది."

"అయ్యో చెప్పరేం. హోటలు కెళ్దామంటారా?"

"ఊం సదా. ఏం చేస్తాం, ఖర్మం."

ఇద్దరం బయల్దేరాం.

హోటలు చేరేసరికి సరిగ్గా ఎనిమిదైంది. భోజనందగ్గిర మా అతిథిగారిని ఓ కొత్తరూపంలో చూశాను. అయ్యరుగాడి విసుక్కీ, ఈయనగారి నిదానానికీ సరిపోయింది. వాడిని మరిమరీ అడిగి వేయించుకుని, ఒక్కొక్కటీ రుచి చూసి ఆరగించటం చూస్తే, ఈయనే కొన్ని నిమిషాలకి ముందు అయ్యర్ హోటళ్లని తిట్టాడంటే నేనే నమ్మలేకపోయాను.

నా భోజనం త్వరగానే పూర్తైంది. ఇంతలో వోమూల రాజు కాఫీ సేవిస్తూ కనిపించాడు. వాడిని చూడగానే నా పంచప్రాణాలూ లేచివొచ్చాయి. సాక్షాత్ భగవత్ స్వరూపంలా కనిపించింది వాడి రూపం నా కప్పుడు. వెంటనే లేచి "ఇప్పుడే వొస్తానండీ, మీభోజనం కానివ్వండి" అంటూ ఒక్కగంతులో రాజును చేరుకున్నాను.

"ఒరే బ్రదర్! చాలా ఆపదలో వున్నారా. సహాయం చెయ్యాలి. అయిదే నిమిషాలు" అంటూ వాడిని కాఫీఅన్నా పూర్తికానివ్వకండా వీధిలోకి లాక్కెళ్లాను.

తిరిగొచ్చేసరికి మా అతిథిగారి భోజనం కూడా పూర్తైంది. వెంటనే రెండు కూపన్లు చించిఇచ్చి ఇంటిమొహాం పట్టాం. తోవలో కారాకిల్లీ ఇప్పించాను.

ఇంటికొచ్చాక పక్కలువేయటం దగ్గిర వొచ్చింది పేచీ. వుక్కగా వుంది, డాబాపైన పండుకుందా మంటాను నేను. ఆరుబయట పడుకుంటే నాకు జలుబుచేస్తుంది, గదిలోనే పడుకుందా మంటా డాయన. వొంటరిగా పడుకోటానికిమాత్రం ఆయన కిష్టంలేదు. విసుక్కుంటూ, నన్ను తిట్టిపోస్తూ, మొత్తానికి ఎలాగైతేయేం చివరకు డాబాపైనే పండుకోటానికి వొప్పుకున్నాడు.

నాకు ధూమపాన మేమేనా అలవాటుందేమో అడిగాడు. ఎన్నడూ లేంది ఆరోజే కొన్న గోల్డ్‌ఫ్లేకు ఇవ్వబోయాను. దర్జాగా ధర అడిగాడు. చెప్పాను. దాంతో నాదుబారాఖర్చుకి నన్ను మరోనాలుగుచీవాట్లు పెట్టాడు. కాని ఇంక ఆయన ఏమన్నా వూరుకుందుకే నిశ్చయించుకున్నాను కాబట్టి నామనసు కాట్టే కష్టం కలగలేదు.

పక్క పైన వాలిగి, నిద్రవొస్తూన్నా ఆపుకుంటూ 'వెలుగునీడలు' చదవటం మొదలెట్టాను. ప్రసాదరావుగారు దర్జాగా సిగరెట్ పీలుస్తున్నారు, పిట్టగోడమీద కూచుని.

ఇంతలోకి అంతవరకు గుడ్డిగుడ్డిగా వెలుగుతూన్న స్ట్రీటులైట్లు కాస్తా గప్‌మని ఆరిపోయినై.

"ఇదేవిట్రా?" అన్నాడు ఆశ్చర్యంగా.

"బ్లాకౌటండీ"

"అంటే?"

"ప్రస్తుతం పట్నం సాంతం చీకటిగానే వుంచుతూన్నారండీ"

"ఎందుకూ?"

"చోరీలు బాగా జరగాలని"

"ఏవిటీ? చోరీలా? ... చోరీలేనా నువ్వంది?"

"అవునండీ"

"ఎందుకూ?"

"మరి పోలీసువాళ్లు బతకటం ఎల్లాగండీ"

అది అతని కర్థం అయిందో లేదో. కాని, పాపం, నేను చెప్పిందల్లా నమ్మినట్టున్నాడు.

"అయితే ఈవూళ్లో చోరీలు జరుగుతూన్నాయంటావా?" అన్నాడు, స్వరం తగ్గిస్తూ. ఆకంఠంలో ఏదో భయం తొణికిసలాడింది.

"ఆహా దర్జాగా" అన్నాను నిర్లక్ష్యంగా.

"నిజం?"

"నిజం"

ఒక్క గెంతులో నాదగ్గరి కొచ్చివాలాడు.

"ఏవిట్రా సంగతీ?"

"అబ్బే! మీరు భయపట్టం ఎందుకండీ?"

"భయం కాదురా. అసలుసంగతేంటో చెబుదూ"

"ఏంవుందండీ, పట్నంలో చోరీలు జరగటం మామూలేగా"

"ఈబస్తీలలోకూడా జరుగుతోందంటావా?"

ఆహా"

"ఎప్పట్నించీ ?"

"ఎప్పట్నించేవిటండి, మొదట్నించీనీ. అయినా మూడునెల్లనించిమాత్రం భలే గమ్మత్తైన చోరీ జరుగుతోంది."

"ఏవిటదీ?"

"ఒకాడున్నాడులెండి. వాడికి 'Invisible Thief' అన్న బిరుదుకూడ ఇచ్చారు ఇక్కడి వాళ్లంతా కలిసి. అంటే వాడెవ్వరికీ కనిపించడు. ఇంతవరకూ కనిపించలేదు ఎవ్వరికీనీ."

"మరి?"

"మరేంలేదు. పెట్టెలోని రూపాయలు పెట్టెలోంచే మాయమైపోతాయి, అంతే."

"అయితే దొంగకాదేమోరా, దెయ్యమేమో."

"అబ్బెబ్బే! వాడు మనిషేనండీ. దర్జాగా వుత్తరాలు రాస్తాడుగా. కొందరికి ముందే రాస్తాడు-ఫలానారోజు డబ్బు దొంగిలిస్తున్నానని. కొందరికైతే దొంగిలించింతర్వాత ఆపెట్టెలోనే వుత్తరాలు పెడ్తాడు, మళ్లీ ఎప్పుడు వొచ్చేదీ తెలియజేస్తూ."

"ఇంత నిర్భయంగా చోరీలు జరుగుతూంటే మరి గార్నమెంటువారేం చేస్తున్నారు?"

"బ్లాకౌటండీ"

నాజవాబు వినకండానే దబ్బున కిందికి పరుగుదీశాడు. కాసేపు ట్రంకుల చప్పుడు వినిపించింది. తిరిగొచ్చి, నాపక్కలో కూచుని "ఎట్టారా?" అన్నాడు. అప్పటికే మొహం

పాలిపోయింది. కళ్లల్లో భయం స్పష్టంగా గోచరిస్తోనేవుంది.

"ఏంటండీ?"

"ఇదే. ఈచోరీ విషయమేరా"

"అయ్యో! మీరు భయపడ్తూన్నారా?"

"దొంగ అంటే భయంకాదురా?"

"ఈఇంటి కేం భయం లేదండీ"

"ఏం?"

"మాసంగతి ఇక్కడివాళ్ల కందరికీ తెలుసు. నిన్న కల్లుకారిచిన కుఱ్ఱకుంకకూ కూడా తెలుసు, సాహెబుసంపాదనంతా బూబమ్మకుట్టుపోతకు సరిపోతుందని"

"మీసంగతి అటుంచరా. ప్రస్తుతం నేనున్నాగా?"

"వుంటే ఏం?"

"నీతో దాచట మెందుకూ, నాదగ్గిర కొంత డబ్బుంది రా."

"డబ్బా?... ఎంతమాత్రం?"

"ఏదోలే; ఐదొందలపై చిల్లర వుంటుం దనుకో"

"అయినా భయంలేదండీ"

"ఏమోరా, నాకు భయంగానే వుందీ"

"ఎందుకండీ, మిమ్మల్నెవ్వ డేవడు చూడొచ్చాడూ"

"పెట్టెలోంచి డబ్బు మాయంచేసేవాడికి ఇంతమాత్రం తెలీదురా?"

నేను వూరుకున్నాను.

దాంతో ఆయనగారి భయం స్థిరపడ్డది.

"ఏంవిట్రా వుపాయం?" అన్నాడు, దీనంగా నావేపు చూస్తూ.

నే నింకా ఆలోచిస్తూనేవున్నాను. ఆయనఆదుర్దా మరీ హెచ్చయింది.

"ఏదేనా వుపాయం చూడరా బాబూ. నన్ను రక్షించవూ?"

"అయితే వోపని చేద్దామండీ" అన్నాను. ఆయనమొహం ఒక్కసారి వికసించింది.

"ఈదొంగ వున్నాడే, వాడో హాగమ్మత్తైన మనిషని ఇదివరకే చెప్పాగా, డబ్బంతా వొక్కసారి దొంగిలించడు. వంతులప్రకారం తీసికెళ్తాడు. మొదటిసారి ఐదోవంతుకంటే ఎక్కువ దొంగిలించడు."

"అదేవిటీ?"

"అట్టా వాడి పద్ధతి... అంచాత మీరు పెట్టెలో కొంతడబ్బుమాత్రం వుంచి తక్కింది ఇంకెక్కడేనా దాచెయ్యండి."

"వాడి కంతమాత్రం తెలీదురా?"

"అబ్బే, వాడొట్టి ట్రంకు దొంగ మాత్రమేనండీ."

"అంతా దాచేస్తే?"

"అమ్మో, పసిపట్టేయగల్డు."

"అయితే పెట్టెలో ఎంత వుంచమంటావ్?"

"మీ ఇష్టం."

"చెబుదూ"

"వో యేభై వుంచండి."

"అబ్బో! పదిరూపాయలు మాయమవుతా యన్నమాట."

"అన్నమాటే"

"అంతకంటే తక్కువైతే"

"ఏంలేదు, వాడు ఆకాస్తా వొక్కసారే పట్టుకెళ్తాడు."

"సరే సరే. యేభైయే పెడ్దాం" అంటూ లేచివెళ్లి పెట్టె తీసుకొచ్చాడు. పెట్టె తెరిచి అందులోంచి నోట్లకట్ట తీసి, పదిరూపాయల నోట్లు అయిదుమాత్రం అందులో వుంచి, తక్కినవి చేతిరుమాల్లో కట్టాడు.

"ఎక్కడ దాద్దాం?"అని అడిగాడు.

"ఎక్కడెందుకూ. మీ తలకిందే పెట్టుకు పడుకోండి."

కొంచెంసేపు ఆలోచించి, లేచి పెట్టికి భద్రంగా తాళం వేసి, దాన్ని యథాస్థానాన్నే వుంచి వొచ్చి తన చొక్కా వేసుకుని, జేబులో నోట్లకట్ట పెట్టుకుని వెళ్లి పక్కపైన బోర్లగిలా పడుకున్నాడు. ఇంక నాతో వొక్కమాటా మాట్లాడలేదు. నేనూ వొరిగాను.

తెల్లవారుఝామున నన్నెవరో తట్టి లేపితే ఉలిక్కిపడి లేచి కూర్చున్నాను. ఎదట ప్రసాదరావుగారు ప్రత్యక్షం, బిక్కమొహంతో.

"ఏఁవిటండీ, ఏఁవిటి?" అని అడిగాను ఆదుర్దాగా.

"అయిందిరా" అన్నాడు హీనస్వరంతో.

"ఏఁవిటయిందీ!"

''పదిరూపాయలూ మాయమైనై.''

"ఆఁ?...నిజంగా?"

"ఇదిగో" పక్కనే తెరిచివున్న పెట్టిలోంచి వో చిన్న చీటీముక్క తీసిచ్చాడు. కళ్లు నులుముకుని చదివితే అందులో ఇల్లా వుంది: "మళ్లీ రేపు."

నేను మాట్లాడకండా కూచున్నాను.

"ఒరేయ్, మావూరి బండెప్పుడో తెలుసా?"

"మీరు వెళ్తారా?"

"ఇంకా ఏం చెయ్యమన్నావ్?"

"అయ్యో, ఒక్కరోజన్నా వుండకండా."

"ఇది చాల్దూ? ఇంకానా? ... ఒరే బాబూ! నన్నీపట్నంనించి బయటపడేశావంటే నీకు చాలా పుణ్యముంటుందిరా. నీమే లెప్పటికీ మరవను. ఇంకలే"

"సరే. మీరు ముందు స్నాన మదన్నా చెయ్యండి."

"బతికి బయటపడితే అన్నీరా. నువ్వులే. ఇంక మాట్లాడకు" నారెక్క పట్టి లేపాడు.

మాట్లాడకండా కిందికి వెళ్లిపోయాను. కాల్యకృత్యాలు తీర్చుకుని వొచ్చేసరికి ఆయనగారు కోటు వేసుకుని సిద్ధంగా వున్నారు.

"పోనీ ఫలహారమన్నా చేసి వెళ్లరూ, ఇంకా చాలా టైముంది."

"నువ్వు ముందు స్టేషనుకి నడవరా బాబూ! ఈపట్నంనించి బయటపట్టం ఎప్పుడెప్పుడా అని నాకుంటే ... మరీ జన్మలో పట్నంపేరు తలవనురా బాబూ!"

బయలుదేరాం. తోవలో ఒక్కమాటా లేకుండానే స్టేషను చేరుకున్నాం. బండి రావటానికి అప్పటికింకా చాలా టైముంది. నా బలవంతంపైనే ఆయన అక్కడే మొహం కడుక్కుని, నాలుగు ఇడ్లీలూ, కప్పు కాఫీ సేవించాడు.

సరిగ్గా తొమ్మిదిన్నరకి రైలొచ్చింది. పెట్టెలో కూచున్నాక ఓ పెద్ద నిట్టూర్పు విడిచాడు.

"మీ రిట్టా వెళ్లిపోటం నాకు చాలా విచారంగా వుందండీ. అసలు నేనేమీ చెయ్యలేకపోయినందుకు నాకు సిగ్గువేస్తోంది"

"ఒరే అబ్బాయ్! నువ్వు అట్టా ఏమీ అనుకోకు. నీమేలు నే నెప్పటికీ మరిచి పోలేను."

రైలు కదిలింది.

స్టేషను దాటి ఈవలి కొచ్చేసరికి ఎదురుగా హాజరయ్యాడు రాజు, చిరునవ్వుతో.

"ఏం?" అన్నాడు.

"ఓకే" అన్నాను.

వెంటనే వాడు నాచెయ్యి పుచ్చుకుని రాయల్ హోటలులోకి దారితీశాడు. గబగబా ఆర్డరు ఇవ్వటం మొదలెట్టాడు.

నేను మెల్లిగా పర్సుతీశాను. అందులోంచి వో పదిరూపాయల పాతనోటు తొంగిచూసింది.



# భారతీయ విజ్ఞానము: ఆంధ్రాభ్యుదయసూచనలు*

= శ్రీ శౌంరి వెంకటరామమూర్తి =

### ప్రాచీన భారత విద్యాపీఠములు

విశ్వవిద్యాలయప్రతిష్ఠాపనము భారత దేశములో అత్యంత పురాతనమైన సంస్థ. ప్రాచీన బౌద్ధుల నాటి నలందా విద్యాపీఠము, తక్షశిలా విద్యాపీఠము యూరోపుఖండములో క్రీస్తుశక మధ్య శతాబ్దులయందు వెలసిన విద్యాపీఠముల రకములోనివి. నేటి ఆక్స్ఫర్డు విశ్వవిద్యాలయమును, కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయమును ఆ నాడేర్పడిన విద్యాపీఠములే. కాని, బౌద్ధయుగము నాటి విద్యాపీఠములకంటె పూర్వకాలమున భారత దేశములో మునిజనశరణ్యములైన యరణ్యములందు అనాదిసిద్ధమైన విద్యాసంస్థలు తొలుదొల్త ఏర్పడెను. అచట జ్ఞానోపాసకులైన కొందరు గురువులు జ్ఞానపిపాసువులైన యువకులకు ఉపదేశములు చేయుచుండెడి వారు. కాబట్టి విద్యాపీఠము లనబడునవి—అప్పుడు గాని, ఇప్పుడుగాని—ప్రత్యేక మొక్కొక్క గురువుచే నెలకొల్పబడిన గురుపీఠములైనను, లేదా పండితబృంద సమన్వితములైనను అవి ముఖ్యముగా విజ్ఞానసంస్థలుగా నున్నవి. అవి బుద్ధిబలమును కేంద్రీకరించెడి జ్ఞాన పీఠములు. ఉపనిషత్తుల కాలమందు జిజ్ఞాసువులైన వారు మానవబుద్ధికిని, జడప్రకృతికిని అతీతమైన అంతర్గతమైన పరమాత్మతత్త్వమును గ్రహించుటకై కృషిసల్పియుండిరి. కాని, బౌద్ధయుగములో బుద్ధీంద్రియ వ్యాపారమును, జడప్రకృతితత్త్వమును మాత్రమే గ్రహించుటకు కృషిసల్పియుండిరి. నేటి ఆధునిక విశ్వవిద్యాలయములందు బుద్ధిబలమువల్ల మానవులు భౌతిక ప్రకృతిని నిగ్రహింప నేర్చుకొనుచున్నారు. ఈరీతిగా అన్ని దశలలోను బుద్ధిబలమునే సాధనముగా గ్రహించియున్నారు. కాని, తత్త్వజిజ్ఞాసలో మాత్రము ఆది కాలమున పరమాత్మస్వరూపమును పరిశోధించుటకు విద్యాపీఠములు పూనుకొనెను. అటుపిమ్మట మానవ బుద్ధిబలమునే శోధింపసాగెను. అటుపిమ్మట ప్రకృతి పరిశీలనకు దిగెను.

### ప్రాక్పశ్చిమ విజ్ఞానాల సంగమస్థానము

భారతదేశములోని యితర విశ్వవిద్యాలయములకు వలెనే ఆంధ్రవిశ్వవిద్యాలయమునకు గూడ సహజ నైజ ప్రాభవము, నూతనపరికల్పిత సంప్రదాయమును కొంత కలదు. భారతీయ విజ్ఞానమునకును, యూరోపియను విజ్ఞానమునకును భారతదేశము నేడు సంగమ స్థానముగానున్నది. కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయ ప్రముఖు

---

* మొన్న డిసెంబరు ౧౧-వ తేదీనాడు గుంటూరులో జరిగిన ఆంధ్రవిశ్వవిద్యాలయ స్నాతకోత్సవములో నూతన పట్టభద్రులకు శ్రీ శౌంరి వెంకటరామమూర్తి పంతులుగారు గావించిన హితోపదేశము.

పోకడు వివిధదేశ విజ్ఞానవికాసములను పరిశీలించు నిమిత్తమై భారతదేశమును, చైనా దేశమును, జపాను దేశమును సందర్శించియుండెను. అతడు పరిశీలన చేసిన పిమ్మట చెప్పిన ముఖ్యవిషయ మొకటి కలదు. పాశ్చాత్య నాగరికత యనియు, ప్రాచ్యనాగరికత యనియు చెప్పబడు విభేదము కనిపించుటలేదు గాని, భారతీయనాగరికత యనియు, తక్కుంగల ప్రపంచనాగరికత యనియు రెండురకముల విజ్ఞానవికాసములు స్పష్టముగా కనిపించుచున్నవని ఆయన తెలియజేసియున్నాడు. సుప్రసిద్ధ గణితపండితుడును, తత్వవేత్తయు నగు డా॥ వైటుగారు సుమారు ౨౦ సం.ల క్రిందట నాతో ఒక్క విషయమును చెప్పియుండిరి. "ప్రపంచ భవిష్యదభ్యుదయము యావత్తు భారతదేశముచేతులలోను, చైనా దేశముచేతులలోను ఉన్నది. జపానుగాని, టర్కీగాని అనుచరులవలె వెంటరావలసినవే కాని, నాయకత్వము వహింపజాలవు." ఇటీవల ఒక అమెరికను విమర్శకుడు చెప్పిన విషయముకూడ గమనింపదగియున్నది. "జపానువారికి బుద్ధి చురుకైనదే కాని, వారు లోతుగా ఆలోచించరు. చైనావారిబుద్ధి అనేక విషయములను లోతుగా ఆలోచించగలదు గాని, నిదానముగా పని చేయును. కాని, భారతీయుల బుద్ధి లోతైనది, చురుకైనది."

## భారత దేశము - నూతనవ్యవస్థ

ఈ యుద్ధానంతరము ప్రపంచమంతయు నూతన సంకలన సంయోగములతో నూతనపరిపాకము జెందనున్నది. అట్టి నూతన ప్రపంచవ్యవస్థకే సంగ్రామము దారి సరిచేయుచున్నది. భారతదేశము నేడు ఆర్థిక దైన్యములో, సాంఘిక స్పర్ధలలో, రాజకీయ దురవస్థలలో మునిగియున్నప్పటికిని భారతీయుల కనుభవైకవేద్యమైన పరిపక్వమైన ఆత్మవిజ్ఞానసంపదవల్ల అధమపక్షము చైనాతో సరిసమానముగా ఆసియాఖండము తరఫున నడుముకట్టుకొని నిలువబడి యూరోపుఖండానికిని, అమెరికాఖండానికిని భారతదేశము ఎదురు జవాబు చెప్పగలదు. అట్టి నూతన ప్రపంచవ్యవస్థ యీ సంగ్రామానంతరము రానున్నది. అదియునుగాక, భారత దేశమునకు ఇంగ్లాండుతో సంబంధ మేర్పడియుండుటవల్ల, యూరోపుతో సన్నిహితసంబంధముగల రాజ్యము ఆసియాఖండములో ఇది ఒక్కటే. కాబట్టి ఈ రెండు విజ్ఞానవికాసములయందును భారతదేశము ఉభయ ప్రవీణముగా నున్నది. ఆసియాఖండ వైఖరిని, యూరోపుఖండ వైఖరిని అనుసరించి ఉభయ విజ్ఞాన సమ్మేళన మొనర్చెడి దేశముగా ఇది వెలయుచున్నది. ఇట్టి పరిస్థితి ఏర్పడుటవల్ల భారతదేశ విద్యాపీఠములకు అపూర్వమైన అవకాశములును, అపూర్వమైన కార్యభారములును ఏర్పడుచున్నవి.

## ఆత్మతత్వము

మన దేశమందు తొల్లిటి ప్రాచీనతత్వజ్ఞులు శ్రద్ధగా పరిశీలించిన విషయమును మరొక్కమారు ప్రస్తావించెదను. దృగ్గోచరముగాని ఆత్మతత్వమును వారు పరిశీలించియుండిరి. ప్రకృతిలోని మార్పులు ఏపద్ధతిగా, ఏవిధముగా ఎట్లుజరుగుచున్నవను విషయపరిశీలనతో వారు తృప్తిచెందలేదు. వారు ఆ విషయపరిశీలన నధిగమించి, ఇంకను లోతుకు పోయి, ప్రకృతిపరిణామము జరుగుటకు మూలకారణ మేమియని పరిశీలింప సాగిరి. ఎట్లు జరుగుచున్నదను విషయము గాక, ఎందుకు జరుగుచున్నదను విషయమును పరిశీలింప సాగిరి. వారి కృషి వ్యర్థముకాలేదు. ఇంద్రియగోచరమైనదానికిని, ఇంద్రియముల కగోచరమైనదానికిని గల పరస్పరసంబంధసూత్రమును "ఆత్మయే బ్రహ్మ" మను వాక్యములో క్రోడీకరించిరి. మానవుడు సాధించిన ఉన్నత విజ్ఞానపంక్తిలో ఆ బ్రహ్మసూత్రము బ్రహ్మాండమైన మహోన్నత శిఖరమువంటిది. జడాత్మకమైన బుద్ధి తన కనురూపమైన జడప్రకృతిని మాత్రమే గ్రహించుటలేదు. బుద్ధికి, ప్రకృతికి మూలకందముగా వెనుకనున్న పరతత్వమునుగూడ మానవబుద్ధి గ్రహింపగలదు. ఇట్టి ఆత్మతత్వపరిజ్ఞానమునందు చైనాదేశము కూడ భారతదేశముకంటె వెనుకబడియున్నది. నేను చైనావారి దేవాలయములను, భారతదేశమందలి దేవాలయములను కూడ చూచితిని. ఉభయుల దేవాలయముల మీదను విశేషమైన శిల్పచాతుర్యము కనిపించుచుండును. చైనావారి ఆలయములమీద మనుష్యులు, మృగ

ములు, పువ్వులు, కాయలు, కొండలు, నదులు మొదలైన బాహ్యప్రకృతిప్రదర్శనమే కనిపించుచుండును. కాని, భారతీయుల దేవాలయములపై అగోచరమైన ఆత్మతత్వము ప్రదర్శింపబడుచున్నది. భారతదేశము నశించిన ప్రపంచము వికృతమైపోగలదు. అట్టిప్రపంచ వైకల్యమును ఆసియాఖండముతరఫున చైనా పూనుకొని తొలగింపజాలదు. కాబట్టి భారతీయ యువతీయువకులకును, ఆంధ్రయువతీయువకులకును నేను విన్నవించెడి విషయ మేదనగా, ఎన్నడో ఏ మూడువేల సంవత్సరములనాడో భారతదేశము చేబట్టిన పరతత్వ పరిశోధనను అంతరించకుండ కాపాడవలసియున్నది. భారతజాతియందు ఆ విజ్ఞానబీజము లింకను సజీవముగా నున్నవి. మన జాతీయ విశిష్టతాస్ఫురణ మనలో కొందరి కింకను రక్తగతమైయున్నదనియే నా నమ్మకము.

## భారతీయులు-
## గణితశాస్త్రము

ముప్పది సంవత్సరములనుండి నేనుకూడ ఈ జ్ఞానాన్వేషణ చేసితిని. నేను అవలంబించిన సాధన పద్ధతి గణితశాస్త్రపద్ధతియైయున్నది. సాధారణ లోకజ్ఞానమునకును, వేదాంతమునకును మధ్యనున్న వంతెన వంటి దీ గణితశాస్త్రము. అతినిగూఢమైన విషయములకును, తేటతెల్లమయిన విషయములకును మధ్యనుండు వంతెన ఇది. నిత్యమైనదానికిని అనిత్యమైన దానికిని మధ్యనున్న వంతెన ఇది. జీవితసరోవరములోని అగాధమైన అంతర్గర్భములోనుండి ఆవిర్భవించిన పద్మము ఈ గణితశాస్త్రము. సరోవరగర్భమందలి అగమ్యగోచరమైన బురదలోని సారమే వన్నెలు చిన్నెలు గల పొంకమైన పువ్వుపై పరిమళించుచున్నది. మన నిత్యకృత్య జీవితకాసార వీచికలపై తేలియాడుచున్న పువ్వు మీ గణితశాస్త్రము. "ఒకటితో ఒకటి చేర్చినయెడల రెండు అగు" నను విషయము మహత్తర తత్వపరిశోధనాఫలితపర్యవసానమైయున్నది. అంతటి మహత్తరవిషయముకూడ వ్రాయను చదువను నేర్చుకొనెడి చిన్నబిడ్డకు వెన్నతో బెట్టిన విద్యగా నున్నది. గణితశాస్త్రములోని సున్న (శూన్యము) అనగా నెట్టిదో మొట్టమొదట దాని నిజతత్వమును గణించి గ్రహించినది భారతీయులే. ఋణాంకమనగా నెట్టిదో తొలుదొల్త నిర్ణయించినది భారతీయులే. గణితశాస్త్రమునకు ఇవి మూలకందములైన ప్రాతిపదికరహస్యములు. రేఖాగణితములోని కొలప్రమాణములకు ప్రాణాధారమైన అనిశ్చిత క్లిష్టాంకమును యూరోపియనులు కనిపెట్టిరి. ఇటీవలి కాలములో భారతీయ విజ్ఞానసంపదను, యూరోపియను విజ్ఞానసంపదను సమన్వయించుటకు కృషి జరుగుచున్నది. అన్యోన్యాశ్రయవాదులకు నాయకులైన ఎడ్డింగుటనుగారును, జోన్సుగారును ఇంద్రియగోచరమైన దృశ్యత సత్యమైనదో, ఇంద్రియాతీతమైన అగోచరతత్వముకూడ అంతటి సత్యమైనదే యని అంగీకరించియున్నారు. ప్రత్యక్ష ప్రమాణములచే భౌతికశాస్త్రజ్ఞుడు అనుభవైకవేద్యముగా గ్రహించెడి వస్తుతత్వమును ఏవిధముగా సత్యమని అంగీకరించుచున్నారో, యోగవిద్యలచేత యోగియైనవాడు పొందెడు ఆత్మజ్ఞానానుభవముకూడ సత్యమైన విషయముగా అంగీకరించవలసినదే అన్నారు. కనుక మానవుని అంతర్దృష్టి ప్రభావమును పరిశోధించుటకుగూడ భౌతికశాస్త్ర సాధనమార్గములను వినియోగించవలెనని విశదీకరించియున్నారు. యోగిపుంగవులైనవారు కొన్ని రూపములను, మూర్తులను కల్పించుకొని ఉపాసన చేయుటవల్ల తద్వారా వారి కొక స్థిరమైన అంతర్దృష్టి ఏర్పడగలదని ఎడ్డింగుటను సూచించియుండెను.

## కాలస్వరూప
## తత్వము

కనుక మానవుని ఆత్మానుభవమునకును, ప్రత్యక్ష బాహ్యప్రపంచమునకును మధ్య సంధానసాధనముగా వారధులను నిర్మించుట సాధ్యమనియే నేను విశ్వసించుచున్నాను. బాహ్యప్రకృతిపరిశీలన చేయునప్పుడు దేశ, కాల, వస్తువు లనెడి మూడు తత్వములను త్రివర్గముగా విభజించినంతమాత్రమున నాకు సంతృప్తి లేదు. ఈ విశ్వమునందు బుద్ధియనెడి మరొక నాలుగవ మూలతత్వముకూడ విశిష్టమైయున్నది. మన బుద్ధిచేత పరికల్పితమైన ఆత్మప్రపంచ మొకటి కలదు. ఇది కాక

దేశకాలద్రవ్యపరిశిష్టమైన బాహ్యప్రపంచమునుకలదు. ఈ రెండింటితో కూడిన యీవిశ్వము నాకు చిరకాలము అగమ్యగోచరమైన మహారణ్యముగా కనిపించినది. ఈమహారణ్యములో నేను ఏకాకినై చరించితిని. నాకీ ఏకాంతమే ఆనందదాయకముగా ఉన్నది. ఈ మహారణ్యములో నాకు ఇటీవల ఒక జ్ఞానాంకురము లభించినది. దానిని ఈ సందర్భములో మీకు వివరింపగోరుచున్నాను. అనేక యుగములనుండియు మనము కాలస్వరూపతత్వమును గూర్చి జిజ్ఞాస చేయుచుంటిమి. కాల మనంత నిరంతర ప్రవాహమనియు, అవిచ్ఛిన్నమైన ఏకముఖ పరిగణనాత్మక మైన దనియు మనము భావించుచుంటిమి. అంతకు మినహా గా మరొకరీతిగా కాలస్వరూపమును మన మూహించియుండలేదు. బాహ్యప్రకృతిలో లయబద్ధమైయున్న కాలస్వరూపమునే మానవుడు గ్రహించుచున్నాడు. కాని, దానికి ప్రతిరూపముగా మానవునియందు అంతర్గతమైన లయజ్ఞానము తేనియెడల బాహ్యప్రకృతిలోని కాలస్వరూపముయొక్క లయస్ఫురణ మానవునకు కలుగజాల దను విషయమును మనము గ్రహించుట లేదు. ఒక గదిలోని నేలచప్టాయొక్క నిడివిని మనము గ్రహించునప్పుడు దానితో అవినాభావ సంబంధము గల వెడల్పు ఏరీతిగా అన్యోన్యాశ్రితమైయున్నదో అదేవిధముగా బాహ్యలయస్ఫురణకు అంతర్లయజ్ఞానము ఆధారభూతమగుచున్నది. కాబట్టి కాలస్వరూపమునకు ద్విముఖమైన పరిగణనము కలదని నేను కనిపెట్టి ఈ క్రొత్తవిశేషమును మీకు నివేదింప సాహసించుచున్నాను. ఇది ప్రత్యక్షవిషయముగా నాకు కన్పించుచున్నది. దీని నొక శాస్త్రసిద్ధాంతముగా మీకునివేదించుచున్నాను. ఇది వేదాంతులకును, గణిత శాస్త్రజ్ఞులకును, యోగిపుంగవులకును మాత్రమే అక్కరకు వచ్చెడి సిద్ధాంతము కాదు. సర్వసాధారణ సామాన్య మానవులందరికిని అక్కరకువచ్చు సిద్ధాంతమైయున్నది. అనంతమైన ఈ కాలప్రవాహములో మనము చచ్చుచు బుట్టుచు చర్వితచర్వణముగా ఇంకను ఎన్నిమార్లు తిరిగి జన్మించవలెనో! ఈ అనంతజన్మ పరంపరాకలితమైన కాలజలధికి ఆవలియొడ్డు ఎక్కడున్నదని భారతీయులమైన మనము ఎంతకాలమునుండి వెతకులాడుచుంటిమో గదా! అపార పారావారమైన యీ సంసారమును తరించి ఎన్నటికైన గట్టెక్కగల్గినచో ఎంతబాగుండును! ఆకాలజలధికి ఆవలిగట్టు నిజముగానున్నది. ఎందుచేత ననగా, కాలము ద్విముఖపరిధి గలదై యున్నది. రెండు ముఖముల విస్తరించిన ఆ కాలపరిధి కాలప్రమాణము లేవి యని మీరు అడుగవచ్చును. అందుకు సమాధాన మతిసులభము. అవేవనగా, అంతర్ముఖకాలమును, బహిర్ముఖకాలము, బాహ్యప్రకృతిలో విశ్వవ్యాప్తమైన కాలములయబద్ధమై తాండవించుచున్నది. అది లయబద్ధమై గోడగడియారములో తిరుగుచున్నది. ఏఘటికాయంత్రమైననూ లయబద్ధమైన దే. ఒకగడియారములో కాలము మారుచు ముందుకు నడచుచుండిన అదే లయప్రకారముగా అన్ని గడియారములలోను కాలము నడచుచుండును. కాని, మానవుని ఆత్మానుభవములోని కాలగతి ఆరీతిగా ఉండదు. బాహ్యప్రకృతిలోని కాలవ్యవధులకును, మానవుని స్మృతిస్ఫురణలోని కాలవ్యవధులకును చాల భేదము కలదు. కాబట్టి మానవజీవితవిధానము ఈ రెండువిధములైన కాలక్రముల లయవిధానముల ననుసరించి ప్రస్తార మగుచుండును. బాహ్యప్రకృతిలోని లయవిధానమును, మానవుని అంతస్ఫురణలయవిధానమును అనుసరించియుండును. భౌతిక లయప్రకరణమును, మానసికలయజ్ఞానమును అనుసరించి మానవజీవిత ముండును. మన జీవితపీతాంబరమును నేయుటకు భౌతిక ప్రకృతిలోని కాలస్వరూపము పడుగునూలువంటిది. మానవుని స్మృత్యంతర కాలస్ఫురణ పేకనూలువంటిది. కాబట్టి కాలస్వరూపము జీవియొక్క లయబద్ధమైన ఆత్మగతి. అది ద్విముఖ పరిగణనము కలదై యున్నది.

## భౌతికశాస్త్ర

## పరిజ్ఞానము

ఇక బాహ్యప్రపంచ పరిశీలన విషయమై ప్రస్తావించెదను. జడప్రకృతిసిద్ధమైన యీ భౌతికప్రకృతిని గూర్చిన శాస్త్రజ్ఞానము భారత దేశములో చాల అభివృద్ధిజెంది వికసించి మన కది పూర్వార్జితముగా సంక్రమించినది. అంతకంటె ఎక్కువగా మన కీ భౌతికశాస్త్రజ్ఞానము బ్రిటిషువారి

మూలముగా యూరోపుఖండమునుండి లభించినది. గత శతాబ్దములో ఈ భౌతికశాస్త్రజ్ఞానము మానవ జీవిత విధానమును పూర్తిగా తారుమారు చేసినది. ప్రకృతి రహస్యములను ఎక్కువ గూఢముగా, గాఢముగా అవగాహన చేసికొనుటవల్ల విశేషమైన యీ మార్పు సంభవించినది. ఈ ప్రకృతిరహస్యజ్ఞానము నిరంతరముగా ప్రత్యక్షానుభవ వినియోగములోనికి తీసికొనిరాబడినది. మన కీ యుద్ధకాలములో అలభ్యముగా నున్నట్టియు, నాగరిక ప్రపంచములో మనము అనుభవించుచున్నట్టియు అనేక జీవితసుఖ సౌకర్య సాధనములు ఇటీవల లభించిన యీ భౌతికశాస్త్ర పాండిత్యఫలములై యున్నవి. కొన్నికొన్ని ముఖ్య జీవితావసరముల విషయములో మనమింకను మనకు కావలసినవి మనము తయారుచేసికొనగల స్వయంసమర్థత లేకయున్నాము. ఆహారపదార్థములను, దీపముల వెల్గించుకొనుటకై నూనెను విదేశములనుండి దిగుమతి చేసికొనుచున్నాము. మన వస్త్రములను తయారుచేసికొనుటకు పెద్ద యంత్రాగారములను ఆశ్రయించుకొనియున్నాము. విదేశాలనుండి ఉక్కుఖడ్డీలును, సిమెంటును దిగుమతియైననే తప్ప మన కట్టడములను మనము నిర్మించుకొనలేకున్నాము. మనదేశములో దొరికెడి మూలికలస్థానే రససంయోగపరికల్పిత కృతకద్రవ్యములను, విదేశాల మందులను తెప్పించుకొని వాడుచున్నాము.

## పరాశ్రయస్థితి

మన దేశావసరములకు తగినంతవరకైనను మన దేశములోని వస్తుసంపదను మనము వినియోగించుకొనుట లేదు. ఏ యూరోపుఖండ వాసుల సాంగత్యమువల్లను, ఏవిద్యాభ్యాసంగమహిమవల్లను మన కీ జీవితావసరము లన్నియు సంఘటిల్లినవో ఆ విద్యావిధానమే, ఆ యూరోపియనుసాంగత్యమే మన కీ వస్తుసామగ్రులను స్వతంత్రముగా తయారుచేసికొను సామర్థ్యము నొసగక, ఇతరులు ప్రతిష్ఠించిన వస్తునిర్మాణ సంస్థలనాశ్రయించుకొనియుండవలసిన పరాశ్రయస్థితిని కల్పించినది. అందుకు ఫలితముగా ఈ సంగ్రామ సమయములో మన దేశమునందు ఆర్థికదురవస్థ పరిస్ఫుటమైనది. మన దేశావసరములకంటె అదనముగానున్న మన వస్తుసామగ్రుల యుత్పత్తి అత్యల్పముగా నుండుటవల్లనే ఈ ఆపత్కాలములో మన పరిశ్రమలు కాలావసరములకు చాలనివై తూలిపోవుచున్నవి. అదియును గాక దేశములో జనసంఖ్య వృద్ధియగుచున్నది. దేశములోని వ్యవసాయమును, పరిశ్రమలను విరివిగా వేవేగముగా వృద్ధిచేయుట యెట్లను విషయమే బ్రహ్మాండమైన తీవ్రసమస్యగా నున్నదని అధికారులుకూడ గ్రహించినారు. ఇదియే యుద్ధానంతర పునర్నిర్మాణకార్యక్రమమై యున్నది. దీని విషయమై జరూరుగా శ్రద్ధవహించి ఆలోచించుచున్నారు. ఆర్థిక వ్యవహారములందు అనేకవిషయములలో మనదేశమునకు గల లోటు లన్నియు ఆ యుద్ధసందర్భమున బయటపడినవి. మన పురోభివృద్ధిగమనవేగము చాల మార్పు చెందవలెను. కనుక మన విద్యావిధానములోని లక్ష్యమును, బోధనావిషయములును తదనుగుణముగా నూతనాకృతిని దాల్పవలసినవై యున్నవి.

## ఆంధ్రయువజనుల కర్తవ్యము

రాజకీయముగాను, ఆర్థికముగాను చక్కగా అభివృద్ధి చెందియున్న అమెరికా, ఇంగ్లాండులవంటి రాజ్యాలలో విద్యలు నేర్చిన యువకులు వారికొరకై సిద్ధముగానున్న అనేకఉపాధులలో పనిచేయుటకు సమృద్ధిగా కావలెను. కాని భారతదేశములోని విద్యార్థులు తమకు తగిన ఉపాధులను కల్పించవలసినవారై యున్నారు. అందుకొరకై వెనుకటితరములవారికంటె ఈకాలపుయువకులు ఎక్కువ ధైర్యసాహసములతో నూతనజీవితవ్యాపారములకు దారితీయవలసియున్నారు. మానవజీవితము రెండు అనిశ్చితాంశముల సమాశ్రయముగా పరిస్ఫుటమగుచుండును. ఒకటి ప్రకృతి; రెండవది మానవశక్తియు. భారతదేశములో అనేకరకాల భూసారములు, అరణ్యములు, నదులు, ఋతుపవనములు, తనివిదీర ప్రకాశించెడి సూర్యునివేడిమి సమృద్ధిగా ఉన్నవి. ఇవన్నియు భారతదేశ వస్తుసంపదలు. ఇదియునుగాక, మంచి శక్తిసామర్థ్యములు గల ప్రజలున్నారు. కనుక ఇటువంటిదేశములో ఆర్థికాభివృద్ధికి

సంపూర్ణావకాశములు కలవు. శస్యసంపదలో ఆంధ్ర దేశము భారతదేశములోని మిగిలిన ప్రాంతములకు ఎంత మాత్రమును తీసిపోదు. కనుక, ఆంధ్రయువతీయువకులు ప్రజ్ఞాధురంధరులై మన ప్రాచీనాత్మవిజ్ఞానజ్యోతిని ప్రకాశింపజేయుటకేకాక, మన ఆర్థికజీవితమునుగూడ కాంతిమంత మొనర్చి ప్రకాశింపజేయుటకై పూనుకొనవలెను.

### ఏజెన్సీప్రాంతముయొక్క అభివృద్ధి

ఈ ఆంధ్ర విశ్వవిద్యాలయము ఏ ప్రాంతమునకు వర్తించుచున్నదో ఆ ప్రాంతమునందు మదరాసు గవర్నమెంటువారు ఆర్థికాభివృద్ధి విషయములో అవలంబింపదలచిన కొన్ని నూతన వ్యవహారమార్గములను గూర్చి యొకింత ప్రస్తావించెదను. గోదావరిజిల్లాలోను, విశాఖపట్టణము జిల్లాలోను, పొరుగున నున్న ఒరిస్సా రాష్ట్రములో కొంతవరకును మారుమూలగా త్రోసివేయబడిన ఏజెన్సీప్రాంతము కొంత కలదు. ఇది తిరువాన్కూరు సంస్థానమునకు మూడింతలుగా నున్నది. మైసూరుసంస్థాన వైశాల్యములో మూడింట రెండువంతుల వైశాల్యమున కిది సమానముగా నున్నది. ఈ ఏజెన్సీ ప్రాంతము సముద్ర మట్టమునకు ౧౦౦౦ అడుగుల మొదలు 3,౫౦౦ అడుగులవరకు ఎత్తుగల భూమి. ఇచటి భూమి చాల సారవంతమైనది. శీతోష్ణస్థితికూడ దివ్యమైనది. కాని యీ ప్రాంతమంతయును వృద్ధిలోనికి రాకుండ దీనిని పీడించుచున్న దుష్టపిశాచము మన్యజ్వరకారణమైన దోమలబాధ తప్ప మరొకటి కాదు. కాని, యీ వ్యాధిబాధను తొలగించుటకు భౌతికశాస్త్రములు సాధనోపాయములను కనిపెట్టినవి. మన్యక్రిమినాశని నొకదానిని రాస్ అనునతడు కనిపెట్టిననాటినుండియు ఈశాస్త్రపరిశోధనలు జరుగుచున్నవి. గవర్నమెంటువారు ఉత్తరమున విశాఖపట్టణము జిల్లాలోను, దక్షిణమున మలబారుజిల్లాలోను కొనసాగించిన పరిశోధనల ఫలితముగా స్వల్పవ్యయముతో సాలీనా మనిషి ౧కి రూపాయి చొప్పున లెక్క తేలెడి ప్రభుత్వవ్యయముతో మన్యజ్వరమును రూపుమాపుటకు సాధ్యమగుచున్నది. అట్టిచో, ఆంధ్రులకు ఈ ప్రాంతము క్రొత్త వలసభూమిగా వెలసి, ఆంధ్రమండలములలోని అదనపు జనమును బర్మాకు కూలీలుగా పంపవలసిన అగత్యము తొలగిపోవును. ఆ విషయముగా మన జనమును కూలీలుగా పంపుట మన జిల్లాల ఆర్థికఅప్రయోజకత్వమునకు సూచకముగా నుండుటయేకాక, భారతీయులన్న కూలీ లనెడి న్యూనతనుగూడ కల్పించుచున్నది. కనుక ఏజెన్సీలోని ఊసర క్షేత్రమునంతను మనము సక్రమముగా వినియోగపరచవలెను.

### నీరు వ్యర్థమగుచున్నది

ఇదికాక, గోదావరీ కృష్ణానదులు మనకు కలవు. ఈనదులలోని జలమును గొప్ప ఇంజనీరగు కాటన్ అను ఆంగ్లేయప్రముఖుడు వ్యవసాయవినియోగమునకు తీసికొనివచ్చెను. కాని ధవళేశ్వరమువద్దను, బెజవాడ వద్దను ఆనకట్టల చెంతకు చేరెడి మొత్తము ప్రవాహజలములో నూటికి ౫ వంతులు మాత్రమే పంటభూముల నీటిపారుదలకై వినియోగపడుచున్నది. మిగిలిన ౯౫ వంతుల ప్రవాహజలము కట్టదాటి కడలిపాలగుచున్నది. అందువల్ల పోలవరమువద్ద ఒక పెద్ద జలాశయము నేర్పాటుచేసి నీటిని బంధించవలెనని గవర్నమెంటువారు గట్టిగా ఆలోచించుచున్నారు. ఏజెన్సీప్రాంతములో ఎత్తయిన నదీజలపాతములు కలవు.

### మాచకొండ జలపాతము

మాచకొండజలపాతము ౭౦౦ అడుగులఎత్తునుంచి క్రిందపడుచున్నది. ఈజలపాతవేగమును యంత్రబద్ధ మొనర్చి యచట జలపాతవిద్యుచ్ఛక్తిని తయారుచేయవలెనని గవర్నమెంటువారాలోచించుచున్నారు. ఈ జలపాతవిద్యుత్తు పైకారాజలపాతమూలముగా ఉత్పత్తియగు విద్యుత్తుకంటె చాల హెచ్చుగా నుండగలదు. ఈవిద్యుచ్ఛక్తి సప్లైయివల్ల ఈఆంధ్రదేశప్రాంతమునందు పారిశ్రామికాభివృద్ధి మెండుగా నుండగలదు. క్రొత్తిగా సాగులోనికి రాగల భూములకును, ప్రాత సాగు భూములకునుగూడ ఎరువులు విరివిగా కావలసియున్నవి. వాయువులోని నత్రజనిని సేకరించి మంచి

ఎరువులను తయారుచేయగల ఫ్యాక్టరీలను నెలకొల్పుట కవకాశముకలదు. దీపములను వెలిగించుటకై వలయు విద్యుత్తుగా సూర్యతేజమును మార్పుచేసి నిలవచేయగల యంత్రసాధనములు ఇప్పుడు విరివిగా వినియోగింపబడుచున్నవి.

ఇంతకుపూర్వము విశ్వమునంతను నిట్టనిలువుగా పృథక్కరించి ధీశక్తి, కాలము, దేశము, జడప్రకృతి యను నాలుగు తత్త్వములుగా విభజించియుంటిని. మన ప్రాచీనయోగిపుంగవులు విశ్వమునంతను అడ్డముగా కూడ ఛేదించి పృథివ్యాపస్తేజోవాయ్వాకాశము లనెడి పంచభూతములుగా వర్గీకరించియున్నారు. భూమి, నీరు, వాయువు, సూర్యరశ్మి, ఆకాశతత్త్వము అను అయిదు మూలతత్త్వములుగా వర్గీకరించియున్నారు. నేను సూచించిన అయిదు విధములైన ఆర్థిక పునర్నిర్మాణము పైజెప్పిన పంచభూతములను వినియోగించుటచే సాధ్యమగును. మొట్టమొదట నిట్టనిలువుగా అంతస్తులుగా విభజింపబడిన నాలుగుతత్త్వముల విభజన భౌతికశాస్త్రవిమర్శల కెంత యుపయుక్తముగా నుండునో, తర్వాత పేర్కొనబడిన పంచభూతవిభజన ఆర్థిక వ్యవహారములలో అంత యుపయుక్తమైయున్నది.

## శ్రీరామ సాక్షాత్కారము

కొలదికాలము క్రిందట నేను భద్రాచలయాత్ర చేసియుంటిని. అక్కడ నాకు రామాయణగాథ యంతయును ఒక క్రొత్త దివ్యదర్శనముగా కట్టెదుట సాక్షాత్కరించెను. మరల ఈ యుగములో ఆ దండకారణ్యమున దోమల కెకిమీడైన మశకాసురుని భటవర్గముచే శ్రీ మహాలక్ష్మి బంధింపబడినట్లుగా నాకు ప్రత్యక్షమైనది. ఆంధ్రశైలముల నికటతటములమధ్య వ్యర్థజీవియై, ఆంధ్రమహాస్రవంతుల ప్రవాహోన్మాద వేగమున విశీర్ణమై, నిరుపయోగాంధ్ర జలపాతములబడి కృశించి, వినియోగవిహీన సమీరసారమున నిస్సారమై, నిష్ఫల సూర్యతేజమున నిస్తేజమై కృశించెడి శ్రీ మహాలక్ష్మిని గోదావరీతటమున భద్రగిరిపై నెలకొనియున్న శ్రీరాముడు వీక్షించుచున్నాడు. ఆమెను చెరనుండి విమోచించుటకై ఆ శ్రీరామచంద్రుడొక నవ్య సైన్యమును సమకూర్చుచున్నాడు. వ్యవహారవేత్తలు, విద్యాబోధకులు, యంత్ర తంత్రజ్ఞులు, భిషగ్వరులు ఈ రామదండులో చేరియున్నారు. వైద్యులు ఈ మశకాసురుని తలయెత్తకుండ త్రొక్కివేయుదురు. యంత్ర తంత్రజ్ఞులు నదీజలమును అరికట్టి, జలపాతవేగమును యంత్రబద్ధమొనర్చి, యీ మహారణ్యభూతముల నన్నింటిని తమ యాజ్ఞానువర్తులనుగా నొనర్చెదరు. విద్యాబోధకులు క్రొత్త శాస్త్రములను బోధించి, క్రొత్త వ్యవసాయరీతులను, క్రొత్త పరిశ్రమల పోకడలను ఉపదేశించెదరు. వ్యవహారవేత్తలు సౌఖ్యప్రదములైన జనపదములను, ప్రముఖపట్టణములను నిర్మింపనేర్తురు. శ్రీ మహాలక్ష్మి యింటింట వెలసిన గృహిణీరూపము దాల్చి వామహస్తముతో ఇత్తడిబిందె నొకటి చంకనిడి, ఇత్తడిదీపము నొప్పుగ దక్షిణహస్తమున బట్టి తన బిడ్డలకు తేజమును భోజనమును, ముక్తిని భుక్తిని చేకూర్చుచు, ప్రసన్నవదనయై ఆ దివ్యసాక్షాత్కారదృశ్యమధ్యస్థ మంగళమూర్తియై ప్రత్యక్షమగును. ఆమె పార్శ్వమున శ్రీరామచంద్రుడు చిరునగవులొలుక మెలగుచుండును. ఎవ్వనియందుండి సమస్తము ఆవిర్భవించుచున్నదో, ఎవ్వనివలన సమస్తము వర్ధిల్లుచున్నదో, ఎవ్వనియందు సమస్తము లీనమగుచున్నదో ఆ శ్రీరామచంద్రుడు తన మందహాసచంద్రికల వెదజల్లుచుండును. అట్టి మహోత్కృష్ట దివ్య సాక్షాత్కారసిద్ధికై భవిష్యదాంధ్రాభ్యుదయనాయకులైన ఆంధ్రవిశ్వవిద్యాలయ పట్టభద్రుల రగు మీరు మీ లక్ష్యమును, మీ సంకల్పశక్తిని, మీ సామర్థ్యాతిశయమును సదా లగ్నముచేసి జీవితమును సార్థక మొనర్ప గోరుచున్నాను.



పంౘ్రెండవ శతాబ్దమునాటి శివలింగము-ఇటీవల నిడదవోలులో దొరికినది

[వివరములకు 'కలగూరగంప' చూడుడు]

# వానకారుకత

[ గతసంచిక తరువాయి ]

= శ్రీ 'పాప' =

[అమ్మవారి జాతర. కోలాహలం]

పూజారి:—అమ్మవారి జాతర ! అమ్మవారి జాతర !
కమ్మని నెయ్యి, మేకల మాంసం
కానుక లిప్పుడు తెండి.
అమ్మవారి జాతర! అమ్మవారి జాతర!
కల్లుపానకపు నైవేద్యంతో
ముల్లికూతురికి పూనింది
వెల్లిపోయి ఏడాదికి అంబ
మల్లీ వచ్చింది.
అమ్మవారి జాతర! అమ్మవారి జాతర! (గంట్లు)
(విరామం)

వక్రబుద్ధి:—సామంతులారా! సభలో
సామంతులారా!
ఈనాడే నేరం రుజువై
రాణికి శిక్ష విధించేనాడు.
అమ్మకు జాతర వెల్లింది.
నమ్మదగిన తీర్పు వస్తుంది.
రాణి అస్వస్థతచేత సభకు
రానని కబురంపింది.
ఆమెపరోక్షంలోనే ఇంక
అంబవాక్కు వినబడుతుంది.
తీర్పు జాగ్రత్తతో వినే
ఓర్పు కలిగిఉండండి.

[సభలో గుసగుసలు. దూరాన్ని గంటచప్పుడు]

ప్రతీహారి:—అమ్మవారి తీర్పు! మహారాజా!

వక్ర:—రమ్మను లోపలికి.

[గుసగుసలు ఆగిపోతాయి]

సామంతులు అంబవాక్కు
సావధానులై వినండి.

అంబవాక్కు:—చెరలో పెట్టిన రాణిగుణానికి
చెడుపే లేదు (విరామం)
రాణి అగ్నివంటి ఇల్లాలు (విరామం)
కాని చెరలో పుట్టిన రాజపుత్రి
బ్రతికి తిరిగిరాకపోతే రాజ్యం
చితికి శిథిలమయిపోతుంది. (పెద్దవిరామం)

[గుసగుసలు. తరవాత ప్రశాంతి]

వక్ర:—ఆహా ! నే నెంతటి ఘోరం
ఆలోచించక చేశాను!
అంబతీర్పు చెవిని పడ్డ క్షణం
నెంబుకుంది రక్తపు వేడి.
అసువులున్న మృతశరీరంలో
ముసిలితనం పాకిపోయింది.
సేవకులారా! ఆజ్ఞాపించే
జీవం నాలో లే దింక.
చూడండి నా ముద్దుపాప
జాడ ఏమయినా దొరికితే.
గాలివానలో సముద్రంమీద
జాలిమాలి పంపించిన నాకు
మల్లీ పాపను చూసే భాగ్యం
ఎల్లా పడుతుంది ?
అలిసి అలిసి పోయిన రాణికి
అసువులు నిలిపే సదుపాయాలు
వేగంగా చూడండి! పొండి.

సేవ:—మహాప్రభూ! శంకరి దేవి

మాయా రాణిని చెరవిడిపించి
తన యింటికి తీసుకుపోయి
తగిన వైద్యం చేయిస్తోంది.

వక్ర:—మంచిది మంచిది సేవకులారా!
మరిచిపోయా నింకొక సంగతి.
అతిథై వచ్చిన బాల్యమిత్రునికి
అంతటి ఘోరం తలపెట్టిన నన్ను
క్షమించమని అంగరాజుకి
కబురుపంపండి.

సేవ:—చిత్తం! దేవా! చిత్తం!

(ప్రవేశం)

శంకరి:—రాజా! నీ అనుమానపిశాచాలకు
రాణీ బలి అయిపోయింది.
చావక మిగిలిన మన కందరికీ
శాశ్వత దుఃఖం చేకూర్చింది.

వక్ర:—అయ్యో! ఎంతటి నిర్భాగ్యుణ్ణి!
తియ్యనైన మిత్రుల మాటలు-
పెడచెవి పెట్టిన పాపానికి
కడగండ్లన్నీ నేనొక్కడనే
అనుభవించి తీరాలి.

శంకరీ! నా గుడ్డికోపంలో
ఇంక తీరని అపరాధం నీయెడ
చేశాను.

శంకరి:—రాజా! నే నే జన్మంలో
చేసుకున్న పాపమో ఇప్పుడు
నా సుఖాలను నమిలి మింగివేసింది.

వక్ర:—మృతరాణిని నేనొకసారి
బ్రతిమాలుకుంటాను శంకరీ!

శంకరి:—అవమానాలన్నీ మోసిన
ఆముఖాన్ని రాజా!
నీకు చూపకూడ దని రాణి
ఆఖరుకోరిక.

వక్ర:—నా పాపాలకు నిష్కృతి లేదు.
నా బ్రతుకికి వానకారు గడిచి
ఎండకన్ను చూసే భాగ్యం
ఉండదుగావును. ఉండదుగావును.

* * *

కాలం:—నా పేరే కాలం అంటే
నా రెక్కలు విప్పుకుంటే
పదహారేళ్లు రెప్పపాటులో
పరుగెత్తుకు పోయాయి.
నానడకను నిర్ణయించే
న్యాయం ధర్మం లే దింక.
వినండి! వినండి! ఈకత!
మనసుంచి జాగ్రత్తగా
వినండి! వినండి! ఈకత!

(పాట)

వానకారులు పదియారు
సానదీర్చిన సోయగము
చంప చెంపలకు కూర్చెను
సంపెగలు గులాబులూ. వాన.

వెన్నమీగడలు మెసవిన
నున్నదనము రూపములో
గొల్లవాడలో పెరిగిన
చల్లదనము చూపులలో
కొల్లలై-వెల్లువలై
కొల్లగొనియె నెల్లకనుల. వాన.
వంగపుత్రి చంప పెరిగి
అంగపుత్రుడు మదనుని
హృదయము హరియించిన కథ
విధి విధియించిన విచిత్ర
సన్నివేశము!...ఇది
విన్నారా?...విన్నారా? వాన.

* * *

చక్రసిద్ధి:—కింకరా! నీవు పోయే సమయం
ఇంకా రాలేదు.

కింకరుడు:—ప్రభువా! నాదేశం విడిచి
పదహారేళ్లు కావచ్చింది.
పాపం మారాజు నాకు
పశ్చాత్తాపం తెలిపినాడు.
దుఃఖం ఒకటే వ్యాపించి
దుర్దిన మయిన అతని జీవితం
స్వామీ! నే పక్కని ఉంటే
ఏమయినా ఓదార్చగలను.

చక్రసిద్ధి:—ఇన్నాళ్లూ చేసిన సేవల
కన్నా ముఖ్యం నీ సలహా ఇప్పుడు.
ఈ సమయంలో నీవు లేనిదే
నా సమస్యలు విడిపోవు.
కన్నతండ్రి మదనుడు ఈమధ్య

కనబడకుండా ఉన్నాడు.
నీవేమయినా అతని ధోరణి
సావధానంగా చూశావా?

కింక:—ప్రభువా! యువరాజీమధ్య
సభలో కనబడడం లేదు.
మూడు దినాలనించీ అతని
ముఖమే అపురూపమయింది.

చక్ర:—నే నది ఆలోచించే ఇప్పుడు
నిన్ను ఈ ప్రశ్న వేశాను.
నా చారులు చెప్పేదే నిజమయితే
నగరానికి దూరంగా ఉన్న
గొల్లపల్లిలో యువరాజిప్పుడు,
షల్లాపా లాడుతుంటాడు.

కింక:— రాజా! ఆ గొల్లపల్లిలో
రాజుల ఇళ్లకు రంగుతెచ్చే
అందాల ప్రోవొక సుందరాంగి
ఉందని నగరంలో ప్రతీతి.

చక్ర:—నేనూ అదే విన్నాను కింకరా!
కాని కళ్లతో చూసిగాని
నాకుమారుడి ప్రవర్తనకి
సాకులు నిర్ణయించకూడదు.
నీవూ నేనూ మారువేషాలతో
ఈవేళే ఆచోటికి పోయి,
సంగతులన్నీ స్వయంగానే
సంగ్రహించుకువద్దాం.

కింక:—చిత్తం ప్రభూ! మీ ఆజ్ఞ!

చక్ర:—శీఘ్రమే గొల్లపల్లికి పోదాం.
(విరామం)

[గొర్రెలమంద తపతపధ్వని. మేకలఅరుపు]

గొల్ల:—(పాట) గొర్రెలమేతకి ఏళ్లూ కోళ్లూ
పర్రలూ దాటిపోయాం.
మేకల మేతకి సెంచుపాకలూ
సాకలిగూడెం దాటిపోయాం.
దార్లో తుమ్మల లేతకొమ్మలు
కర్రకొంకితో కోసియేసాం.
తురాయిపువ్వులు గుత్తులుగట్టి
పరాచకా లాడుకున్నాం.
గొర్రెల మేతకి ఏళ్లూ కోళ్లూ
పర్రలూ దాటిపోయాం
మేకల మేతకి... (నిష్క్రమణం)

పెదగొల్ల:—సెంపా! సెంపా! యాడున్నావు?

చంప:—(దూరాన్నించి)సంపెంగలు దండకుచుతున్నా

పెద:—యెక్కడివో సంపెంగలు?
సక్కంగున్నాయే!

మదనుడు:—చంపకు సంపెంగలు నేనే
సంపాదించి తెచ్చాను.

పెద:—తమ రెవ్వరు బాబూ! రోజూ
తరిదప్పక వొత్తున్నారు?

చంప:—మన యువరాజు నీ కెప్పుడూ
కనబడనేలేదా? నాన్నా!

పెద:—యువరాజే, మన యువరాజే!
ఎవరో యెరగక అన్నాను బాబూ!

మద:—నా పేరేమో మదనుడు.
నీపుత్రికఅందానికి మెచ్చి
చూసిపోదామని వస్తున్నాను.

చంప:—పూసగట్టిన నెయ్యి, వెన్న
తీసుకురా బాబా! వారికి.

పెద:—తెత్తాను! తెత్తాను! మారాజులు
ఉత్తినే వొత్తారా మాయింటికి?
(విరామం)

మద:—ఈవెర్రిగొల్లకూతురువై
నీ వెల్లా పుట్టావో చంపా?
గిల్లితే చెమ్మగిల్లే సరికొత్త
మల్లిపువ్వులాంటి నీదేహం
చూస్తుంటే రెప్ప మూతపడదు
వస్తావా? నాతో చంపా!

చంప:—ప్రేమిమించిన మీపొగడ్తకు
మతిభ్రమించే సిగ్గు నాకు.
మదనమహారాజులు మీరు
హృదయంలో తలుచుకుంటే
బెదురు పుడుతుంది నాకు.

మద:—అదూరు బెదురులను ఆలోచించక
సరదాగా కాలం గడిచే
సంతోషాలే ఊహించు,
దేవతలంతా ప్రేమదాసులై
జీవజంతువుల రూపం దాల్చి
విహరించిన కథ లెన్నెన్నో
వింటున్నాంకదా మనం.

నినుబోలిన రూపంకోసం
మనిషిశరీరం దాల్చిన దేవుడు
ఇంతవరకూ లేడని అంటే
ఇంక నాఅదృష్ట మాలోచించు.

చంప:—మదనప్రభూ ! సాటిలేని మీ
సదనాల సౌభాగ్యం ఎక్కడ !
పూరిగుడిసెలో గొర్రెల మేకల
పురుళ్లు పోసే నే నెక్కడ !

మద:—మా సదనాలలో మెరిసే గాజు
పూసలకు నీ వొక మణివి.
నీవు లేని ఆ భోగాలన్నీ
జీవంలేని కంకాళాలు.
నీతో ఈ మేకల మధ్య
నృత్యం చేస్తూఉన్నప్పుడు
నాహృదయంలో గంతులువేస్తాయి
నవనవలాడే పువ్వుల గుత్తులు.

చంప:—ఏమో! నా కెంతో బెదురు.
సామాన్యులా మీరు!
మన మిల్లా సంతోషంగా
చనువుగా తిరుగుతున్నప్పుడు
చటుకుని మీతండ్రి ఇల్లా
చక్కా వస్తా రనుకోండి.

మద:—సాటిలేని గొల్లపిల్లకోసం
కోట విడిచి రాగలిగిన
మనసుగాని వయసుగాని
మా నాన్నకు లేవు.
రా చంపా! ఆపక్కకు పోయి
రాలిన పువ్వులు ఏరుకుందాం.

చంప:—మీ ఉత్సాహానికి మొగమాటపడి
మీ ఉద్రేకానికి పులకరించి
కానికాలంలోకూడా పువ్వులు
కోనల్లో విచ్చుకుంటున్నాయి.
పచ్చికబయలికి ఆ కోసని
పారిజాతాలు కోద్దామా ?

మద:—పదపద. కోద్దాం పద. (నిష్క్రమణం.)

(ప్రవేశం)

కింకరుడు:—అదే స్వామీ ! గొల్లపిల్ల.
మదను డాతడే నేమో !

చక్రసిద్ధి:—కింకరా ! వయసుగాళ్ల కళ్లకు
సంకెళ్లు వేసే సొగసే సుమా !

కింక:—స్వామీ ! నేనే మేకనైతే
ఆమె మందలో తోలుకుపడితే
మేత మాని ఆదేపనిగా ఆ
లేతమొగాన్ని చూస్తూఉందును.

చక్ర:—చూడు ! చూడు ! ఆయువకుడు !
నీడలాగ ఆమె నంటుకుని !

కింక:—ఆతని చమత్కారానికి గావుకు
ఆమె దేహమంతా ఊగుతో
పగిలిన దానిమ్మ గింజలలాగ
నిగనిగ మెరిసేపళ్లతో
నవ్వుతోంది చూశారా ?

(ప్రవేశం)

పెదగొల్ల:—ఎవ్వరు బాబూ ! తమరు ?
ఎందుకు ఇల్లా వొచ్చారు?

చక్ర:—పరదేశులం ! పరదేశులం !
సరదాగా దేశాలు తిరుగుతూ
దారేపోతూ ఊరికే ఈ
ఊరు వచ్చాం.

పెద:—సిత్తం! సిత్తం ! కూకోండి బాబూ !

కింక:—కొత్త వింత లేమిటి గొల్లా ?

పెద:—తా మెరగని యింతలు యిక్కడ
యేమీ లేవు, అయ్యలు !

చక్ర:—ఆవన్నెలాడి ఎవ్వరు గొల్లా ?
ఆవెనక పోయే యువకు డెవ్వడు ?

పెద:—ఆపిల్ల నాకూతురు సెంప.
(రహస్యంగా) ఆలకించండి బాబూ !
ఆ సిన్నోడేమో యువరాజు
మా సెంపను వొలిచి వొచ్చాడు.

చక్ర:—ఆ ! ఆ ! నిజమే ?

కింక:—(మందలింపుగా) స్వామీ! స్వామీ !
పెదగొల్లా! నీ అదృష్టం !
పెట్టిపుట్టావు ఏనాడో.
అయితే గొల్లా నీకూతురు
అంత అందకత్తె గావును.

పెద:—అయ్యలూ! నాకూతురు అందం
అయ్య నోటితో అనకూడదుగాని
ఈలోకంలో నాకూతురు సెంపకు

సాలీన కుర్రది లేదు.
రాండి బాబూ! సూద్దురుగాని
పండుగసంబరం మీ దియ్యాల
ఆటలు పాటలు ఎన్నో ఉంటయి
నాటకాలుంటై.

[నృత్యపు ధ్వనులు - సంబరం]

పాట:—(ఒకడుపాడుతుంటే అంతా అంగుకుంటారు)
మంచురాలిన లేతఆకులు
కొంచెం కొరికితె సాలు-
పల్లు జివ్వుమంటై— మేకకి
పల్లు జివ్వుమంటై— ||మంచు||
సలికాలంలో ఎన్నలకన్నా
సాలీన తిండే లేదు,
సందిటి కమిరిన సిన్నదానా
సందాలకు రాయే—
సందాలకు రాయే— ||మంచు||

(నిష్క్రమణం)

(ప్రవేశం)

ఇద్దరు భార్యలు:—ఇద్దరు భార్యల ముద్దుల మగడా?
భర్త:—వొదలండేశే నే పోతాను!
(ఒకత్తె):—నేనో? (రెండవది):—మరి నేనో?
ఒకత్తె:—నా కెన్నెన్నో ఆసలు పెట్టావు.
రెండవది:—నా కెన్నెన్నో ఊసులు సెప్పావు.
ఇద్దరూ:—ఇద్దరు భార్యల ముద్దులమగడా!
భర్త:—వొద్దేశే నే పోతాను.
(ఒకత్తె):—నేనో? (రెండవది):—మరి నేనో?
ఒకతె:—కంచి మేకలు తోలుకుపోదాం
రెండవది:—సంచిరూకలు సంపాయిద్దాం
ఇద్దరూ:—ఇద్దరు భార్యల ముద్దులమగడా!
భర్త:—ఉండండేశే నే పోతాను!
(ఒకతె):—నేనో! (రెండవది):— మరి నేనో!

(నిష్క్రమణం)

కింక:—గొల్లసంబరం చూస్తుంటే
ఉల్లాసం మిన్నుముట్టుతుంది.
చక్ర:—చూడు! చూడు! యువరాజే!
కింక:—ఈడైన చక్కని సుందరినే
ఎన్నుకున్నాడుసుమా! స్వామీ!
చక్ర:—కింకరా! ఈ ఆటలు పాటలు
ఇంక అరికట్టాలి.
కింక:—స్వామీ! తొందరవొద్దు.
సావధానంగా చెప్పిచూదాం.
ఇద్దరూ ఇట్లా వస్తున్నారు.
కొద్దిగా శాంతించి మాట్లాడండి.
మదనుడు:—తీగలాగ వంగినప్పుడు చంపా!
నాగమల్లెల దండ నీమెడలోనే
పూసినట్టు 'అనిపించింది.
చంప:—రాసనాట్య మంటే సరదా.
కింక:—యౌవనుడా! నీ కీ సుందరి
ఏమవుతుంది?
మద:— ప్రేయసి.
చక్ర:—మంచి ప్రేయసిని సంపాదించావు!
మద:—మంచికి మించిన మంచి లేదు.
అంచకు మించిన పక్షి లేదు.
చంప:—అయ్యలారా! ఈ యువకుని
అతిశయోక్తులు మన్నించండి.
కింక:—మంచిదిగాని యౌవనుడా!
మంచీ చెడ్డా యోచించావా?
నీ కులమేదో ఎరగనుగాని
వాక్కునుబట్టి గొల్లవు కావు.
మద:—వాక్కునుబట్టి చూస్తే గొల్లది
నాకంటే ముందు ఆమె కాదు.
చక్ర:—ఆమె ముసలిగొల్లకూతు రని
అందరూ ఎరిగినదేగా?
చంప:—అయ్యలారా! ఇంతదూరం
ఆలోచించక పోలేదు.
కులాన్నిబట్టి నే నాయనకు
కలిసిరానిమాట నిజం.
అందం చూపి మోసగించే
టంత మాయలాడినీ గాను.
మా స్నేహానికి ఈలోకంలో
మనువన్నది లేనేలేదు.
రేపాయన ఇంటికి పోయి
కాపురముంటారు.
మేకల మందలు నేను తోలుకుని
మేపడానికి పోతాను.
చక్ర:—గొల్లపిల్లవయినా గానీ

కోటివరహాల మాట లన్నావు.

కింక:—గొల్లవాడలో పుట్టిన నీకు
పిల్లా! ఇంతటి నేర్పరితనం
ఎల్లా వచ్చింది?

మద:—అది గ్రహించిన పెద్దలు మళ్లీ
అధిక ప్రసంగం చేస్తా రేం
తరహా తెలిసినవారికి ఆమె
తరాలు కులాలు అక్కరలేదు.

చక్ర:—ఈ పెళ్లికి నీతండ్రి అనుమతి
ఇస్తాడా యాదవుడా?

మద:—కన్నులతో చూసి విలువను
ఎన్నగల తండ్రే అయితే
అనుమతి ఇస్తాడు, లేదా
అనుమానం లేని చోటికి పోయి
మనువు చేసుకుంటాను.

చక్ర:—కొడుకుల కండకావర మెంత
కొడిగట్టింది? - ఈ
మైలపడ్డ గాలిలో క్షణ
మైనా నేను నిలవను. (నిష్క్రమణం)

మద:—(నవ్వుతూ) తండ్రిని ధిక్కరిస్తే పాపం ఈ
తాతకు ఎంత కోపమో!

కింక:—యువరాజా! యువరాజా!

మద:—ఎవరు నువ్వు?...కింకరుడే!

కింక:—వారు తాత గాదు. నీతండ్రి
మారువేషంలో నిను వెంటాడి
సంగతి సందర్భాలన్నీ
సంగ్రహించవచ్చారు.

మద:—ఆయన అని తెలియక ఎంతటి
అవివేకం చేశాను!

చంప:—ఉదయం మొదలు నాకెందుకో
అదురుగానే ఉం దీవేళ
అన్యో్య! మాబతుకుల కింక
వెయ్యేళ్లూ నిండాయిగావును.

కింక:—నాచేతనయిన సాయం మీకు
నే చేస్తాను భయం లేదు.
మదనా! నీ ఇంటికి పోయి
మన్నించమని వేడుకో.

మద:—చంప లేని రాజ్యం భోగం
చంపినా నా కక్కరలేదు.
కింకరా! మరి నీవే ఏదో
కీడులేని పన్నాగం చూడు.

చంప:—మరి రాజు చేతులో పడితే
మన పన్నాగా లేమవుతాయి?

కింక:—దొసగులేని పద్ధతి ఒక్కటి
తోస్తోం దిప్పుడు నాకు.
ఈడూ జోడూ కలిసిన మీ
ఇద్దరినీ చూస్తే నాకు
అంతరంగమంతా ఎంతో
సంతోషంతో నిండిపోయింది.
మీ ఇద్దరి ప్రేమా దివ్యమయిన దని
మీముఖాల్లోనే తెలుస్తోంది.
మదనా! ఈకడలికి ఆవల
పదికోసుల దూరంలో
వంగపురిని ఎరుగుదువా?
వంగరాజు మీ నాన్నకు
చిన్ననాటి స్నేహితుడు
కొన్ని రోజుల క్రిందట జరిగిన
చిన్న సంఘటనవల్ల
అంగరాజు ఇంతవరకూ
వంగ దేశం పోలేదు.
మీరిద్దరూ వెంటనే
ఆరాజ్యానికి పారిపొండి.
మీతండ్రి నిన్ను పంపినట్టు
ఆతనితో చెప్పిఉంచు.
తక్కిన విషయాలన్నీ నేను
చక్కబెడతాను.

మద:—చంపా! అయితే రా పోదాం.

చంప:—సరేగాని మానాన్నతో
చెప్పి పోదామా?

మద:—వద్దు! వద్దు! మన జాడ ఎవరికీ
కొద్దిగా అయినా తెలియకూడదు.

చంప:—ముద్దుగా ఇన్నాళ్లూ పెంచిన
ముసలినాన్నకు తెలియకుండానే!

మద:—పొద్దు లేదు మనం పోవాలి. (నిష్క్రమణం)

కింక:—ఇద్దరినీ అంబ దయతో
ఇలవేలుపయి రక్షిస్తుంది.
ఎన్నాళ్లయినా అంగరాజు
నన్ను పోనిచ్చేటట్టు లేదు.

తలవని తలంపుగా దొరికిన
తరుణం చేత పుచ్చుకుని
ఎల్లాగో నా దేశం చేరే
ఏర్పాటు చెయ్యాలి.
(వి రా మ ం)

కాలం:—ఓడమీద ఈడైన జంటలే
ఉంటే...సాగుతుంది యానం.
...సాగుతుంది యానం.
కెరటాలన్నీ కలకల నవ్వి
తెరచాపలలో గాలులు రువ్వి
చరచర చరచర కోసు లామడలు
సాగుతుంది యానం.
ఎగిరే చేపలు గాజు టెండలో
నిగనిగమణులై మెరిస్తే
ఆకుపచ్చ సంద్రానికి లోపల
ఆకాశం ప్రతిబింబిస్తే
తెల్ల మేఘాల దూదిపింజలు
తెల్లకిందుగా నడిస్తే
చూపు మేరలో భూములకోసం
చూపులు ఇటునటు పరిస్తే
చరచర చరచర కోసు లామడలు
సాగుతుంది యానం
(ప్ర వే శ ం)

వక్రబుద్ధి:—ఎవరొచ్చింది?
ఎదురుగా రమ్మను సేవకా!

మదనుడు:—మదను డంటారు నన్ను
ఇది నాభార్య చంప.
అంగదేశయువరాజును నేను
వంగదేశరాజులకు మాతండ్రి
చిన్ననాటి చనువూ స్నేహం
నన్ను జ్ఞాపకం చెయ్యమన్నాడు.

వక్ర:—సార్థకనాముడవైన మదనా!
చక్కని చంపను సంపాదించావు.
ఆమె లేతమొగాన్ని చూస్తే నాకు
ఏమో ఆందోళనగా ఉంది.

పదహారేళ్లు నవ్వే లేని
శిథిలజీవితం గడిపిన వెనక
నవ్వేతప్ప దుఃఖం ఎరగని
జవ్వనులను చూసే భాగ్యం
నాకు కలిగించిన మీ తండ్రికి
ఏకృతజ్ఞత చెప్పుకోను!

కానక చేసిన అపచారాన్ని
ఈనాటికైనా మన్నించాడా?
ఇంకా ఏదో మరిచాను.
కింకరుడనే సేవకు డొక్కడు
మీతండ్రిదగ్గర ఉండాలి
అతడు క్షేమమేనా?

మద:—ఆహా! ప్రభువా! నా యీరాకకు
అతడే కొంత కారణం.

వక్ర:—పాత ప్రభువును ఈనాటికీ
అతడు మరిచిపోలేదు.

||ఓడ|| మద:—లేదు! స్వామీ! లేదు.

వక్ర:—చంపా! నీ వే అదృష్టవంతుడి
కొంపలో పుట్టావు?

చంప:—ప్రభువా! నే నొక మహారాజు
ప్రాసాదంలో పుట్టలేదు.
పుట్టినప్పుడు న న్నీనల్లని
మట్టె ఆదరించి ఉంటుంది.

వక్ర:—నిన్నాదరించిన మట్టి ఎంత
పున్నెం చేసుకుందోగదా!

||ఓడ|| (తొందరగా ప్రవేశం)

సేవ:—ప్రభువా! ఎవరో అంగరాజు
పంపిన సేవకులట!

వక్ర:—ప్రవేశపెట్టు లోపలికి.

అం. సే:—అంగరాజు పరివారంతో
అవతల దిగారు ప్రభూ!

మద., చంప:—అయ్యో! ఇప్పుడు ఏది దారి?

వక్ర:—ఏమి చిత్రమయిన సంఘటన!

అం. సేవ:—స్వామీ! వారి పుత్రుడు మదనుడు
గొల్లపిల్లను వలచి ఆమెతో
ఇల్లు పారివచ్చినట్టు
వార్త తెలిసి మహారాజు
వారివెనక వచ్చారు.

మద., చంప:—అయ్యో! ఇప్పుడు ఏది దారి?

వక్ర:—సేవకుడా! మిత్రుని వెంటనే
సేవకులతో రమ్మను.

సేవ:—చిత్తం! స్వామీ! శలవు. (నిష్క్రం.)

చంప:—మహారాజా! నా దొక మనవి.
మర్యాదకు మించిన పనికి

మనసిచ్చే దోషిని కాను.
నాప్రాణాలమీద నా కంత
ఆప్యాయత లేదుగాని
అమాయకుడు నాతండ్రికి
అపాయం రాకుండా చూడండి.

మద:—మహారాజా! దోషిని నేను.
మన్నించండి నామాట.
నాది కుర్రతనపు గుడ్డిప్రేమ అని
నాన్న ధిక్కరించాడు.
కాని ప్రభూ! ఈమెస్నేహం
లేని జన్మ నాకు వృథా.
మాపై జాలి దలిచిన కింకరుడే
మా కీత్రోవను చూపించాడు.
మీరక్షణ ఒకటే మాకు
మిగిలిన ఉపాయం.

వక్ర:—జవ్వనుడా! నీసాహసానికి
నవ్వు వస్తోంది. ఆపయిని
చంపముఖం చూసినకొద్దీ
వచ్చిన అనుకంప ఏదో నాలో
మళ్లీ ప్రాణం పోసుకుని
కళ్లు చెమ్మగిల్లుతున్నాయి.
మీతండ్రిని రానీ నాకు
చేతనయిన మాట చెపుతా.

సేవ (దూరాన్నించి):—స్వామీ! అంగమహారాజులు
సపరివారంగా వచ్చారు.

వక్ర:—లోపల ప్రవేశపెట్టు.

(ప్ర వే శ ం)

చక్రసిద్ధి:—ఈ పనికిమాలిన సందర్భంలో
ఇప్పుడు మళ్లీ కలుసుకున్నాం.
మిత్రుడా! నీదుస్థితికి నేను
మిక్కిలి విచారించాను.

వక్ర:—పదహారేడులు గడిచిన దుఃఖం
పదును తగ్గిపోయింది మిత్రా!
అనునయాలు అక్కరలేదు.
అడుగో నా కింకరుడు!

కింక:—మహాప్రభూ! ఎన్నోసార్లు
మన దేశం రావాలనుకున్నా
అంగరాజులుమాత్రం దానికి
అంగీకరించలేదు.

చక్ర:—దోషులు ఇద్దరూ ఇక్కడే
దొరికారు చూశావా? కింకరా!

మద:—తండ్రీ! ఇందులో ఒకరే దోషి.
దండన ఏదైనా నేనే
దానికి అర్హుణ్ణి.

చంప:—పారిపోయివచ్చిన నాకూ శిక్షను
పంచిపెట్టండి కాని
ఏమీ ఎరగని మాతండ్రిని
అమాయకుణ్ణి రక్షించండి.

కింక:—ప్రభువులారా! నామాటలు
పాటించి వినండి.
కోటిరాజ్యాలు గాలించినా ఈ
గొల్లపిల్లవంటిది లేదు.
గొల్లవాడలో తప్పబుట్టినా
పిల్లకు అంబరక్షణ ఉంది.
ఆమెముఖంలోని తేజస్సు
భూమిమీదే అరుదు.
మిత్రులిద్దరికీ నే చెప్పేదా
ఉత్తసలహాలు ఇవ్వలేదు.

వక్ర:—అంగరాజ సోదరా! నాకూ
అల్లాగే అనిపిస్తోంది.
మనసులో చచ్చి శిలయై
మరచిన బాంధవ్యం ఏదో
ఈమెను చూస్తూఉంటే నాలో
ఇప్పుడు మొలకెత్తుతోంది.

చక్ర:—అందమయిన ముఖం ఎంతటి
అపాయాలకు నెలవు!
నిశ్చలమయిన మనసులుకూడా
నిమిషంలో భ్రమించిపోతే
వయసులోని కుర్రవాని హృదయం
వలగొనడం అదొక లెక్కా?
సేవకులారా! ముసలిగొల్లను
శీఘ్రం తీసుకురండి!

సేవ:—మంచిది మహాప్రభూ!

పెదగొల్ల:—మారాజా! నామనవి.

చంప:—నాన్నకు ఎంతటి ఆపద
నావల్ల వచ్చింది!

చక్ర:—నీమాట ఏమిటి త్వరగా చెప్పు.

పె. గొ:—స్వామీ! ఈకూన నాకు
పయానా బిడ్డగాదు.

చక్ర:—అంగరాజు ఎదురుగా నీ
దొంగమాటలు పనికిరావు.

పె. గొ:—ఇంత కూతురు నాది కాదని
ఎంత రాతిగుండె అంటది బాబూ!
పెంచిన మమకారం నాది
పెద్దదే సామీ!

చక్ర:—అయితే ఈపిల్లను నీకు
అప్పగించినవా రెవరు?

పెద:—పదారేళ్లకు కిందట సామీ!
పెద పెద్ద గాలివానలో
ఎడారిమద్దె ఈపాప
పడుకుని వుందండి.
ఏమి సిత్తరమో తెలదు
ఎల్లా వొచ్చిందో తెలదు
సిన్న గొల్లకంట బడితే
నన్ను పిలిసి సూపినాడు
ఇంటికి ఎత్తుకుపోయి సామీ!
ఇంత పిల్లని సేసాను.

చక్ర:—గొల్ల వెర్రివాడయినా గానీ
అల్లిన కథ బాగానే ఉంది.
గాలివానలో ఎడారిమధ్య
వాలిందా పిల్ల వచ్చి!
గొల్లా! ఈకథలు ఎవ్వరయినా
ఎల్లా నమ్ముతారు?

చక్ర:—పదహారేళ్లా? ఎంత చిత్రం!

చక్ర:—మదనా! నీ విక ఇంటికి పో.
మిగిలినవారికి శిక్ష విధించి
మేమూ వస్తాం వెనకాల.

మద:—ప్రభూ! నా అపరాధాలకు
పరులను శిక్షించకండి.
ఈమె లేని రాజ్యం భోగం
ఏమీ నాకు వద్దు.

చక్ర:—మూర్ఖా! నీ గుడ్డితనం
ముదిరిపోతోంది.

చక్ర:—మిత్రా! నా గుడ్డితనం
మిగిలిన బ్రతుకును కాల్చివేసింది.
ఈ విచిత్రసన్నివేశంలో
సావధానులమై నడుచుకుందాం.

చక్ర:—వంగసోదరా! ఈసందర్భంలో
అంగరాజుతో కొందర మన్నించు.
యూవరాజ్యం నాశనమయ్యే
సావధానం నా కక్కరలేదు.
ఇంతటితో ఈనాటక మింక
అంత మొందితీరాలి.

సేవ (దూరాన్నించి):—దేవా! ఎవరో మునిలివాంగి
రావద్దంటే వస్తున్నాడు.

చక్ర:—పోనీ! రానీ లోపలికి.

ముసిలి:—నే నొక పరదేశిని రాజా!

చక్ర:—ఎందు కిల్లా వచ్చావు?

ముసిలి:—ఏదో సంగతి విందామని.

చక్ర:—పిచ్చిముసిలివానితో వృథ
ఇచ్చిన కాలం తిరిగిరాదు.
ముం దీతీర్పు అయినవెనక
అందరమూ ఆనందిద్దాం.

(ప్రవేశం)

శంకరి:—మహాప్రభూ! నమస్కారం
మహావిచిత్రం ఏదో ఇక్కడ
జరుగుతోం దని విని వచ్చాను.

చక్ర:—శంకరీ! ఈతడు అంగయువరాజు.
చంప అనే గొల్లకన్య ఈమె.
మదనుడు చంపతో కలిసి
మన యింటికి పారివచ్చాడు
అంగరాజు వెన్నంటివచ్చి
ఆమెను శిక్షిస్తా నంటాడు.
మదనుడి కిక చంపలేని
బ్రతుకే అక్కరలేదు.

ముసిలి:—మహారాజా! ముసిలివాడిని
మన్నించి ఇది చెప్పండి.
ఎక్కడిది దీ గొల్లపిల్ల?
ఎవరివాడు ఈయువరాజు?

చక్ర:—ఎందుకు ముసిలీ! నీ కీ
సందర్భం లేని ప్రశ్నలు?

చక్ర:—అంగపురికి పొలిమేరలో
ఆమె ఉండే గొల్లపల్లి.
అంగపుత్రు డీయువకుడు.

శంకరి:—అంగపుత్రుని ఎన్నిక ఎంతో
అమూల్యమైనది ప్రభూ!
దివ్యమయిన ఈ మోముఖం

దేవిఅవతారంలాగ ఉంది.

చక్ర:—ఆమెముఖాన్ని చూసి అందరూ
ఏమో పిచ్చి యెక్కిపోతున్నారు.
సేవకులారా! తక్షణ మీ మెను—

ముసిలి:—దేవా! ఆగండి ఒక క్షణం.
ఈమె గొల్లపిల్ల కాదు.

పె. గొ:—అవునే సామీ! నేనూ
అలకించమన్నాను.

ముసిలి:—పెదగొల్లా! నీ కడారిలో
పదహారేళ్లకు పూర్వం
గాలివాన వెలిసిన వెనక
కనబడిం దీపసికూన.

పెద:—సిత్తం! బాబూ! సూసినట్టు
సెప్పతున్నారు తమరు.

ముసిలి:—చూశానుగనకే చెపుతున్నాను.

వక్ర:—చూసినవాడవు నువ్వెవరు?

ముసిలి:—నే నెవరయితే యేమిగాని
ఆ నవనవలాడే జవ్వని
మాయాదేవికి చెరలో పుట్టిన
మహాలక్ష్మి అవతారం.

అందరూ:— ఆ!!

వక్ర:—ఆగంతకుడా నీ వెవరు?

శంకరి:—ఆ గొంతుక నేను విన్నదే!...
ఇంకెవ్వరు రాజా! మీ
శంకర మంత్రి!

వక్ర:—ఆహా! ఎంతటి చిత్రాలిప్పుడు
అవలోకించాం! చంపా!
దయమాలి నిన్ను పంపించిన
తండ్రిని నేనే సుమా! నీ
తల్లిని పొట్టను పెట్టుకున్న ఆ
తండ్రిని నేనే సుమా!
నన్ను క్షమించగలవా తల్లీ?

చంప:—ఎన్నడో జరిగినవాటిని
మన్నించడానికి నే నెవ్వరిని?
తండ్రీ! మీ ఆశీస్సులు నా
తలమీ దుంటే చాలు.

పె. గొ:—రాసబిడ్డ యెరగక తల్లీ
పోసన సరిగా సెయ్యలేదు!

చంప:—బాబా! నీ పెంచిన ప్రేమకు
బాకీ నా కీజన్మకు తీరదు.

చక్ర:—మదనా! గొల్లవాడలోపల
యెదిగే రాచబిడ్డను చటుకుని
గుర్తించిన నీచూపే చూపు
గుడ్డివాణ్ణి నేనే చివరకి.

మద:—తండ్రు లిద్దరూ మా యిద్దరినీ
దయతో ఆశీర్వదించండి.

చక్ర, వక్ర:—ఇరు రాజ్యాలకు పట్టుగొమ్మలై
చిరకాలం వర్ధిల్లండి.

వక్ర:—శంకరమంత్రీ! నీకథ ఏమిటి?

శంకర:—స్వామీ! గాలివానలో ఓడ పగిలి
పాపా నేనూ మాత్రం బ్రతికి
ప్రాణాలతో గట్టుచేరాం.
పాప పాపం ఆకలివేసి
పాలకోసం ఏడిస్తే ఈ
గొల్లదారిలో పాపను వదలి
ఎల్లాగో నే తప్పుకున్నా.
ఓడదొంగలు నన్ను పట్టుకుని
జాడ తెలియని దేశంలోకి
తీసుకుపోయారు.
పదహారేళ్లు వాళ్లకి ఏవో
కథలు చెప్పతూ గడిపాను.
నేటికి మళ్లీ అంబదయచేత
నే నింటికి చేరుకున్నాను.

వక్ర:—ఈసుఖసమయంలో ఒకటే
కోసివేస్తోంది నన్ను.
మాయాదేవే బ్రతికిఉంటే
మన సంతోషానికి మేర లేదు.

శంకరి:—రాయి మలిచి శిల్పి ఒక్కడు రాజా!
మాయాదేవిని సృష్టించాడు.
పదహారేళ్లు ప్రయాసపడి
పదిలంగా చెక్కాడు.
ఆ ప్రతిమను మీరంతా
ఆలోకిద్దురుగాని రండి.

(విరామం)

దగ్గర కెవరూ రాకూడదు.
దగ్గితే అదిరిపోయే బొమ్మ.
ఈ తెర తీస్తే వెనక విగ్రహం
చేతులు కట్టుకు నిలవండి.

[తెరతీసిన ధ్వని.]

వక్ర:—ఆహా! జీవప్రతిమను మలిచిన
ఆశిల్పి ఎవ్వడో గదా!
వయసుతో నెరిసిన తలకట్టూ
వాలిన ముఖాన్ని ముడతలూ
పదహారేళ్లు పెరిగిన మాయను
ప్రయాసపడి చిత్రించాడా!

శంకరి:—రాజా! ఇక చాలీవెర్రి
రాణివిగ్రహం తడి ఆరాలి;

వక్ర:—శంకరీ! ఒక క్షణం మాడనీ,
అంకంలో పసిపాపను మాయా!
అన్యదేశాల పాలు చేసినా
అమ్మవారి దయ రక్షిస్తే
ఆమె తిరిగివచ్చింది.
చూడీచంప! పదహారేళ్లు
ఈడువచ్చిన మన బిడ్డ!...
ఆహా! అదేమి చిత్రం! మాయా!
అకళ్లవెంట నీళ్లేమిటి?
బ్రతికేఉన్నావా? మాయా!
బ్రతికేఉన్నావా? (నిట్టూర్పులు.)
శంకరీ! ఎంత నాటకం
సాగించావమ్మా!
మాయాదేవిని ఎంత నన్ను
మాయచేసి దాచావు!

చక్ర:—మిత్రుడా! మన అదృష్టానికి
మేరలేదు సుమా నేడు!

మాయా:—నాథా! ఇంతటి సుఖదినం తిరిగి
నాకు వస్తుందనుకోలేదు.

వక్ర:—ఉత్తనరాలలో మళ్లీ
కొత్తబలం నిండుతోంది.
గొల్లా! మాపిల్లను పెంచిన
చల్లదనం మరిచిపోను.

పె. గొ:—పెభువుల దయుంటే సాలు.

వక్ర:—సేవకులారా! పెద్ద విందుకి
సిద్ధం చెయ్యండి పురినంతా!
రేపే చంపామదనుల పెళ్లి!
[దూరానికి ఒక గొంతుకతరవాత ఒకగొంతు]
రేపే చంపామదనుల పెళ్లి!
రేపే చంపా... .........

కాలం:—(పాట) ముసురులు మూసిన చీకటిరేలను
ముసుగులు తన్నిన యౌవనులూ!
కన్నులు తెరవని చిన్నపాపలకు
చన్నులు గుడిపే తల్లులూ!
పిన్నలు! పెద్దలు! భార్యలు! భర్తలు!
విన్నారా! ఈకత!
ఏనాడో నేనే అల్లిన ఈ
వానకారుకత.



# జాడలు

= శ్రీ గుంటూరు సత్యనారాయణ =

చలనము లేక, మోముల ప్రశాంతత తాల్మియు తాండవింప ని
ట్టలసట లేక నీప్రతిమ నాత్మఁ దలంచుచు మౌనముద్రలో
నిలచి తపించుచున్న వివి నిక్కపు కొండలా? లేక ముక్తికై
కలలను కాయుచుఁ కరడుకట్టిన యోగుల గుండ్లెలో? ప్రభూ!

హోరున రోదసీకుహర మున్యెల్లలూగి ప్రతిధ్వనింప, పొం
గారి, నురుంగులోడ్చుచు, ప్రయాసభరమ్మున స్రుక్కి-స్రుక్కి, ఇ
ట్లోరిమి పారు నివ్వి నదులో? నిను కానగ వేచివేచి వే
సారి, ద్రవించి పారెడు వ్రజప్రమదాహృదయంబులో? ప్రభూ!

ఈ విపినాంతరాల వికసించి, దిశాంతము లెల్ల నిండ నె
త్తావుల జల్లి పాదపముదాపుననే వసివాడి వత్తలై
ప్రోవులుగట్టి రాలె నివి పూవులా? నిన్నెద నిల్పి గోపికల్
కోవలుకట్టుకొన్న తొలికోర్కెలు కూలిన ప్రోవులో? ప్రభూ!

హాయిగ నీవనాల చివురాకులు మెక్కి, స్వరమ్ము పంచమ
స్థాయిని మేళవించి, ప్రమదంబున పాడెడు, కొమ్మకొమ్మకున్
తీయగ నివ్వి కోకిలలా? నీమృదులాంచితవేణునాద చిం
తాయుతలై యుగాల ప్రతినాదము సల్పెడి గోపకన్యలో!

కమికెడు తిండి లేక, పయి కప్పగ వస్త్రము లేక, తిన్నగా
గమన మొనర్ప లేక, కనికారము లేని జగాన తిర్గు నీ
బొమికల పోగు మానవుడో? మూర్ఖులు చేరి మతమ్ముపేర లో
కమునకు పెట్టు చిచ్చులకు క్రాగి చరించెడి నీవా? నాప్రభూ!

నిండి సమస్తదిక్కుల, గణింపగ నాపరిమాణజాలమం
దుండక దాటిపోవుచు, మహోజ్జ్వలమై వెలుగొందు నిద్ది బ్ర
హ్మాండమొ? ద్వంద్వమం దొకటియై రహియించెడి నీస్వరూపముం
గుండెలలో నిముడ్చుకొను కోమలమౌ పరమాణువో? ప్రభూ!

---

# TIMES HAVE CHANGED!




## రోజులు మారినవి

**మునుపటి, నేటి గడియారాలు!**

వేళ తెలిసికొనుటకు షుమారు క్రీస్తు పూర్వం 800 ఏండ్లక్రింద సన్‌డయల్ అనే సాధనం ఉపయోగించేవాళ్లు. తరువాత రానురాను యీసాధనాలు ఒక్కొక్కటిగా మారిపోయి, తదను భవానుభవఫలితంగా నేడు నిర్దుష్టమగు "వెస్టు ఎండ్" గడియారముల లోనికి దిగినవి.



న్యూ కాలిబర్ "యి"

| | | |
|---|---|---|
| నికెల్ సిల్వర్ కేసు | ... | రు. 62 |
| ఎవర్‌బ్రైట్ స్టీల్ | ... | ,, 71 |
| 18 క్యా॥ సాలిడ్ గోల్డు | ... | ,, 197 |



గేట్-లూప్ రెక్టాంగ్యులర్

| | | |
|---|---|---|
| 18 క్యా॥ సాలిడ్ గోల్డు | ... | ,, 304 |

రవాణాలు సరిగా లేనందున, ప్రకటించిన రకాలన్ని మేము సప్లయి చేయలేకపోవచ్చును. కాని మాస్టాకులో వుండి సాధ్యమైనంతవరకు ఆర్డర్లు ప్రకారం గడియారాలు పంపబడుచుండును.

వెస్టు ఎండ్ వాచ్ కంపెనీ, బొంబాయి & కలకత్తా.

# WEST END WATCH Co.

*Bombay • Calcutta*

# పితృదేవతలు-వారిఋణము

= శ్రీ సూరి రామసుబ్బరాయశాస్త్రి =

భారతవర్షము కర్మభూమి. వేదవిహిత కర్మాచరణమున బద్ధనియమము కలది. ఆవిర్భావాది లయాంతము ప్రతిజీవుడు కర్మయందుత్పన్నమయి, కర్మయందుండి, కర్మయందు లయమగుచున్నాడు. ఇట్టి కర్మరూపమగు సృష్టియందు మానవజన్మ ముత్కృష్టమైనది. అం దాధానాదిశ్మశానాంతము, ప్రత్యహ ముత్థానాదిశయనాంతము నిర్వర్తింపదగిన విధుల నతీంద్రియద్రష్టలు దేశకాలపాత్రముల ననుసరించి నియమించిరి.

ఆధానాది శ్మశానాంతకాలమున గర్భాధానాది షోడశ సంస్కారములు విధింపబడినవి. అందు గర్భాధానము పిండోత్పత్తికొరకును, సీమంత పుంసవనములు గర్భస్థ శిశుసంరక్షణార్థమును, దచ్ఛిశువు పురుషుడు కాగలందులకు నుద్దేశింపబడినవి. గర్భస్థపిండమే యేరూపములం దెట్లభివృద్ధినొందునదియు, గర్భవతి ఆయా మాసములందు బాటింపవలసిన నియమములును వివరింపబడినవి. శిశుజననానంతరము జాతకర్మ, నామకరణము, అన్నప్రాశనము, చౌలము, కేశఖండనము, కర్ణవేధ, అక్షరస్వీకరణము, ఉపనయనము, సమావర్తనము, వివాహము మొదలగు సంస్కారములును, శరీరపతనానంతర ముత్తరక్రియలును విహితములైనవి. ఈ యుత్తరక్రియలను శ్రద్ధతో నిర్వర్తించిన పుత్రునివలన బితరులు పున్నామనరకమునుండి తరింపజేయబడుచున్నారు. అందుచే 'అపుత్రస్యగతిర్నాస్తి' యను నార్యోక్తి కలిగినది.

మరణమనగా శరీరపతనమని తలచుచున్నాము. కాని శరీరమును జీవు డెప్పుడు విడచునదియు తెలియదగియున్నది. జీవుడు శరీరమునందు హృత్కమలమున నుండును. "స య ఏషోఽంతర్హృదయ ఆకాశః, తస్మిన్నయం పురుషో మనోమయః, అమృతో హిరణ్మయః" అని శ్రుతివాక్యము. అవసానసమయమునందు గఫవాతపిత్తాదిజనితమగు వ్యాధిచే హృదయకోశము సంకుచితమై నిశ్చేష్టిత మగును. అట్టితరి శరీర మెట్టి కర్మాచరణమునకు నసమర్థ మగుటచే మరణము సంభవించినట్లు మనము భావించుచున్నాము. హృదయమాగుట (Heart_failure) చే మరణము కలిగెనని కొన్ని సమయములందు వైద్యులు చెప్పెదరు. అట్లు హృదయ మెందుల కాగిపోయెనో తెలిసికొనుట వైద్యుని కర్తవ్యముగాని మృతినొందుటకు హృదయమాగిపోవుట కారణ మనిన జాలదు. నవరంధ్రములు బంధించినను ప్రాణము పోవుచున్నది. ఈప్రాణ మెచ్చటి కేమార్గమున బోవుచున్నది? ఎచటికిని బోవుట లేదు. రాత్రులందు ముకుళించిన కమలమునందలి భృంగమువలె సంకుచితమైన హృదయమునందు జీవుడు బంధింపబడియుండును. ఆశరీరము చెడకమును ఏప్రయోగముచేనైన నందలి హృదయకోశము మరల జలింపజేయగలుగునెడల నా మానవుడు మరల సజీవుడు కాగలడు. ఈ కారణముననే విగతజీవుల గొంతసేపటివరకును పునర్జీవితులనుగా జేయగలుగుచున్నారని వినుచున్నాము. ఇట్లు సర్పదష్టులై మృతినొందినవారల నిరువదినాల్గుగంటలలోపల బునర్జీవితుల జేయగల్గు మంత్రములు కలవు. అనగా నామంత్రములు సర్పవిషదోషముచే నాగిపోయిన హృదయకోశము నిరువదినాల్గు గంటలలోపుగా మరల జలింపజేయగలుగుచున్నవని యర్థము.

శరీరపతనానంతరము దహనసంస్కారమువరకును సల్పు కర్మలందు నీ విషయము విశదమగుచున్నది. శవమును మార్గమధ్యమునందు మూఁడుచోట్ల దింపుదురు. దీనినే దింపుడుకళ్ళెమాశ యనియుఁ జెప్పుదురు. దహనసంస్కారముచే బ్రహ్మరంధ్రము విభిన్నమై జీవుఁడు శరీరమును విడచిపోవును. అంతవరకును శవముతో శ్మశానమునకుఁ జనిన బంధుమిత్రులచ్చటనే యుండి కపాలమోక్షమైనపిమ్మట నింటికిఁ దిరిగివత్తురు. తదనంతరము ప్రేతసు దహనజనితతాపోపశమనార్థ మొసంగఁబడు తిలోదకాదికములు నీ యంశమును బోధించుచున్నవి. అన్యమతములందలి యాచరణములును నీ విషయము ననువదించుచున్నవి. మ్లేచ్ఛులు మృతకళేబరమును ఖననముచేసి యందు జీవుఁడు కలఁడని నమ్ముచుఁ దత్సంరక్షణార్థము సమాధులఁ గట్టించుచున్నారు. క్రైస్తవులు నిట్లే విశ్వసించుచు విచారణదినమున (Judgment day) నీ జీవుఁడు శరీరమునుండి లేచివచ్చి భగవంతుని యాజ్ఞ కెదురు చూచుచుండు నని నమ్ముదురు.

ఇఁక శరీరమునందు బంధితుఁడగు జీవుని కెట్లు విముక్తి కలుగు నని విచారింపఁదగియున్నది. జన్మాంతరమును విశ్వసింపని మతస్థు లీ శరీరమును ఖననముచేసి యూరకొనుచున్నారు. అట్లుకాక పునర్జన్మ కలదనుకొను కొన్ని మతములందు నాకసమునందెత్తుగా నిర్మింపఁబడిన మంచాదులందు శవముల నుంచి పక్ష్యాదుల కాహారముగా నొసఁగుచున్నారు. అన్నిటికంటె దహనసంస్కార మతి సులభమును, సుఖదమును నై యున్నది. అంతియకాని, ప్రకృతి శాస్త్రజ్ఞులూహించునట్లు కేవల మారోగ్యవిధుల ననుసరించి గ్రామపారిశుద్ధ్యమునకై యీ దహనసంస్కార మేర్పడినది కాదు. యతీశ్వరుఁడు స్వచ్ఛందమరణము నొందుఁగావున దహనసంస్కార మనవసరము. బద్ధజీవుఁడు లేని యీ శరీరమువలన నాశౌచాదికములును కలుగవు. అయిన నింక నేకారణముచే నైన జీవుఁ డాశరీరమున నుండునేమో యను సంశయ నివారణార్థము ఖననమునకుఁ బూర్వము నారికేళముచేఁ దచ్ఛిరమును భేదింపవలయు నని చెప్పఁబడినది.

శరీరదహనానంతర మందలి జీవుఁడు కొంపతగులఁబడినవానివలె నేమియుఁ దోఁచక ఆ శరీరమునందును, నిహలోకమునందును భ్రాంతి విడువఁజాలక ఆయాప్రదేశములందు దుఃఖించుచుండును. దశదినములందు సల్పు ప్రేతకర్మలచే దుఃఖము కొంత యుపశమింప నిహలోకమును వీడి పితృలోకమునకుఁ జనును. అంతవరకు నాజీవునకుఁ బ్రేతత్వము, పిమ్మటఁ బితృత్వము కలుగును. అకస్మాన్మరణముచే నకాలమృత్యువు నొంది యిహలోకవాంఛలు తీరని కొందరు జీవులు ప్రేతసంస్కారముచే దుఃఖోపశమనము నొందఁజాలక ప్రేతత్వానంతరము పిశాచత్వము నొంది యిహలోకమునందు మక్కువ గల వస్తువులందును, స్థలములందును, మనుజులందును సంచరించుచుఁ దమ కనుగుణములగు కార్యము లొనరించుచుందురు. ఇదియు పాపభూయిష్ఠ మగు నొక జన్మాంతరము.

ఇహలోకమున భౌతికశరీరమును విడచిన జీవులాతివాహికశరీరములఁ దాల్తురు. వారలకు దేవయానము, పితృయానము నని రెండు మార్గములు. పునరావృత్తిరహితశాశ్వతబ్రహ్మలోకమున నిత్యనివాసము నొందఁదగిన జీవులు దేవయానమున సూర్యమండలము నొందుదురు. అట్లుకాక, జన్మాంతరముఁ బొందఁదగిన జీవులు పితృయానమునఁ జంద్రమండలము నొందుదురు. మరల శరీరమును జేరుటకుఁగాను జీవులు ద్యు, పర్జన్య, పృథివీ, పురుష, యోషిత్తు లను నైదాహుతుల గడువవలసియున్నది. ఈపరిణామమునందును గొంత కాలవ్యవధి యగును. ఇంతియకాక వారి పురాకృత కర్మఫలము ననుసరించి వారు మరలఁ జేరవలసిన మాతృగర్భము సిద్ధముగ నుండవలసియున్నది. అందుచే జీవుల పితృలోకనివాసకాలమున కింత పరిమితి యని నిర్ణయింప నలవికాదు. దినములు కావచ్చును; లేక శతాబ్దములు, సహస్రాబ్దములు కావచ్చును. ఈవ్యవధిని మనము తెలిసికొనఁజాలము కావుననే పితృ, పితామహ, ప్రపితామహాది మూఁడు పురుషాంతరములవరకైన, ననఁగా సుమా రొక శతాబ్దకాలమువరకును బితరులకుఁ బిండోదకక్రియాదులు విధింపఁబడినవి. ఇంతియకాని ప్రతిజీవుఁడు నొక శరీరమును విడిచినవెంటనే

తృణజలూకన్యాయమున మఱియొక శరీరమును జూచుకొను నను వాక్యమువలన ప్రతిజీవునకు నిహశరీరపరిత్యాగము కలిగినవెంటనే యుత్తరజన్మయొక్క స్ఫురణమువ్మాత్రమే కలుగు నని యర్థముకాని యీశరీరమును విడచిన యవ్యవహితోత్తరక్షణమునందుఁగాని, తృణజలూకమువలె ఈశరీరమును వదలక ముందేకాని యన్యశరీరమును బొందునని యూహింపఁదగదు. "జాతస్యహి ధ్రువో మృత్యుః, ధ్రువం జన్మ మృతస్యచ" అను వాక్యము ననుసరించి దేహాంతరము కలదని తెల్పుటయే యీ వాక్యముల యాశయము.

"విధూర్ధ్వభాగే పితరో వసంత
స్స్వాధ స్సుధాదీధితి మామనంతి,
పశ్యంతి తేఽర్కం నిజమ స్తకోర్ధ్వ
దర్శే యతోఽస్మా ద్ద్యుదళం తదైషాం.
భార్ధాంతరత్వా న్నవిధో రధస్థం
తస్మా న్నిశీథః ఖలు పూర్ణిమాయాం,
కృష్ణే రవిః పక్షదళే ఽభ్యుదేతి
శుక్లేఽస్తమే త్యర్థత ఏవ సిద్ధం."

(సిద్ధాంతశిరోమణి)

పితరులు చంద్రమండలమున నూర్ధ్వభాగమున వసింతురు. అమావాస్యనాఁడు సూర్యచంద్రు లేకరాశిగతులైయుండుటచే, చంద్రమండలమునకు సరిగా పైనుండు సూర్యు నాకాశమధ్యమందు పితరులు చూచుచున్నారు. అపుడు వారలకు మధ్యాహ్నము. సూర్యునికంటె గమనమునం దధికుఁడగు చంద్రుఁడొక్కొక్క తిథిచే సూర్యునకు ౧౨° భాగలు దూరమగుచుండును. ఇట్లు ౭½ రోజులకు, నవఁగా శుద్ధాష్టమినాఁడు సూర్యచంద్రాంతరము మూడురాసులు, లేక ౯౦ భాగలు. అదిమొదలుగ సూర్యుఁడు పితరులకు దిగ్వలయముకంటె క్రిందికిఁబోవుచుండుటచే వారలకుఁ గాన్పింపకుండునుగావున నది వారలకు సూర్యాస్తమయము. పూర్ణిమనాఁడు సూర్యచంద్రులు ౧౮౦ భాగల దూరమునఁ బరస్పరాభిముఖు లగుచుందురు. అప్పుడు చంద్రమండలమునకుఁ బైభాగమున నున్న పితరులకు సూర్యుఁడు సరిగా క్రిందిభాగమున నుండుటచే నపుడది వారల కర్ధరాత్రము. మరల ౭½ దినములకు, నవఁగా కృష్ణాష్టమినాఁడు చంద్రునకు సూర్యుఁడు ౯౦ భాగలలో నుండుటచే నదిమొదలుగఁ బితరులకు దిగ్వలయమునఁ గాన్పించుట యారంభమగును. కావున నది వారల కుదయకాల మగును. ఇట్లొక చాంద్రమాసముచేఁ బితరుల కొక్క యహోరాత్ర మగుచు నందమావాస్యమధ్యాహ్నము, పూర్ణిమయర్ధరాత్రము, కృష్ణాష్టమియుదయము, శుద్ధాష్టమిఅస్తమయము నగును. ఇట్లు పితరులకు మధ్యాహ్నకాలమగు నమావాస్యనాఁడు పితృప్రీత్యర్థము తర్పణాదులు విధింపఁబడినవి. సూర్యుఁ డొక్కసారి రాశిచక్రమును జుట్టివచ్చుట కగు సౌరవత్సరకాలమునందు సూర్యచంద్రగతుల ననుసరించి షణ్ణవతి (౯౬) పితృపర్వములు కలుగుచున్నవి. ఈషణ్ణవతి దినములందును బితరులకు క్షయ వత్సరమునఁ దత్తదుక్తవిధములఁ బైతృకక్రియలాచరించినఁ బితరుల కాత్మశాంతి కలుగునని చెప్పఁబడినది. ఇట్లు పితృప్రీత్యర్థ ముద్దేశింపఁబడిన కర్మలన్నియుఁ బరస్పర బలాధికములగుచు దుష్కర్మాది ప్రతిబంధకబాహుళ్యములేని జీవులకు నుత్తమగతి సాధకము లగును. అందుచే మృతసంవత్సరమునందు సల్పు తీర్థశ్రాద్ధాదికములును నుత్తమోత్తమములై సంపూర్ణ ఫలప్రదము లగును. ఇట్లు పితృతరణార్థ ముద్దేశింపఁబడిన కర్మల శ్రద్ధాళుండయిన పుత్రుఁ డొనర్చి పితరులఁ బున్నామనరకమునుండి తరింపఁజేయుచున్నాఁడు. పితౄణమును దీర్చుకొనుటకు బుత్రునకిదియే యుత్తమావకాశము.

పాశ్చాత్యదేశములందు భూతావాహనవిధానము నభ్యసించుచున్నారు. భూతముల నావాహనముచేసి వారిచే వారి కోర్కెలఁ జెప్పించుకొనుచున్నారు. ఇట్లు పిలచినపుడు కొన్ని భూతములు వెంటనే ప్రత్యుత్తరమిచ్చును. కొన్ని భూతములు వాని యాత్మశాంతికి భంగము కల్పించినందుల కాగ్రహ మొందుచుండును. మఱికొన్ని యెట్టి ప్రత్యుత్తరము నీయవు. ఇట్లెప్పటికిని ప్రత్యుత్తరము రానియెడల నాజీవుఁ డన్యశరీరమునఁ బ్రవేశించె నని తెలఁదవలసియున్నది. ఈ భూతావాహనము కేవలము సోదులవలె వినోదార్థ ముపయోగపడుచున్నదికాని వారి కాత్మశాంతి యెట్లు కలుగును? పిండపితృక్రియాదులు వానికి యుత్తరసద్గతి కెట్లు కాద

ణము లగు నను వంశమునుమాత్ర మింకను దెలిసికొనఁ జాలకున్నారు.

ఇహలోకము వీడి చనినవానికొఱకై వాని పుత్రమిత్రకళత్రాదులు దుఃఖించు తెఱఁగున నాజీవుఁడును తన యాత్మీయుల నిహలోకమును బరిత్యజింపవలసి వచ్చినందుల కపరిమితముగాఁ బరితపించును. కాలము గడచుకొలఁది దుఃఖ ముపశమించుచుండును. తమ యాత్మీయులు తమ కోర్కెల నెల్ల దీర్చుచుండవలయు నని పితరులు కోరుచుందురు. పాంచభౌతిక స్థూలశరీరము లేనివారగుటచే నైహికవస్తుజాలముల స్వయముగా ననుభవింపఁజాలరు. తమ్ముల నుద్దేశించి యన్యులకుఁ దమ యభీష్టముల నర్పించినఁ దృప్తి నొందుదురు. దేవతారాధనమునందును నిట్లే ప్రతిమారాధనముకంటె అన్యునియం దావాహనచేసి యర్చించిన ప్రత్యక్షపూజయే విశేషఫలదాయక మగును. పండుగలందు దేవతలఁ బూజించి, బ్రాహ్మణులను ధనకనకవస్తువాహనాదులచే నర్పించుట కిదియే కారణము. "పితృపితామహప్రపితామహాదీన్ భవత్సుచ ఆవాహయిష్యే" అనుచు బ్రాహ్మణునియందుఁ బితరుల నావాహనచేసి యర్చించినఁ బితరులు ప్రసన్నులై యాబ్రాహ్మణులయం దావహించి యాసపర్యలచేఁ దృప్తులై "తృప్తాః స్మః" అని తెలియఁజేతురు. కోర్కెయే జన్మకు కారణమగుటచేఁ గోర్కెలు తీరి సంస్కారము నశించినఁగాని జన్మరాహిత్యము కలుగనేరదు కావునఁ బితరుల కోర్కెల నెల్ల దీర్చి వారల కుత్కృష్టగతిని గల్పింపఁ బుత్రుఁ డెల్లవిధములఁ బ్రయత్నించుచుండవలెను. తమవా రెల్లపుడు దమ్ము దలఁచుచుండవలయు నని పితరు లభిలషించుచుందురు. అందుచేఁ బెద్దల నామములఁ బిల్లల కిడు నాచారము మన దేశమునందు కలిగినది. దీనికి విపర్యయముగా సినిమాతారలయొక్కయు, తదితర ఇష్టజనులయొక్కయు నామములచే నిపుడు పిల్లలఁ బిలచుకొనుచున్నారు. ఇట్టి అన్యమతానుకరణ మేలకో!

కులమం దొక్కఁడైన జ్ఞానవంతుఁ డుద్భవించిన నట్టివాఁడు దశపూర్వముల, దశాపరములఁ, దన్నును మొత్తము నిరువదియొక్క తరంబులఁ దరింపఁజేయును. అట్టి జ్ఞానవంతుఁడు తమ వంశమం దెన్నఁడైన జనించునా యని పితరు లెదురుచూచుచుందురు.

కన్యాదానాదిశుభకార్యములందును ముందుగాఁ బితృదేవతాహ్వానము చేసి వారలఁ దృప్తినొందింతురు. అట్టి దీక్షాగృహమునం దితరుల పైతృకకర్మ లాచరింపఁదగదు. భార్య యంతర్వత్నియై యున్నపుడు ఋణానుబంధము కల తన పితరుఁ డొక్కరుఁ డందుఁ బ్రవేశింపఁగలఁ డని యెంచఁదగియున్నది. ఆ గర్భమునందు జీవప్రవేశము కాఁదగిన యారవమాసము మొదలు గర్భిణీపతి శవవహన పైతృకభోక్తృత్వాద్యన్య పైతృకములందుఁ బాల్గొనరాదు. అనఁగాఁ దాను తన పితరుల నారాధింపవలసియుండ అన్యపితృకార్యములఁ బాల్గొనరా దని భావము. ఇట్లే జీవత్పితృకుఁడగువాఁడు శవవహనాదికర్మలందుఁ జేరరాదు. తాను ప్రథమమునఁ దన పితౄణముఁ దీర్చికొనకపూర్వము తా నన్య పితృక్రియలందుఁ బ్రవేశింపరాదు. కాని జీవత్పితృఁడు భోక్తృత్వమునకు ముఖ్యుఁడు. అనఁగా నీతనికిఁ దండ్రి యుంటచే నీతనివలన నర్చ్యలొందవలసిన స్వీయపితరులు లేమి నన్యపితరులు వీనియందు వెంటనే యావహింపఁగలరు. విగతపితృనియం దాలస్యముగా నావహింతురు. గర్భిణీపతియం దావహింపనేరరు. అట్లావహించు నెడల నాపితరుఁడు తత్పత్నీగర్భస్థజీవునికంటెఁ బ్రబలుఁడైన గర్భచ్యుతిఁ గలుగఁజేయును.

ఆశౌచమున శుభాశుభకార్యముల సలుపరాదు. అనఁగా మరణానంతరము ప్రేతత్వమునందు దాయాదియుండఁగాఁ బ్రేతత్వమును వీడి పితృత్వముఁ బొందిన తన యాత్మీయుని యారాధనము కూడదు. శరీరమును విడచి పది దినములలో దుఃఖాతిరేకమున నున్నవాని యాత్మశాంతికై వాని దాయాదులును దోడ్పడవలసియున్నది. అట్టి దాయాదియొక్క జాతమృతాశౌచములం దాత్మీయుని జాతమృతములు కలిగినయెడల నివియే ప్రధానములు. పితరులు ఘంటా భేరీ మృదంగాది ధ్వానములను, ఛురికా, ఖడ్గ, ఖనన, దహన, రక్తపాతాది దృశ్యములను సహింపఁజాలరు. కావున భార్య గర్భవతిగా నున్నపుడును, శ్రాద్ధసమయములందును నిట్టివాని కెట్టి యవకాశము కలుగకుండఁ జేయ

వలయును. భార్య ఋతుమతియై యున్నపుడును పైతృక కార్యముల కనర్హుఁ డగును.

దైవపైతృకములకుఁ బరస్పరాచ్ఛాదన సంభవించినపుడు స్మార్తపక్షమునఁ బైతృకమే ప్రధానముగా గ్రహింపఁదగియున్నది. రుక్మాంగదునివంటి నిత్యైకాదశీనియమశీలుఁడును నేకాదశియందుఁ బైతృకము సంభవించినయెడల నాదినమునఁ దన దీక్షకు స్వస్తి చెప్పి పితృదేవతారాధనము చేయఁదగియున్నది. దైవారాధన మాత్మార్థము. పైతృకము పితృదేవతార్థము. ఇందు ముందుగాఁ దన యుత్పత్తికిఁ గారణులయిన పితరుల కార్యము నిర్వర్తించినపిమ్మటఁ దన కార్యము జూచుకొనవలయునుగాని స్వకార్యానంతరము పితృకార్యము కాదు. ఇట్లు పుత్రుఁడైనవాఁడు పితరుల ఋణముఁ దీర్చికొని కృతకృత్యుఁడై వారల యాశీస్సును బొంది తరించుచున్నాఁడు.

---

## సినిమాతారల పరివర్తనము

(తారల నటనలు, అభిమానుల ఊహలు ఫలించినచో)



# తెనుఁగుతల్లి

= శ్రీ తుమ్మల సీతారామమూర్తిచౌదరి =

తెనుఁగుతల్లీ! నీకు జోహారు
దేశమాతా! నీకు జేజేలు
నినుఁజూచి నినుఁబాడి నినుఁగొల్చువేళ నా
కను లాణిముత్యాల గనులుగా నగునహో!
తెనుఁగుతల్లీ! నీకు జోహారు
దేశమాతా! నీకు జేజేలు

నీపాలు జుంటితేనియతేటలో, గోస్త
నీపక్వరసమో సుధాపూరమో యాట
నాపల్కులీ తీయనకు నోఁచి విశ్వా
ణీప్రపంచప్రశంసాపూరితము లాయె
తెనుఁగుతల్లీ! నీకు జోహారు
దేశమాతా! నీకు జేజేలు

కుటిలశాత్రవకోటిగుండెలో నిదురించి
యిటు సేతు వటు గంగ యెల్లగా జగమేల
నటరాజకంధరానైల్యమ్ము నడఁగించు
పటుకీర్తి పెంచె నీపట్టి యెంతటివాఁడో
తెనుఁగుతల్లీ! నీకు జోహారు
దేశమాతా! నీకు జేజేలు

ఎల్లోరకొండ నీ యల్లారుగీమటే
కొల్లూరి కోహినూరు కొప్పులోఁ బూవటే
కొల్లారుగనులు నీకోశంబటే పండ్లు
పుల్లనైపోవు నీ భోగంబు గన్నవో
తెనుఁగుతల్లీ! నీకు జోహారు
దేశమాతా! నీకు జేజేలు

గౌతమీ కృష్ణానదీతుంగభద్రాది
పూతస్రవంతికా పుంజమ్ము నీముద్దుఁ
గూఁతులై నీచేను నీతోఁట పండింప
నీతనూజులు పైఁడిపాఁతలఁ గప్పిరే
తెనుఁగుతల్లీ! నీకు జోహారు
దేశమాతా! నీకు జేజేలు

ఏపుణ్యలేశంబు నాపాలి దాయెనో
నాపూజ కేలోకనాథుండు పొంగెనో
నీపావనోదర శ్రీపరంపరలలో
నీపదార్చకులలో నేను నొక్కఁడనైతి
తెనుఁగుతల్లీ! నీకు జోహారు
దేశమాతా! నీకు జేజేలు



బాధను శీఘ్రముగా నివారణచేయును

# ఓడ్మన్సు సైప్రెస్ సాల్వు




దీనిగుణము మీకు అత్యద్భుతముగా కన్పించును. పైభాగములకు ఈతైలము వెంటనే ఉపయోగింపుడు. వెన్వెంటనే గుణము కన్పించును.

జాడీ ఖరీదు రు. 1-4-0.

వి. పి. చార్జి అదనము.

---

వాడి చూడుడు - ఉచితము




నరముల బలహీనత, గుండెదడ, వ్యాకులము, తలదిమ్ము, నిస్త్రాణ, హృదయమున నొప్పి, ఇంద్రియనష్టము, వెన్నుపోటు, ఆకలిలేకుండుట మున్నగు దోషములుండిన టపాఖర్చుకు 4 అణాల టపాబిళ్లలు పంపి రెండుదినములకు సరిపోవు ప్రొఫెసరు జేమ్సు ఎలెక్ట్రోటానిక్ పెరల్సు "ట్రీపాకెటు" (ఉచితముగా పంపబడును) తెప్పించుకొని వాడి, దాని అద్భుతగుణమును గమనింపుడు. 40 పెరల్సు సీసా ఖరీదు రు. 2/- తపాలఖర్చు అదనము.

---

ఆంగ్లో ఇండియన్ డ్రగ్ అండ్
కెమికల్ కంపెనీ, బొంబాయి.

# ఈశ్వర్సు
# రత్నపురుష లేహ్యం

శుక్లనష్టము, మలబద్ధము, నరముల బలహీనత; నీరసము తగ్గించి, బలము, కండపుష్టి, రక్తము, వీర్యవృద్ధి నిచ్చును.

# గనోక్యూల్

అనిసెగలను అద్భుతముగ తగ్గించును. ఇతరౌషధములకు లోబడని కేసులలో సహితము యిది కుదుర్చును, మూత్రనాళమందలి మంట, రసివంటి చెడ్డనీరు స్రవించుట అద్భుతముగ తగ్గించును.

# కుముద

స్త్రీల తెల్ల, ఎర్రకుసుమలు. అకాలబహిష్ట, ఋతుశూల, వెన్నునొప్పి, గుండెనొప్పి తగ్గించును. ఋతురక్తమును జారీచేయును. గర్భపాతమును కాకుండచేయును.

అన్ని గొప్ప మందులషాపులయందును దొరకును

---

ఈశ్వర ఫార్మసీ, మద్రాసు.

# దగ్గు
# ఉబ్బసము
# ఆయాసముమరియు
# సకలమైనశ్వాసకోశవ్యాధుల
# మీదను




# అమోఘముగా
# పనిచేయును

# కాశ్మీర్
అన్నిచోట్లదొరకును

క్షీరసముద్రం ఫార్మసీ, రాజమండ్రి.



# స్వర్గీయ వెలగపూడి సరస్వతమ్మగారు

## = శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ =

ఆది ౧౯౩౧-వ సంవత్సరం జూలై నెల. ఆరోజులలో ఒకనాడు నేను శ్రీమతి వెలగపూడి సరస్వతమ్మగారివద్దకు వెళ్లి "మన బాపట్లలో ఒక స్త్రీసమాజం పెట్టవలెనని ఒక విజ్ఞప్తి తయారుచేశాను. ఈ విజ్ఞాపనపై మీరుగూడా సంతకం పెట్టాలె" అని మనవిచేశాను. "స్త్రీసమాజ మెందుకు? దానివల్ల కలిగే ప్రయోజన మేమంత? దీనికి బదులు యుక్తవయస్సువచ్చిన యువతులుగూడా చదువుకోదగిన ఒక స్కూలు పెట్టితే బాగా ఉంటుందిగదా" అన్నారు మా సరస్వతమ్మగారు. "అవును, స్కూలు పెట్టడం మంచిదే గాని అది చాలా ద్రవ్యసాధ్యమైన కార్యం. మావంటివాళ్లు పూనుకోవలసింది కాదు. అయినా సమాజప్రయోజనం సమాజంది, పాఠశాలప్రయోజనం పాఠశాలది. ఒకటి చేసే పని ఒకటి చేయదుగదా" అన్నాను నేను. ఇట్లా కొంత చర్చ జరిగినతర్వాత "సమాజంకంటె స్కూలు పెట్టడమే ఉపయోగకర మనుకుంటాను" అంటూనే సరస్వతమ్మగారు విజ్ఞప్తిపై సంతకం చేశారు. స్థాపనసందర్భంలో యిట్లా తమ అభిప్రాయం వెల్లడించినా స్త్రీహితైషిణీ మండలి స్థాపించినతరువాత సభ్యురాండ్రలో మొదటి పేరు వారిది. చందాపట్టికలో మొదటి పద్దు వారిది. అంతేగాదు, కొంతకాలం మండలికి అధ్యక్షురాలు. కొంతకాలం కార్యనిర్వాహకవర్గసభ్యురాలు. జీవితాంతంవరకు మండలిచందాదారు.

ఒక్క సంవత్సరం గడచింది. "మనమండలిపక్షాన ఒక యువతీపాఠశాల పెట్టితే బాగుండు" నన్నారు సరస్వతమ్మగారు. కాని సహజదౌర్బల్యంతో మండలి ఆ కార్యభారం వహించడానికి వెనుకతీసింది. సరస్వతమ్మగారు ఇక ఆలస్యంచేయలేదు. తక్షణమే ౧౯౩౨-వ సంవత్సరంలో స్వంత యాజమాన్యాన యువతీవిద్యానిలయం స్థాపించారు. వెంటనే ఎనిమిదవ తరగతివరకు రికగ్నైజు అయింది. పిమ్మట కొద్దికాలానికే హయ్యర్ గ్రేడు ట్రైనింగు స్కూలైంది. పాఠశాల పెట్టినది మొదలుగా తండోపతండాలుగా ఆపాఠశాలకు వెళ్లే విద్యార్థినులూ, అందుకోసం నిర్మింపబడే వివిధకట్టడములూ, వసతిగృహాలూ చూస్తే అద్భుతంగా ఉండేది. విద్యావిషయంలోనే కాకుండా లలితకళలలోగూడా పాఠశాల ముందంజవేసింది. ఆవిద్యార్థినులు తయారుచేసే వివిధాలైన చేతిపనులూ, ప్రదర్శించే రమణీయప్రదర్శనాలూ ఎంతో ఆహ్లాదకరంగాఉండేవి. శుక్లపక్షచంద్రుడిలాగా దినదినాభివృద్ధి పొందుతున్న యువతీవిద్యానిలయం చూచి లోలోన ఉప్పొంగుతూ ఉండేవాళ్లం. గత పదిసంవత్సరాలలో దాదాపు మూడువందలమంది నిరా

ధారలైన యువతులు సరస్వతమ్మగారి చలవవల్ల స్వతంత్రజీవనం చేయగలవారైనారంటే చాలు, మాసరస్వతమ్మగారు ఆంధ్రయువతీలోకానికి చేసిన సహాయం యెంత ఉదాత్తమైందో చెప్పడానికి.

మాసరస్వతమ్మగారికంటె అధికంగా చదువుకున్నవా రుండవచ్చు, ధనికురాండ్రూ ఉండవచ్చు, స్త్రీవిద్యాసంస్థలను బహుకాలంగా నడుపుచున్నవారూ ఉండవచ్చు. కాని వారివంటి విద్యాభిరతిగల స్త్రీరత్నంమాత్రం ఉండటం అరుదు. స్త్రీలల్లో బాగా విద్యాభివృద్ధి అయిననాడే స్త్రీలోకానికి మోక్షం. హక్కులు, అధికారాలు, బాధ్యతలు ఎన్ని లభించినా స్త్రీ చదువుకొన్నదై తేనే వాటిని సక్రమంగా వినియోగించగల అర్హురాలవుతుందని ఆమె దృఢవిశ్వాసం. కనుక సరస్వతమ్మగారిలోని ప్రత్యణువు విద్య విద్య యని కలవరించేది.

పాఠశాలే గాదు వారి గృహంగూడా ఒక బ్రాహ్మీమందిరమే. ఆ యింటిలో ఏవంక చూచినా విద్యావ్యాసంగం తప్ప మఱొకటి కన్పించదు. కళాశాలవిద్యకో, సంగీతపరీక్షకో, చిత్రలేఖనమునకో, సంస్కృతమునకో, హిందీకో—ఏదోఒక విద్యాకృషియే అతల్లికన్న బిడ్డలు నిరంతరం చేసే పరిశ్రమ. సరస్వతమ్మగారికి నలుగురు కొమార్తెలు, నలుగురు కొమారులు. కొమార్తెలు ముప్వురు యింటరుమీడియేటుపరీక్షకు చదువుచున్నారు. కొమార్తెల విద్యకై సరస్వతమ్మగారు తీసుకున్నంత శ్రద్ధ తీసుకున్నవారుగాని, ఆమె ఖర్చుపెట్టినంతసొమ్ము ఖర్చుపెట్టేవారుగాని స్త్రీలలోఉండటం దుర్లభమనే చెప్పాలె. తన కొమార్తెలు నలువురూ పట్టభద్రురాండ్రు కావలెనని ఆమె కెంతో అభిలాష; అందుకొఱకు కొమార్తెల విద్యవిషయమై బహుళప్రయత్నం చేస్తుండేవారు. సరస్వతమ్మగారికి విద్యపై యింతటి అభిమానం కలగడానికి ఆమె జన్మించిన వంశంగూడా హేతువేమో అనుకుంటాను. మన తెలుగుసీమలో నియోగి బ్రాహ్మణ కుటుంబములో దాసువారి వంశం సుప్రసిద్ధమైంది. చదువుకూ, సంగీతానికీ, సంఘసంస్కారానికీ గూడా దాసు వారి వంశం వాసిగాంచింది. శ్రీ సరస్వతమ్మగారి పితామహులు దాసు శ్రీరాములుపంతులుగారు సుప్రసిద్ధ న్యాయవాదులై యుండీ, పండితకవులై దేవీభాగవతాది మహాగ్రంథాలు వ్రాయడమేగాకుండా సంగీతంలోనూ, భరతశాస్త్రంలోనూ ప్రవీణులై కళావేత్త లనిగూడా ప్రసిద్ధిగాంచారు. నిరక్షరులాయింట పుట్టలేదు. వారి ఆడపిల్ల లందరికీ శారద, సరస్వతి, భారతి, వాణి యివే పేర్లు. సరస్వతమ్మగారి తండ్రిగారు కేశవరావు పంతులుగారు అసాధారణ ప్రజ్ఞానిధి. వ్యాపారంలో అందెవేసిన చేయి. మొదట రైల్వే కంట్రాక్టరుగాను, పిమ్మట వాణీముద్రాక్షరశాలాధిపతులుగానూ ఉండి లక్షలార్జించిరి. లక్షలు వెచ్చించిరి. వారి జీవితమంతా ఒక వెన్నెలపరుగు. శృంగారక్రీడ. తమాషాకులాసా. బోటుషికార్లో, వెన్నెలవిందులో, సంగీతసభలో ఏదో ఒక వినోదకాలక్షేపంతో ప్రొద్దుబుచ్చడమే ఆ రసపాయి నిత్యాభిలాష. సరస్వతమ్మగారి తల్లిగారు వైదేహమ్మగారు. సాధుత్వానికీ, సాధ్వీత్వానికీ ఆమె పెట్టింది పేరు. ఈ పూజ్యదంపతులకు శ్రీ సరస్వతమ్మగారు ౧౮౯౨ డిశంబరు ౨౮వ తేదీని జన్మించారు. తండ్రి యొక్క సామర్థ్యము, తల్లి యొక్క సాధుత్వము సరస్వతమ్మగారిలో మూర్తీభవించింది. సరస్వతమ్మగారు అయిదవ ఫారంవఱకు చదువుకున్నారు. తెలుగులో, యింగ్లీషులో మంచిప్రవేశమున్నది. యింగ్లీషులో వార్తాపత్రికలు వగైరాలే కాకుండా పెద్దపెద్ద యింగ్లీషుపుస్తకాలువగైరాలుగూడా చదువగలిగిఉండేవారు. స్కూలుకు సంబంధించిన ఉత్తర ప్రత్యుత్తరాలన్నీ వారే నడుపుకొనగలిగేవారు. ఎవరో వారి విద్యావిషయం చెప్పగా విని ఒకనాడు ప్రస్తావవశంగా "మీరు లాపుస్తకాలుగూడా చదువగలరుటగా" అని అంటిని. "ఎప్పుడో చిన్నప్పుడు వారు లా చదువుకొనే రోజుల్లో హిందూలా చదివేదాన్ని" అని సరస్వతమ్మగా రనిరి.

౧౯౦౬ లో సరస్వతమ్మగారి వివాహమైంది. సరస్వతమ్మగారి భర్తగారు శ్రీ వెలగపూడి సుబ్బారావు పంతులుగారు. బాపట్లలో సుప్రసిద్ధ న్యాయవాదులు. మూడుతరములుగా వెలగపూడివారింట స్త్రీవిద్యాసంస్థలు వెలసినవి. తొలుత సుబ్బారావుపంతులుగారి

తండ్రిగారగు దక్షిణామూర్తిపంతులుగారి యాజమాన్యమున ఒక బాలికాపాఠశాల నడుపబడుచుండెడిది. పిమ్మట వారిజ్యేష్ఠకొమార్తె శ్రీమతి చోరగుడి సీతమ్మగారు యుక్తవయస్కులగు యువతుల నిమిత్తం ఒక విద్యానిలయం స్థాపించారు. ఆమెఅనంతర మాపాఠశాల నిలిచిపోయింది. సరస్వతమ్మగారు మరల స్త్రీవిద్యాసంస్థను నెలకొల్పి యువతీవిద్యానిలయము మను పేరుతో గత పదకొండు సంవత్సరాలుగా ఈపాఠశాలను అత్యంతసామర్థ్యంతో నడుపుతూవచ్చారు. స్త్రీవిద్యయందు సరస్వతమ్మగారి కెంత ప్రేమో సుబ్బారావుపంతులుగారికీ అంతప్రేమ ఉన్నది. కనుక భార్యయొక్క మనోరథాన్ని బట్టి సుబ్బారావుపంతులుగారే పాఠశాలస్థాపనకు యింత ద్రవ్యం వెచ్చించారో, భర్తగారియొక్క యిచ్ఛ ననుసరించి సరస్వతమ్మగారే యింత సామర్థ్యంతో పాఠశాలను నడిపారో విడబఱచి చెప్పడం కష్టం. అసలు ఈ విమర్శచేయడంకంటె వారిద్దరూ ఒకే మనోభావం గలవారై యీ మహత్తరవిద్యాసంస్థను పరస్పర సహకారంతో నిర్వహించుకవచ్చా రనడం పరమ సత్యం. సరస్వతమ్మగారి దాంపత్యం సర్వోత్తమమైంది. ఆదంపతుల పరస్పరానురాగం అసదృశం. ఒకానొక పుష్పలత చక్కని పూవులు పూచేదే, కమ్మని తావులు విరజిమ్మేదే, సౌందర్యవిలసిత మైందే కావచ్చు. కాని దానికి మంచి అల్లు లేకపోతే అది నేలపైబడి పొరలి ధూళిలో క్రుంగి నశించిపోతుంది. అట్లాగే స్త్రీకి భర్తఅవలంబం లేకపోతే ఏవిధంగానూ ఉచ్ఛస్థితికి రావడానికి అవకాశం లేదు. ఇందుకే వనితా, కవితా, లతలు ఆశ్రయంలేక శోభిల్లవన్నారు పెద్దలు. సరస్వతమ్మగారికి పూర్వపుణ్యవశంబున ఉదారాశయు డగు భర్తఆశ్రయం దొరకింది. ఆమెభావమంజరులను పలుత్రోవల ప్రాకించగలిగింది. అందువల్లనే గదా "ప్రీతుడై పతి గరుణించెనేని గులభామిని భాసుర భూషణాంబ రాన్విత ధనధాన్యగౌరవము విశ్రుతసంతతియుక్ యశంబు సద్గతియును గల్గు నొండు మెయి గల్గునె యిన్ని తెఱంగు లారయక" అని చెప్పింది భారతం. ఈపత్యనుకూలత సంపాదించుకోడానికి సరస్వతమ్మగారి సౌజన్యతయే కారణం. "పతి గడకంగ దైవతము భామల కెందును లే" దని ఆమెనమ్మకము. ఒకమారు రాజేంద్రబాబు వచ్చే సందర్భాన గాబోలు పురస్త్రీల పక్షాన ఒక సన్మానపత్రికా, కొంత ధనమూ సమర్పింపదలచి సరస్వతమ్మగారింటికి చందాకు వెళ్ళితిమి. సరస్వతమ్మగారు చందాయివ్వజాల నన్నారు. "ఏమిటి కారణం" అన్నాము. "వారు యివ్వలేదట. నేనూ యివ్వను. వారిదో మార్గం, నాదో మార్గం గాదు. యిప్పటివఱకూ అట్లాగే వెళ్లుతున్నది; యికముందేమో" అన్నారు. ఆమె చందా యివ్వనందుకు నాకేమాత్రం కష్టం గలుగలేదు. ఆమె ధర్మనిష్ఠకు అప్రయత్నంగా నాచిత్తం ఆమెకు ప్రణమిల్లింది. ఒకమారు ట్రైనింగువిద్యార్థినుల వీడ్కోలుసమావేశం సందర్భంలో ఆబాలికలు పద్యములు వ్రాసి సమర్పించిరట. అందులో వారు తమవిద్యానిలయపు మేనేజరుగారైన సరస్వతమ్మగారిని ముందు ప్రశంసించి ఆతరువాత పద్యంలో సుబ్బారావుగారిని ప్రస్తావించి రట. మరునాడా విద్యార్థినులా పద్యపత్రికకు ఫ్రేము కట్టించవలెనని ఉద్దేశించి ఆపత్రికగొని సరస్వతమ్మగారి వద్దకు పోగా సరస్వతమ్మగారు సంగతి తెలుసుకొని "ఆదేమిటి ముందు నాపేరు వ్రాసి తరువాత పంతులుగారి పేరు వ్రాశారేమి? వారిద్రవ్యం, వారిసహాయం, సమస్తవిధాలా వారితోడ్పాటు ఉంటేనే గదా నేను పాఠశాల నడుపుతున్నది? వారి పేరే ముందు ఉండాలె. ఆసవరణ ముందుచేస్తేనే గాని దానికి అద్దంకట్టించడానికి వల్లగా దన్నారట. అట్లాగే సవరించి ఫ్రేముకట్టించితి మని విద్యార్థినులు నాతో చెప్పిరి. ఒక్క పాఠశాలవిషయంలోనే గాదు, ఒక్క భర్తవిషయంలోనే గాదు, గృహవిషయంలోనే గాదు, ఆహార విహారాల్లోనే గాదు అన్నిటిలోనూ సరస్వతమ్మగారి వర్తనం నియమపూర్వకమైందే. అత్యంతదుర్బలశరీరయు, వ్యాధిగ్రస్తయు అయిన సరస్వతమ్మగారు యేబదేండ్లవఱకూ జీవించారంటే ఆమె దాదాపు ముప్ఫదేండ్లుగా నడుపుతూ వచ్చిన ప్రకృతి చికిత్సానియమాలే అందుకు కారణమని చెప్పవచ్చును.

సరస్వతమ్మగారికి యిరువదేండ్లు నిండీనిండని యెలప్రాయంలోనే క్షయవ్యాధి అంకురించింది.

ఔషధచికిత్సలన్నీ విఫలమైనతర్వాత కూనేగారి తొట్టి వైద్యగ్రంథాలు తెప్పించి స్వయంగా చదివి తొట్టి వైద్యం ఆరంభించారు. అంతే. తుదివఱకూ వారి జీవితం ప్రకృతిచికిత్సమీదనే నడిచింది. సరస్వతమ్మగారు జలచికిత్స చేపట్టి అప్పటి కప్పుడు నీళ్లాడిన పచ్చిబాలెంత తొట్టిలో కూర్చుండీ, తలార స్నానంచేసీ కొబ్బరి కాయనీళ్లూ, నారింజపండ్లరసమూ పుచ్చుకుంటూఉంటే పచ్చిబాలెంతేమిటి, ఈ పథ్యపానా లేమి టని పెద్ద వాళ్లంతా హడలిపోతూఉండేవాళ్లు. ఏమైతేనేమి, ఆమెకాన్పులన్నీ కస్తూరి, యింగువ, వెల్లుల్లి కండ్ల చూడకుండానే సలక్షణంగా జరిగిపోయినాయి. ఏనాడు సరస్వతమ్మగారు ప్రకృతిచికిత్స నవలంబించారో ఆనాడే వారు జిహ్వకు బానిసగాకుండా యజమానిగా అయిపోయినారు. సంస్థానంవంటి ఆ యింట్లో ఏప్రొద్దూ కాఫీలే, ఫలహారాలే, పిండివంటలే, మద్రాసో పేతవంటకాలే. ఐతేనేమి, ఆమె ఒక్కటీ నాలుకపై వేసుకొనేదిగాదు. ఆమె చప్పిడి తిండేమో ఆమేమో. అదీ నియమపూర్వకం.

సరస్వతమ్మగారి కుటుంబము చాలా పెద్దది. కొమారులు, కొమార్తెలు, ఆడుబిడ్డలు, మేనల్లుండ్రు, మఱది, మేనగోడలు మున్నగువారేగాక అనుదినము వచ్చి పోవు బంధుమిత్రాదులకు పరిమితిలేదు. ఇందరున్నను ఆమె అందరియెడ అత్యంతప్రేమాదరములు గలిగి యెవ్వరి కేలోపమూ లేకుండా చూస్తూ ఉండేవారు. ఆడుబిడ్డలు వెంటలేక ఆమె యెప్పుడూ ఎవ్వరి యింటికి రాగా చూడలేదు. వారికీ ఆమెయందు సాటిలేని ప్రేమ.

సరస్వతమ్మగారు చూపులకు బహుకుఱుచ. మనము నడుస్తూఉంటే ఆమె వెంటవస్తూఉన్నట్టు అనిపించదు. కాని ఎవరైనా వారియింటికి వెళ్లిరా ఆమె వారితో ఎంతో ఆదరముతో భాషించి గేటువఱకు పంపించి మఱీ వెళ్లుట ఆమెఅభ్యాసము.

సరస్వతమ్మగారు యెల్లప్పుడు సాత్వికతా చిహ్నమైన తెల్లని చీరరవికలనే ధరించేవారు. వెత్తిమెత్తిగా చాలానగలను పెట్టుకొనేవారు కారు. నిరాడంబరమైన ఆమెవేషభాషలను, ఆమెమర్యాదను, వినమ్రతను ఒకమారు చవిచూచినవారు ఆమెను మఱచిపోలేరు. మధురమందహాసాంచితమైన ఆ వదనంలో, ఉజ్వలమైన ఆ నేత్రాలలో అలౌకికమూ, పారమార్థికమూ, విజ్ఞానభరితమూ అయిన తేజస్సేదో ఒప్పిఉండి చూపరులకు నమస్కారవాంఛ కలుగజేసేది.

క్రమశిక్షకు సరస్వతమ్మగారు పెట్టిందిపేరు. ఏ పనినైనా డంబంగా చేయాలనే దానికంటె చక్కగా చేయాలనేదే ఆమెతాత్పర్యం. వారింట జరిగే విందులూ పేరంటాలు గాని, వారి పాఠశాలపక్షాన జరిగే ఉత్సవాదులుగాని ఎంతచక్కగానో కట్టుదిట్టంగానో జరిపేవారు. ఆయా సందర్భాల్లో అందర కన్నిరూపులెత్తినట్టుగా అన్నిటా తానై వ్యవహరిస్తుంటే ఆమె సామర్థ్యం ద్యోతకమవుతుండేది. ఏదైనా ఒకపనికి ఆమెను ఒప్పించడమే కష్టం. ఒప్పుకునెనా అది యిక బాగా ఉండదన్న సంశయం మన కక్కరలేదు. ద్యూటీ ఆమెకు తెలిసినట్లుగా అందరూ తెలుసుకోలేరు. సంఘసంస్కారవిషయంలో ఆమెకు చాలా ఉదారభావా లుండేవి. వరకట్నాలు వద్దనీ, హరిజనోద్ధరణ అవసరమనీ, వివాహవయస్సు హెచ్చించాలనీ, వట్టిమాటలెందుకు చేతనైనంత చేయాలె ననేవారు. ఆమె చేయదలచినవి నిర్భయంగా చేసేవారు.

ఏ కష్టవార్త విన్నా ఆమెమనస్సు వెన్నవలె కరిగిపోయేది. పేదల కష్టం చూచి సహించేదికాదు. యథాశక్తి సహాయంచేసేవారు. హాస్టలులో విద్యార్థినులను కన్నతల్లివలె ఆదరించేవారు. ట్రైనింగు విద్యార్థినులకు స్టయిపెండు ఉంటుంది కనుక మామూలు తరగతులలో చదివే పేదవిద్యార్థినులకు ఉచితభోజనసహాయం చేస్తూఉండేవారు.

ఆమె చేసే సత్కార్యానికి ఆమె యెప్పుడూ గర్వించేదికాదు. మీరు కాగా యింతపని చేస్తున్నారని ఎవరైనా ఆమెపాఠశాలను గుఱించి ఆమెను స్తుతిస్తే "నేను చేస్తున్న గొప్పేమున్నది? మనపిల్లలచదువు కట్లాగో నెలకు నూరో నూటయాభైయో కర్చుపెట్టదలచే ఉన్నాముగదా. దానికి మరికొంత తోడుచేసి ఒక బడిగా పెడితే ఊళ్లో ఆడపిల్లలుగూడా చదువుకుంటా

రని అనుకున్నాము అంతే" నని నెమ్మదిగా జబాబు చెప్పేవారు.

సరస్వతమ్మగారి అనుదినజీవితమంతా పారమార్థికమే అయినప్పుడు వారి ఆధ్యాత్మిక జీవిత మెట్టిది అనే ప్రశ్న అనావశ్యకం. అయినా సాధారణంగా గృహములలో ఉండే మతసాంఘికాచారాలను శ్రద్ధతో అనుష్ఠించడమే కాకుండా తమగురునిర్దేశప్రకారము భర్తగారితో బాటు ప్రార్థనాదికములను శ్రద్ధతో నియమప్రకారం జరుపుతూ ఉండేవారు.

ఒక విద్యావిషయంలోనే కాకుండా యితర స్త్రీజనోద్ధరణకార్యాల్లో కూడా సరస్వతమ్మగారి కెంతో అభిలాష ఉండేది. ఒకసంవత్సరం బాపట్ల తాలూకా మహిళాసభకు స్వాగతసంఘాధ్యక్షురాలుగా ఉండి మంచి ఉపన్యాస మిచ్చారు. మూడేండ్లక్రిందట బాపట్లలో జిల్లామహిళాసభ జరిగినప్పుడు తమ పాఠశాలబాలికల నిచ్చీ, తమ పాఠశాలభవన మిచ్చీ, తమకారు నిచ్చీ ఆమె చేసిన సహాయం అగణితం, అసదృశం. మన దేశంలో సాధారణంగా పత్యనుకూలతా, ద్రవ్యోపపత్తీ ఉన్న స్త్రీలు భోగలాలసలై, చీరలకో నగలకో తిండ్లకో సొమ్ము వెచ్చిస్తూ యితోధికభోగా లనుభవించడమే గాని ప్రజాహితకార్యాలకూ, స్త్రీజనోద్ధరణకూ ఉపయోగించడం అరుదు. ఇయ్యది స్త్రీలలో విద్యాసంస్కారములు లేకుండుటవల్ల గల్గిన లోపం. సరస్వతమ్మగారు ఉదారాభిప్రాయాలు గల విద్యావతి కావడంచేత భగవదనుగ్రహంవల్ల తమకు చేకూరిన అవకాశమును స్త్రీజనోద్ధరణకు వినియోగించి స్త్రీల కందఱకూ మేలుబంతి కాగలిగారు. ఇటువంటి స్త్రీరత్నము లే కొందరున్నా భారత మహిళాభ్యుదయం అచిరకాలంలో నెరవేరగలదనడానికి సందేహంలేదు. "మంచివాళ్ల చావు మరణకాలమందు చూడ"మని తెలుగులో ఒకసామెత ఉన్నది. నిజంగా సరస్వతమ్మగారి మంచితనం ఆమెమృతదినమందే చూడాలె. యిరవై రోజులు విషజ్వరముచే పీడితురాలై ౧౯౫౩ సెప్టెంబరు ౨౮వ తేదీరాత్రి సరస్వతమ్మగారు స్వర్గస్థురాలైనారు. తెల్లవారేటప్పటికి ఆదుఃఖవార్త ఊరంతా ప్రాకింది. ఇక ఆమెకడసారిదర్శనానికివెళ్లిన జనసమూహానికిఅంతు లేదు. ఒకతిరునాళ్ళప్రజ కూడారని చెప్పవచ్చు. స్త్రీలు, పురుషులు, బాలురు, బాలికలు, ఉద్యోగస్థులు, అనుద్యోగులు, ఉపాధ్యాయినులు, విద్యార్థినులు, పూర్వనౌకరులు, పాలు, పెరుగు, కూరలు అమ్మేవారు, పాటకప్రజనులు—ఒక రేమిటి అంతా ఒకటే సమూహంగా ఒకటేదుఃఖం. అన్నిటివలెనే సరస్వతమ్మగారి మృత్యువుకూడా స్త్రీలను బులిపించేదే. ప్రేమాస్పదుడైన భర్త సన్నిధిని ఉండి కర్మకలాపమంతా కొమారులచేత అత్యంత శ్రద్ధతో జరిపించగా పుట్టెడు పసుపుకుంకుమలతో ఓలలాడుచూ వెళ్లిపోయినారు మా సరస్వతమ్మగారు.

స్త్రీలవిషయమై ఏకించిత్తు సేవజేసినా హర్షించి ఆమోదించి ఆశీస్సు లందించే ఆ మా సరస్వతమ్మగారు మాకిక లేరు. సరస్వతమ్మగారు మహిళాసభలకు వచ్చి మహోపన్యాసా లిచ్చినవారు కారు. ఏదో కారణం కల్పించుకొని పత్రికలలో పేర్లు ప్రకటించుకొన్నవారు కారు. కనుక వారిని ఆంధ్రమహిళాలోకము సర్తించలేకపోయింది. వారికి సానుభూతిసభలు జరుపలేకపోయింది. ఇటువంటివ్యక్తి మనరాష్ట్రమందైనా ఉంటే మనం నిముషంలో తెలుసుకోనేవాళ్లం. ఆమె మనతెలుగుబిడ్డ కావడమే మన అపరిచితికి కారణం. సరస్వతమ్మగారిది అలతియెరుగని కృషి. ఆడంబరములేని సేవ. కానుపించని త్యాగము. మొక్కవోని దీక్ష. "వేగజాము గలుగ వెడనిద్ర బొందుదుగాని రాజ్యభారకార్యయుక్తి-నజ్జనయన నాకు నాహారనిద్రల కెడము లేదు సువ్వె యెల్లప్రొద్దు" అని పాంచాలి చెప్పినట్టుగా ఎల్లప్పుడు విరామము లేని పని చేస్తూఉండేవారు. వారి జీవితములో ఒక్క నిముషము వ్యర్థము కాలేదు. అప్రాముఖ్యమైనవానికి రాగానూ, ప్రాముఖ్యమైనవానికి రాకుండగానూ చూడలేదు. అన్నిట అంతమెలకువతో వర్తించడమే ఆమెలో ఉన్న ప్రత్యేకత. "కీర్తిః శ్రీర్వాక్చ నారీణాం స్మృతి ర్మేధా ధృతిః క్షమా"—స్త్రీలయందుగల కీర్తి లక్ష్మి వాక్కు తెలివి బుద్ధి ధైర్యము ఓర్పు నేనే అన్నాడు శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీతలో. కనుక యిన్నీ ఒప్పిఉన్న ఈ మహాసాధ్వి దేవాంశసంభూత అనడంలో సందేహం లేదని నా దృఢాభిప్రాయం.

శ్రీ సరస్వతమ్మగారికి బాపట్లలో బాలికల నిమిత్తం ఒక హైస్కూలు నెలకొల్పవలె నని గొప్ప అభిలాష ఉండేది. ఆమె స్కూలు పెట్టిన మొదటి ఉద్దేశం అదే. ఆమె ట్రైనింగుస్కూలును పెట్టడం తటస్థించడం కాకతాళీయం. తొల్లిటి ఉద్దేశం నెరవేర్చుకోవలె ననే అభిప్రాయంతో మరల కృషి చేసి తమ పాఠశాలను క్రిందటి వత్సరం మిడిల్ స్కూలుగా మార్పించారు. ఈసంవత్సరమే దానిలో ఫోర్తుఫారం పెట్టించి క్రమక్రమంగా రెండేండ్లలో స్కూలుఫైనలు క్లాసు పెట్టించి హైస్కూలు చేయవలెనని ప్రయత్నం చేశారు. ఏలనో దైవం అనుకూలించలేదు. ఆప్రయత్నం పూర్తిగా ఫలించకముందే ఆమె స్వర్గస్థురాలైనారు. ఆమెగారికొరకు విచారించడంలో మన సానుభూతి తెలియపరచిన ప్రయోజనం లేదు. ఏ బాపట్లపురమునందు ఆమె విద్యాసంస్థలను నెలకొల్పి యింతకాలముగా పాటుబడుచుండిరో ఆ బాపట్ల పురవాసులందరూ సర్వవిధాలా తోడ్పడి యీ పాఠశాల అచిరకాలంలో ఉన్నతపాఠశాల అయ్యేటట్టు గట్టిప్రయత్నం చేయాలె. ఇదే సరస్వతమ్మగారికి గొప్ప స్మారక చిహ్నం. అంతేగాదు, పౌరుల కృతజ్ఞతకు నిరుపమానమైన చిహ్నంగూడా అదే.



# పిచ్చితల్లి

= శ్రీ విశ్వనాథ నరసింహము =



(గత సంచిక తరువాయి)

చనవుల నిచ్చకంబుల వశంబయినావొకో జవ్వనంపు సం
జను మధుమాసయామినుల జంచలవైతివొ నిర్మలోదయం
బున నినరశ్మి చిత్తము ప్రబోధము నందదు నిక్కవంబుగా
బ్రణయవిలాస మీవు సుకరం బని యెంచితి వేల బాలికా?

నవనవలాడు నాపసియనంటె విదిర్చెడి మొవ్వటాకు నో
జ వరలు కాంతిసంపద వసంతశుభోదయ మేగినంత నా
పవనకుమారు కౌగిలి నెపంబగు తాకుడులందు చీలిపో
నవునుగదా ముదంబౌనగునా యది నీకు కురంగలోచనా?

అల విరిమల్లెచేడె యధరామృత మానుచు శీతవాత సం
చలనము సోక నాయలి ప్రసన్నత సన్నరొదన్ వహించి యా
శల జవిచూపి మాపునిముసమ్మున నెఱ్ఱ గులాబికాంతముం
గల ప్రణయార్తి జెంది తమకమ్మున ముద్దిడబోక నిల్చునే?

వాని విలాసహాసము లవమ్మును నమ్మకు మమ్మ యింతలో
బూనిన మత్సరంబు గనబోదువు నిల్కడ లేనివాని న
జ్ఞానముచే వరించి పరుసమ్ముల బొందగ నేల తాలిమిన్
మానసమిచ్చు నేపురుషమాన్యు వరించి చరింపరాదొకో.

పున్నమ చందమామ కను మోసముగాదె తళుక్కుగాక యే
మున్నది నిక్కమౌ వెలుగు నోడక నెమ్మదికిం బ్రియమ్ము మా
పున్నది తేపునుం గలుగునోయమ చక్కని చుక్కకాంతి సం
పన్నత మెచ్చుకో మది జవంబు గడించి తలంపు శాంతిమై.—

అను హితవాక్యముల్ పలికినంతట నాజనయిత్రి పల్కులన్
మనమున నమ్మనీని తమి మానసముఁ బిరిగొన్న బ్రీతితో
డను వనసీమలం గలువడంబుల గట్టి నికుంజమందు ని
ద్రను గనుచుంటి ప్రేయసు నెదం గదియించి కరాబ్జయుగ్మమున్.

ఆ మురిపెంబు లానెనరు లా గిలిగింతలు మేలమాడుటల్
గోముగ కిళ్లిడన్ మలచి కొట్టుట వేడుకకయ్య మూని నే
గీమున మారుమోమిడ సఖీ! దయ నేలు మటంచు వేడుటల్
నామనమందు హత్తి విడనాడవు నెప్పటికైన నక్కటా.—

అని తలపోయుచున్ మఱచె నామె శరీరము శ్రాంతితోడ చిం
తనమున పూర్వపున్ స్మృతి మనంబున దోపగ; వాతపోతచా
లనము లెసంగె నంత విమలాంబరభాసుర తారకావళీ
మణులు దయార్ద్రచిత్తలయి మానిని గాంచె విలోకనప్రభన్.

హృదయవిదారణంబులగు నిక్కటులన్ మఱవంగజేయు, కో
విదులను మూఢచిత్తుల నభేదముగాగ నుయాలనూచు, బె
ట్టిదుల వినమ్రులన్ దన కుటీరమునన్ పవళింత నించు నా
నిదురపడంతి మాతయగు నిక్కముగా సమభావ సంపదన్.

కడుపున కెన్నియో గతుల గష్టము లందెడి మానవాళి కా
ఱడవుల మేత గైకొను విహంగమసంతతి ముందువెన్క లే
ర్పడ గనబోక యామిషము బట్ట జరించెడి జంతుసంతతుల్
గుడుతురు దివ్యభోగముల గూరిమి నిద్దుర సత్కృపామతిన్.

చలము వహించు మానవజన్ముడేని—ప్రణయినిన్ స్మరియించెడి పాంథుడేని
అలసి సొలసిన నిద్దుర వలచుగాదె—ద్వేషరాగంబు లత్తఱి దెలియరావు.

ఒడలు తెలియని నిద్దుర బడలుపడిన—పడతి యచ్చెరు వొదవంగ బహువిధముల
జిత్తవిభ్రమణము గూర్పజేయునటుల—వికసనము నొందె కలలోన వింతగదుర.

కలకలలాడుచుండు సహకారము లచ్చట లేజివుళ్ల శో
భలును నికుంజపుంజముల వర్ధిత సౌరభపుష్పగుచ్ఛ సం
కలితములై ప్రియంబగుచు గానమొనర్చు విహంగదంపతుల్
గలిగి వసంత నూతనవిలాసము లామెడ నుండు నిచ్చలున్.

అది మనోజ్ఞకాసారంబు హంసవితతి—ప్రణయమాధుర్యభావలన్ పంకజముల
లీలలం దేలియాడెడి మేలుపడుచు—ప్రియసఖులతోడ గూడుచు వేడ్కమీఱ.

జలజల పాఱు నిమ్నగపసందు గనుంగొన నీటిలోన తొ
ట్రిలుచు నినుండు రంగుల ధరించి కరంబుల జాపుచుండు నా
విలసనముల్ ప్రియమ్మగు సవిస్తర సత్ప్రణయాంతరంగలై
కలకలకూజితంబుల బికాళికి నామ్రమహీజ శాఖలన్.

రే లమృతాంశుదీధితులు శ్రీ లొలుకంగ నటించుచుండ శై
వాలలతల్ పెనంగొనగ భవ్యరుచుల్ వెలయించు కల్వలున్
చాలగగల్గు నాసరసి సర్వము సృష్టివిచిత్రమన్న వా
గ్జాలము గల్గజేయుగద జాల్మునకేని ప్రబోధమొందగన్.
సరసీకూలమునందలి—విరజాజుల తోపుపొంత వెలయు శివుండున్
చిరకాలమునుండియు నే—యిరవేనియు లేక యచట నిరుగురు ప్రీతిన్.

స్వచ్ఛదుకూలధారులు ప్రసన్న ముఖాబ్జము లొప్పగా స్వతం
త్రేచ్ఛ ప్రగాఢ మాట వివరింప గరంబుల బొల్చు మల్లికా
గుచ్ఛములన్ సమీరు డొక కొంత విలాసము దొంగిలింప గా
త్రచ్ఛవు లుల్లసిల్ల వనితామణియున్ రమణుండు నుండగన్.
అమలిన భావసంచయవిహారము చిత్తమునందు నిండ నే
మము గలయట్టి నాతి నవమంజులవాగ్విభవంబుతోడుతన్
రమణదలిర్ప నవ్యమధురం బగు హాసము చెన్నుమీఱఁ బ్రే
మమున గరంబునన్ ప్రియుని మార్దవ మొప్ప దెరల్చినంతటన్.

కాంతు డత్యంత మోదసంకలిత లలిత—హృదయమున్ వెలిపుచ్చి హరించె నాపె
రాగరంజిత చిత్తంబు ప్రాభవమున—గేరు తారకాసతులు వీక్షించుచుండె.

క్షణము నటు లేగ దవ్వుల గాంచె నేమొ—రభసమున నాతి పీడె విభ్రమము గదుర
రమణి రమణీయతారకాకారమణులదెస—తేరిచూచె లోచనములు తేజరిల్ల.

దవ్వుల గాంతు డొక్క వనితన్ రమణీయ ముఖాంబుజంబునన్
నవ్వొలయంగ ప్రేమవచనంబుల గేలున గే ద్రైమల్చె ; నా
జవ్వని మేలుచూపుల బిసాళితనంబున హాసరోచులున్
నివ్వటిలంగజూచె నతనిన్ తనమానస మిచ్చి మెచ్చుచున్.

ఉలికిపడి లేచె నంత నాయువిద వృక్షమూలమున నుండి, కరము కెంపును వహించె
ప్రాగ్దిశాకాంత రవికరగ్రహణరక్తి—మదిని బొదలిన వేడ్క ముమ్మరము గాఁగ.

కలలో గాంచిన దృశ్య మాయబల నిక్కంబంచు స్వాంతంబులో
పల జింతించి నిసుంగు నెత్తికొని యధ్వం బేమొ తా నెట్లు పో
వలెనో యంచు దలంప కేగె మదిలో ప్రాదుర్భవంబైన కో
ర్కులు మల్లాడగ పాదముల్ మెలివడన్ కోపంబు దీపింపగన్.

పోవగబోవ మానిసుల పోకడలున్న తలంబు జొచ్చి వా
పోవు పడంతి జూచిరి ప్రభూతవిషాదమనస్కులై జనుల్
తావు గనంగలేని వనితన్ గని పిచ్చిది పిచ్చి దంచు నే
మో వచనంబు లాడి మునుముందు జరించిరి బాలబాలికల్.

మోదము ఖేదమున్ గలియబోసినరీతిగ మాటిమాటికిన్
మేదుర మందహాసముల మిక్కిలి యూర్పుల బుచ్చు నేగుచో
తాదృశు లేరు లేరనగ తానొకసాక్షి నభంబునందు నా
పైదలి జూచుచుండె ననవద్యకరప్రభ లుల్లసిల్లగన్.

తెరువున నొక్క జవ్వని మదింగల హర్షము వెల్లడించు సుం
దరదరహాసరోచి వదనంబున దోపగ గాంతుతోడుతన్
సరసవచోవిలాసముల జాగొనరించుచు పిచ్చితల్లిపై
బటపె విలోకనంబులు కృపార్ద్రమనంబు కలంత జెందగన్.

